

శ్రీకాకుళం జిల్లా, నరసన్న పేటలో
27-12-2001 తేదీన స్వాతంత్ర్యసమర యోధులు,
మహాదాత, పూర్ణాయుష్కులు,కళాకారపోషకులు
శ్రీ పొట్నూరు స్వామి బాబు గారి
118వ జయంతి ఉత్సవం నాడు
అన్నమాచార్య సంకీర్తనలపై
ఉపన్యాసగానం చేసి వెయ్యిన్ని నూట పదహార్లు అందుకున్న
డా॥ పొన్నా లీలావతి
వేదిక పై పొట్నూరుస్వామి బాబు గారి మనుమలు
(కుమార్తె కొడుకులు) భక్తిజ్ఞాన విలసితులు,
వాత్సల్యహృదయులు, దాన ధర్మకార్యకర్తలు
శ్రీ ఎ.వామనమూర్తి గారు
శ్రీ టి.బాబ్జీ గారు
శ్రీ టి.గోపాల కృష్ణ గారు

# * సంకీర్తనా సౌరభం *

# SANKEERTHANA SAURABHAM

డా. పొన్నా లీలావతి
ఎం. ఎ, పి హెచ్.డి.
అసోసియేట్ ప్రొఫెసర్
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
రాజమండ్రి ప్రాంగణం
బొమ్మూరు-533 124
ఆఫీస్ ఫోన్ : 0883-419322
రెసిడెన్స్ ,, : 0883-466618

సంకీర్తనా సౌరభం

ప్రథమ ముద్రణ-2002

ప్రతులు - 1000

వెల రూ 100/-



ప్రతులకు : పి. వాణి, (M. Sc.)

C/o డా. పొన్నా లీలావతి, M.A., Ph.D.
అసోసియేట్ ప్రొఫెసర్
దేశిసాహిత్య శాఖ
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
రాజమండ్రి ప్రాంగణం, బొమ్మూరు-533 124

ఫోన్స్ : ఆఫీస్ - 0883-419322
రెసి - 0883-466618

ముద్రణ : తేజ ప్రింటర్స్, ఉమెన్స్ కాలేజీ రోడ్, రాజమండ్రి.

ముఖపత్ర చిత్రణ : శ్రీ కె. బాబూరావు (ఆర్టిస్ట్)

ముఖపత్ర ముద్రణ : మహేశ్వర ఆఫ్‌సెట్ ప్రింటర్స్, రాజమండ్రి.

This Book is published with the
Financial Assistance of
Tirumala Tirupati Devasthanams
undor their Scheme
'Aid to Publish Religious Books'

## అంకితం

తాత, నాన్న కష్టపడి సంపాదించిన నాలుగు ఎకరాల పంటపొలం నలువైపుల దురాక్రమణలకు గురికాకుండా నిలిచి ఉన్నందుకు ఎవరు కారకులో —

ఆప్తులను, అనాథలను, బంధుజనులను చేరదీసి, ఆశ్రయమిచ్చి కష్టార్జితాన్ని దానధర్మాలు చేసి, రేపు అనే మాటను మరిచి వస్తువులను, పదార్థాలను అందరికీ పంచి పెట్టి మిగిలితే తినడం లేకుంటే ఉపవాసాలు చేసే స్వభావం కలిగిన నా కుటుంబం మాటల కందని కష్టాల కడలిలో మునిగి ఉంటూ కూడా సురక్షితం కావడానికి ఎవరు కారకులో —

నా ఉనికికి, మనికికి, నా పిహెచ్.డి.కి నా ఉద్యోగానికి అమ్మమతికి, ప్రాణానికి, ఆరోగ్యానికి ఎవరు కారకులో —

నా నలుగురు చెల్లెళ్ళు, ఒక తమ్ముడు పెంపకాలకు, చదువుల జీవితాలకు ఎవరు కారకులో —

లౌకిక మైన చదువుల పరీక్షల్లోనేకాక అలౌకిక మైన దివ్యమాయా పరీక్షల్లోనూ సాధన చేసి విజయం సాధించాలని

పరిపూర్ణభక్తి జ్ఞానాలతో జీవన్ముక్తి పొందాలని బాల్యం నుంచీ ఇంటా బయటా అడుగడుగునా ఎన్నెన్నో అనూహ్యదుష్పరీక్షలకు గురి చేస్తూ అదృశ్యంగా అంటి పెట్టుకొని ఉంటూ ఎవరు నన్ను కాపాడుతున్నారో ...

వారికి

## శ్రీ వేంకటేశ్వర అన్నమాచార్య పాదారవిందాలకు

అంకితం.

# కృతజ్ఞతాంజలి

తిరుమల తిరుపతి దేవస్థానం వారి నిరంతర భక్తి శ్రద్ధల వల్ల, అమోఘమైన కృషివల్ల పరమ పవిత్రమైన, వేదపురాణ తుల్యమైన అన్నమయ్య సంకీర్తనలు విశ్వమంతా వ్యాపిస్తున్నాయి. అన్నమయ్య సంకీర్తనలు ప్రతి ఇంటా, ప్రతి నోటా, ప్రతి చోట శుభకార్యల్లో, వినోద కార్యల్లో, దేవాలయాల్లో వినిపించని క్షణమేలేదు. అన్నమయ్య సంకీర్తనల్లోని సంగీతాంశాల్ని, సాహిత్యాంశాల్ని లోకానికి తెలియజేసే మహాయజ్ఞాన్ని అన్నమాచార్య ప్రాజెక్ట్ చేపట్టి కొనసాగించడం వేనోళ్ళ ప్రశంసనీయం. విశ్వవిద్యాలయాలు, సంగీత, సాహిత్య, నృత్య కళానిలయాలు కూడా అన్నమయ్య సంకీర్తనల వ్యాప్తికి కృషి చేస్తుండటం అభినందనీయం.

తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తెలుగు అధ్యయన శాఖ అన్నమయ్య సంకీర్తనల్ని తొలిసారిగా ఎం ఎ విద్యార్థులకు ఐచ్ఛికాంశాలుగా పరిశోధకులకు ఎం.ఫిల్, పిహెచ్ డి పరిశోధవాంశాలుగా నిర్ణయించింది ఆవిధంగా నేను ఎం ఎ. లో అన్నమయ్య సంకీర్తనల్ని ఐచ్ఛికాంశ.గా చదవడం, ఆ సంకీర్తనల్లోనే జానపదగేయ వరుసలపై పిహెచ్ డి. చేయడం జరిగింది. అన్నమయ్య సంకీర్తనల్ని మా ఇంట్లో మాతాత, నాన్న ఆలపిస్తూ ఉండటం, నేను బాల్యం నుంచీ వింటూ ఉండటం వల్ల ఆ సంకీర్తనలపై ఎంతో అనురక్తితో అభ్యసించటం, పరిశోధించడం జరిగింది

పిహెచ్.డి. పరిశోధన చేయడానికి తిరుమల తిరుపతి దేవస్థానంవారు అన్నమాచార్య స్కాలర్‌షిప్ అన్నమాచార్య ప్రాజెక్ట్ ద్వారా మూడు సంవత్సరాలు నెలకు 600 రు॥ ఇచ్చి ప్రోత్సహించడం నా భాగ్యవిశేషం.

ఆనాటి నుంచి నాయొక్క, నాతల్లిదండ్రుల, ఐదుగురు తోడబుట్టువుల జీవిత రథాలు అభివృద్ధిమార్గంలో ఆహ్లాదకరంగా ముందుకు సాగాయి. తరతరాలుగా దాతృత్వం, హరిభక్తి, సంగీత సాహిత్య నాటక హరికథా కళా విశిష్టత మూలధనంగా, ప్రవృత్తిగా కలిగిన వంశంలో పుట్టిన నేను అన్నమాచార్య సంకీర్తనల్ని అభ్యసించడం, అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుల అనుగ్రహంవల్ల రెండు ప్రభుత్వోద్యోగాలు వరించి రావడం నా అదృష్టం

చివరికి విశ్వవిద్యాలయం ఉద్యోగంలో ప్రవేశించి స్థిరపడి తల్లిదండ్రుల, తోబుట్టువుల జీవితావసరాలకు, వారి విద్యావికాసాలకు అండదండగా నిలవడం ఈ శుభపరంపరలన్నీ దైవికంగానే జరిగాయి.

అందువల్ల అన్నమయ్య సంకీర్తనల అధ్యయనానికి, పరిశోధనకు ఎడబాటు రానివ్వకుండా ఆ సంకీర్తనల్ని వివిధ కోణాలనుంచి ఆలోచించి వ్యాసాలు వ్రాయడం, వాటిని గ్రంథాలుగా ముద్రించడం అన్నమయ్య శ్రీ వెంకటేశ్వరుల భక్తిహృదయులకు ముముక్షువులకు పంచిపెట్టడం నాకు అత్యంత ప్రీతికరం,

ఆ విధంగా అన్నమయ్య- పెదతిరుమలయ్య, చినతిరుమలయ్య, క్షేత్రయ్య, రామదాసు, సారంగపాణి, త్యాగయ్య వంటి పదకవుల పద సాహిత్యంలో నాకు నచ్చిన, లోకానికి అవసరమైన అనేక అంశాల్ని వెలికి తీసి గ్రంథాలరూపంలో సాహితీ లోకానికి అందించడం జరిగింది. వీటిలో నాలుగు గ్రంథాలకు టి.టి.డి. వారు ఆర్థిక సహాయం అందించి నన్ను గ్రంథముద్రణా యజ్ఞానికి ప్రోత్సహించారు.

తగినంత తీరిక, శ్రద్ధ కలిగినప్పుడు నేను సంకీర్తనల్ని శోధించి వ్యాసాలు వ్రాయడమేకాక ఎన్నో సాహిత్య సంస్థలు, భక్తితత్పరులు, అన్నమాచార్య ప్రాజెక్ట్ అధికారులు, వివిధ విశ్వవిద్యాలయాలవారు వివిధ సందర్భాల్లో కూడా నాచేత వ్రాయిస్తూ ప్రోత్సహిస్తుంటారు. వాటినికూడా గ్రంథరూపంలో ముద్రిస్తే విద్యార్థులకు, పరిశోధకులకు, సాహిత్య ప్రియులకు ఉపయోగపడుతుందని భావించి "సంకీర్తనా సౌరభం" అనే పేరుతో గ్రంథం ముద్రించడం జరిగింది

"డా. లీలావతిగారు సాహిత్యపీఠంలో జరిగే ప్రతీ సాహితి సభాకార్యక్రమ ప్రారంభంలో అన్నమాచార్య సంకీర్తనా గానంతో జయభేరి మ్రోగిస్తారు" అంటూ ఎంతో పెద్దమనస్సుతో నా సంకీర్తనాగానాన్ని వర్ణనాత్మకంగా ప్రశంసిస్తూ ప్రోత్సహించే మా సాహిత్యపీఠాధిపతి, ప్రతిభావైజయంతిక పురస్కారగ్రహీత, మైసూర్ శ్రీ గణపతి సచ్చిదానందస్వాములవారి శ్రీ దత్తపీఠంలో ఆస్థాన విద్వాంసులు ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారికి,

సభల్లో నేను పాడిన అన్నమాచార్య సంకీర్తనల్ని విని ముగ్ధులై 'అన్నమయ్య సంకీర్తనల్ని ఎంతబాగా పాడతావమ్మా' అంటూ ఆశ్చర్య ఆనందాలతో ఆశీర్వదించి ప్రోత్సహించే ప్రఖ్యాత కవి, సాహిత్యవేత్త, కేంద్ర సాహిత్య అకాడమి పురస్కార గ్రహీత, మా విశ్వవిద్యాలయం మాజీవైస్‌చాన్స్‌లర్, ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు అధ్యాపకులు, కర్తవ్య దీక్షా పరాయణులు ఆచార్య ఎన్. గోపీగారికి

ఇంకా మా పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో అన్ని ప్రాంగణాల్లోని అధ్యాపక, అధ్యాపకేతర బృందానికి, పరిశోధకులకు, విద్యార్థులకు నా శ్రేయస్సుకోరే ప్రతిఒక్కరికి,

ఈ గ్రంథముద్రణకు పదిహేనువేలు ఆర్థిక సహాయం అందించి తోడ్పడిన తిరుమల తిరుపతి దేవస్థానం అధికారులకు, శ్రీ వేంకటేశ్వర స్వామివారికి,

ఈ గ్రంథముద్రణను సకాలంలో పూర్తిగావించిన తేజ ప్రింటర్స్ యాజమాన్యం వారికి, కవర్‌పేజీ ఆర్ట్ డిజైన్‌చేసిన శ్రీ కె. బాబూరావుగారికి, కవర్ పేజీని ముద్రించిన మహేశ్వర అఫ్‌సెట్ ప్రింటర్స్ యాజమాన్యం శ్రీ రామకృష్ణారెడ్డిగారికి,

ఇలా జన్మతారకమైన, జనరంజకమైన అన్నమయ్య సంకీర్తనా సాహిత్య పరిశోధనకు, సభాప్రసంగాలకు, పదస్సు పత్ర సమర్పణలకు అవకాశం ఇచ్చి ప్రోత్సహించే సౌజన్యమూర్తులకు, నా గ్రంథాలను ఎంతో శ్రద్ధతో చదివి అభినందిస్తూ ప్రోత్సహించే సహృదయ పాఠకోత్తములకు నా హృదయపూర్వక కృతజ్ఞతాంజలి. వారందరిపై అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుల దివ్యానుగ్రహ కిరణాలు ఎల్లప్పుడూ ప్రసరించాలని అభిలషిస్తున్నాను.

—పొన్నా లీలావతి

# ముఖ్య గమనిక

కొంతమంది రచయితలు నా పరిశోధన గ్రంథాల్లోని, నా సృజనాత్మక కావ్యాల్లోని స్వీయానుభవ వాక్యాలను పేరాలుగా, పేజీలుగా స్వీకరించి తమ గ్రంథాల్లో ముద్రించుకుంటున్నారు. కనీసం ఉపయుక్త గ్రంథాల్లోను, పాదసూచికల్లోను నా గ్రంథాలను చేర్చడంలేదు. చిన్నవాళ్ళకు, విద్యార్థులకైతే చెప్పగలం. పెద్దవాళ్ళకు ఉద్దేశపూర్వకంగా చేసేవాళ్ళకు ఏమని చెప్పగలం? మనసంటూ ఒకటుందని, పైన భగవంతుడంటూ ఒకడున్నాడని గుర్తించుకోవాలని, ఎవరినుంచి, ఏ గ్రంథంనుంచి ఎంతెంతసహాయం తీసుకున్నామో నిజాయితీగా కృతజ్ఞతలు చెప్పడం మన కనీసధర్మం

అలాగే సభల్లో ప్రసంగించేవారు, పాడేవారు నా గ్రంథాల్లోని వ్యాఖ్యానం స్వీకరించి ఉపయోగించుకున్నప్పుడు, అన్నమయ్య సంకీర్తనల్నిగానీ, అన్నమయ్యపై నేను వ్రాసిన పాటల్నిగానీ పాడివినిపించినప్పుడు మూలకర్తల పేర్లను తెలియజేయడం కనీస కర్తవ్యం అని హెచ్చరిక చేయడమయింది.

—రచయిత్రి

ఈ సందర్భంగా అన్నమయ్య తన సంకీర్తనల్లో చెప్పిన వాక్యాలు గుర్తుకొస్తున్నాయి. ఒకరు వ్రాసిన విషయాల్ని ఆ కర్తలపేర్లు చెప్పకుండా తమ పేరుతో వ్రాసుకునేవాళ్ళను, చెప్పేవాళ్ళను అన్నమయ్య 'వెర్రులాల' అని సంబోధించాడు. ఒకరు చెప్పినదాన్ని తమ పేరుతో చెప్పితే శ్రీహరి మెచ్చడు. కాబట్టి అలాంటి పనులు మానేసి ఒల్లువంచి తడికెలు అల్లుకోవడం మేలు. ఒకరు తినేసిన పుల్లిఆకులో మరొకరు తినడం యోగ్యం కాదు అని పోలికతో వివరించి చెప్పి అధిక్షేపించాడు. తన కాలంనాటి ప్రజలకు జ్ఞానోదయం కలిగేలా చేశాడు

వెర్రులాల! మీకు వేడుక కలిగితేను
అర్రువంచి తడుకల్లంగరాదా
బడినొకరు చెప్పిన ప్రతి వేరొకరు చెప్పబోతేను
అడరి శ్రీహరి కర్త ముకాదు

—అన్నమయ్య

## మరో ముఖ్యగమనిక

ఈ పుస్తకం ముద్రణకాలంలో ఎంతో ఓర్పుతో, శ్రద్ధతో ప్రతి అక్షరాన్ని పరిశీలించి తప్పుల్ని సవరించి ఇవ్వడం జరిగింది. అయినా అక్కడక్కడా అచ్చుతప్పులు కనిపిస్తే పాఠకులు సహృదయంతో పూర్వాపర అక్షరాల్ని బట్టి వాటిని సవరించుకొని చదువుకోవలసిందిగా ఆత్మీయంగా విన్నవిస్తున్నాను. ఈ పుస్తకంపై పాఠకులు తమ హృదయస్పందనలను ఉత్తరాలద్వారాగానీ వారి వీలునుబట్టి తెలియజేస్తే మహాభాగ్యంగా భావిస్తాను. పాఠకుల ప్రోత్సాహం, అభిమానం సాటిలేనివి. ఋణం తీర్చుకోలేనివి.

—రచయిత

# విషయ సూచిక

# 1. అన్నమయ్య అష్టవిధ నాయికలు

## 1.1. ప్రస్తావన :

పదకవితా పితామహుడు, హరిసంకీర్తనాచార్యుడు అయిన తాళ్ళపాక అన్నమాచార్యులు సంస్కృత భాషలోను, తెలుగు భాషలోను, గ్రాంథిక మార్గంలో, వ్యవహారిక మార్గంలో సంకీర్తనలు రచించినా అందులో మహాకావ్య లక్షణాల్ని కూడా పొందుపరచాడు అన్నమయ్య శ్రీ వేంకటేశ్వర ముద్రతో ఆ స్వామి వారిపై శృంగార అధ్యాత్మ సంకీర్తనలు రచించాడ. ఇవి మధురభక్తి లేక ప్రేమభక్తికి చెందినవి. లోకనాథుడైన శ్రీ వేంకటేశ్వరునె నాయకునిగా, లోకమాతఅయిన పద్మావతినే నాయికగాచేసి వారి ప్రణయాన్ని, విరహాన్ని, సౌందర్యాన్ని, సమైక్యతను అన్నమయ్య ఎంతో రమ్యంగా వర్ణించాడు. కొన్ని సంకీర్తనల్లో అన్నమయ్యే ప్రేయసిగామారి స్వామివారిని ప్రియునిగా భావించి పరితపించడం, స్వామివారి అనుగ్రహం పొంది పంతృప్తి చెందడం కనిపిస్తుంది. రాధ, మీరాబాయి, గోదాదేవి మొదలైన భక్తురాండ్రు ఈ ప్రేమమార్గంలోనే అశాశ్వతమై ఐహిక పురుషులను నిరాకరించి శాశ్వతమైన పరమపురుషుని ఆరాధించి ఆ స్వామిలోనే లీనమయ్యారు లోకానికి పూజనీయులు, ఆరాధనీయులయ్యారు. ఈ విధమైన మధురభక్తి పూరితమైన అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో అష్టవిధ శృంగార నాయికల్ని గుర్తించవచ్చు.

## 1.2. అష్టవిధ నాయికలు-లక్షణాలు-సమన్వయం :

అవస్థాభేదాన్ని బట్టి శృంగార నాయికలు ఎనిమిది రకాలుగా ఉంటారు. అన్నమయ్య సంకీర్తనల్లో ఈ ఎనిమిది రకాల నాయికల్ని గుర్తించి వివరించడం జరుగుతుంది.

### 1.2.1. స్వాధీన పతిక (స్వాధీన భర్తృక) :

నాయకుని (పతిని, లేక ప్రియుని) తన స్వాధీనంలో ఉంచుకొని ఆనందించే నాయిక స్వాధీనపతిక. అన్నమయ్య సంకీర్తనల్లో ఈ లక్షణాలున్న సంకీర్తనలు విశేషంగా కనిపిస్తాయి.

## పాడి

అలమేలుమంగ నీవభినవరూపము
జలజాక్షు కన్నులకు చవులిచ్చేవమ్మా॥

గరుడాచలాధీశు ఘనవక్షమున నుండి
పరమానంద సంభరితవై
నెరతనములు చూపి నిరంతరము నాథుని
హరుషించఁగఁ జేసితి గదమ్మా॥

శశికిరణములకు చలువల చూపులు
విశదముగా మీఁదవెదజల్లుచు
రసికత పెంపున కరగించి యెప్పుడు నీ
వశము చేసుకొంటి వల్లభునోయమ్మా॥

రట్టడి శ్రీ వేంకటరాయనికి నీవు
పట్టపురాణివై పరగుచు
వట్టి మాకులిగిరించు వలపు మాటల విభు
జట్టిగొని వురమున సతమైతివమ్మా॥ (12-160)

అన్నమయ్య సంకీర్తనల్లోని నాయికానాయకులు లేక సతీపతులు లేక ప్రేయసి ప్రియులు దేవతామూర్తులైన పద్మావతీ శ్రీనివాసులు. మానవ కాంతల, మానవ పురుషుల అందచందాలు కాలక్రమేణ నశించిపోతాయి. కానీ దివ్యులైన అలమేల్మంగా శ్రీ వేంకటేశ్వరుల సౌందర్యం ఎప్పటికీ క్రొత్తగానే ఉంటుంది. అలమేల్మంగ నవయౌవన రూపం పద్మనేత్రుడైన శ్రీ వేంకటేశ్వరునికి నిరంతరం సరిక్రొత్త రుచుల్ని కలిగిస్తుంటుంది

ఏ మాత్రం ఎడబాటు లేకుండా ఆమె స్వామివారి వక్షస్థలంలోనే ఉంటూ పరమానందం అనుభవిస్తూ, తన జాణతనాలను చూపిస్తూ నిరంతరం ఆనందింప చేస్తుంటుంది. చంద్రకిరణాలకు దీటుగా తన చల్లని చూపుల్ని స్వామివారిపై వెదజల్లుతు అతనిలో రసికత్వాన్ని అతిశయింప చేసి మనసును కరగించి అతను ఎప్పుడూ తనస్వాధీనంలో ఉండేలా

చేసుకున్నది. సమర్థుడైన శ్రీ వేంకటేశ్వరునికి పట్టపు రాణిగా శోభిస్తూ వింతైన వలపుమాటలతో నాథుని వశంచేసుకొని ఆతని వక్షస్థలంలో శాశ్వత స్థానాన్ని సంపాదించుకున్నది.

ఈ సంకీర్తనలో అన్నమయ్య సఖిగా మారి పద్మావతి సౌందర్యాన్ని, ఆమె జాణతనాలను, ఆమె చల్లని చూపుల్ని ప్రశంసిస్తూ వీటిచే విభుడైన శ్రీ వేంకటేశ్వరుని వశం చేసుకున్నావని ఆత్మీయంగా అభినందిస్తున్నట్లు వ్యక్తమవుతుంది ఈసంకీర్తనను స్వాధీన పతిక లక్షణానికి ఉదాహరణగా చెప్పవచ్చు. ఇలాగే మరో సంకీర్తన

### మంఖారి

ఇదిగాక సౌభాగ్య మిదిగాక తపము మఱి
యిదిగాక వైభవం బిఁక నొకటి కలదా॥

అతివజన్మము సఫలమై పరమయోగివలె
నితర మోహాపేక్షలన్నియును విడచె
సతికోరికలు మహాశాంతమై యిదెచూడ
సతత విజ్ఞాన వాసన వోలె నుండె॥

తరుణీ హృదయము కృతార్థత పొంది విభుఁమీది
పరవశానంద పంపదకు నిరవాయ
సరసిజానన మనో జయుమంది యింతలో
సరిలేక మనసు నిశ్చల భావమాయ॥

శ్రీ వేంకటేశ్వరుని చింతించి పరతత్వ
భావంబు నిజముగా పట్టె చెలి యాత్మ
దేవోత్తముని కృపాధీనురాలై యిపుడు
లావణ్యవతికి నుల్లంబు తిరమాయ॥ (12-17)

జగన్నాయకుడైన శ్రీ వేంకటేశ్వరుని అనుగ్రహం పొందడం, ఆ స్వామి హృదయంలో స్వామి స్థిరంగా నెలకొనడంకన్నా నాయికకు ఇంకేమీ అవసరం లేదు. అదే ఆమెకు సౌభాగ్యం, అదే తపస్సు, అదే వైభవం.

వేంకటేశ్వరుని కృపకు పాత్రురాలై పద్మావతీజన్మ సఫలమయింది. ఆమె ఇప్పుడు ఇతరమైన మోహాలు, కోరికలు అన్నీ వదలిపెట్టి పరమ యోగిని వలె నిశ్చలంగా, నిర్మలంగా, మహాప్రశాంతంగా, నిరంతరం విజ్ఞాన సౌరభంలాగావుంది. ఆమె కోరిక సిద్ధించి ఆమె హృదయం విభునిమీద పరవశానందమనే సంపదకు స్థానమయింది. పద్మముఖి అయిన ఆమె మనస్సు విజయాన్ని పొంది నిశ్చలభావం అయింది. ఆమె శ్రీ వేంకటేశ్వరుని కృప పొంది ఆమె మనస్సు స్థిరమయింది అని ఒక సఖి మరో సఖితో నాయిక శ్రీ వేంకటేశ్వరుని కరుణకు పాత్రురాలై ఏ విధమైన చింతలు లేకుండా నిశ్చలంగా, దివ్యానందంగా ఉందని తెలియజేస్తుంది. ఈ సంకీర్తనలో నాయకుడైన శ్రీ వేంకటేశ్వరుడు నాయిక అయిన పద్మావతికి సంపూర్ణంగా వశుడయ్యాడని, ఇక ఏ విధమైన బాధలు ఆమెకులేవనే భావన వ్యక్తమవుతుంది. కాబట్టి ఈ సంకీర్తనను కూడా స్వాధీనపతిక లక్షణాలకు ఉదాహరణగా చెప్పవచ్చు.

## 1.2.2. వాసక సజ్జ లేక వాసకసజ్జిక :

ప్రియుడు వచ్చే సమయానికి తనను, తన గృహాన్ని అలంకరించుకుని సిద్ధంగా ఉండే నాయిక వాసకసజ్జ లేక వాసకసజ్జిక. అన్నమయ్య సంకీర్తనల్లో ఇలాంటి వాసక సజ్జిక నాయిక లక్షణాలుకూడా కనిపిస్తాయి

### కాంభోది

ఎప్పుడు గాని రాడో యెంత తడవాయ కాలి
చప్పుడాలకించిమతి జల్లు రనెనమ్మా॥

ఇద్దరి మదరి పాటు యేకాంతాన నాడుకొన్న
సుద్దులు దలచి మేను చురుకనె నమ్మా
పెద్దగా కస్తూరి బొట్టు పెట్టిన నాతడుగోర
తిద్దుట తలచి మేను దిగులనెనమ్మా॥

పాయక యాతఁడూ నేను పవ్వళించే యింటివంకఁ
బోయి పోయి కడు చిన్న బోతినోయమ్మా
తోయపు గుబ్బల చన్నుదోయి మీద వాడొత్తిన
పాయపు చంద్రుల చూచి భ్రమసితినమ్మా॥

కూడిన సౌఖ్యములందు కొదలేని వాని నా
వేడుక మతి తలచి వెరగాయనమ్మా
యీడులేని తిరువేంకటేశుడిదె నాతోడ
నాడినట్టే నా చిత్తమలరించెనమ్మా॥ (12-46)

ఈ సంకీర్తనలో నాయిక తనను తన గృహాన్ని అలంకరించుకొని ప్రియునికోసం ఎదురుచూడటం, తన విరహవేదన సాటి స్త్రీకి చెప్పుకోవడం వ్యక్తమవుతుంది కాబట్టి ఇందులోని నాయిక వాసకసజ్జికగా చెప్ప వచ్చు. ప్రియుడు వెళ్ళి చాలాసేపు అయ్యింది. ఇంకా రాలేదు. కాలి చప్పుడు విని నాగుండె జల్లుమనిందమ్మా ఇద్దరం ఏకాంత సమయంలో చెప్పుకున్న మాటలు తలచుకుంటే నా శరీరం చురుకుమన్నది. నుదుటిపై పెద్ద కస్తూరిబొట్టు పెట్టుకున్న అతడు గోరుతో దిద్దుకోవడం తలచుకుంటే శరీరం దిగులుచెందిందమ్మా అతనూ, నేను పడుకునే ఇంటివైపు వెళ్ళి ఎంతో బాధపడ్డాను నిండైన వక్షస్థలంమీద అతడు వత్తిన చంద్రవంకలను (నఖాలగుర్తులు) చూచి భ్రమచెందానమ్మా. కూడిన సౌఖ్యాల్లో కొదువలేని అతన్ని ఆహ్లాదంగా తలచుకొని అతను లేదనందువల్ల భయం కలిగింది చివరికి సాటిలేని శ్రీ వేంకటేశ్వరుడు నాకు చెప్పిన విధంగా నా మనసును అలరించాడమ్మా అని వాసకసజ్జిక అవస్థలోని నాయిక సాటిస్త్రీకి చెప్పుకోవడం వ్యక్తమవుతుంది. అన్నమయ్య తన శృంగార సంకీర్తనల్లో నాయికా నాయకుల విరహాన్ని వర్ణించినా, కోపాన్ని వర్ణించినా, సంకీర్తన ముగింపులో నాయికా నాయకుల సమైక్యతను తెలియజేస్తాడు. దీన్నిబట్టి ప్రకృతి పరమాత్మలు ఎప్పటికైనా ఒకటి అవుతాయని, ప్రకృతిలోని ప్రతి చరాచరం పరమాత్మలో ఐక్యతకోసం పరితపించాలని భావించినట్లు తెలుస్తుంది.

## 1.2.3. విరహోత్క లేక విరహోత్కంఠిత:

చెప్పిన సమయానికి ప్రియుడు రాకుండా ఆలస్యం చేసినప్పుడు ఉత్కంఠ (వేగిరపాటు) చెందే నాయిక విరహోత్క లేక విరహోత్కంఠిత. అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో ఈ నాయిక లక్షణాలు కూడా అనేకం కనిపిస్తాయి.

### కాంభోది

తమ్ములాల అన్నలాల తల్లులాలనే
నెమ్మనపు హరి బాసి నిలువ లేనికను॥

కొమ్మలాల మరుకోట కొమ్మలాలవో
యమ్మలాల తొలరె నాయకులాల
తమ్మిరేకు కన్నుల యాతని బాసినే
నుమ్మల సొమ్మల చేత నుండలేనికను॥

చెలులాల కలికి తొయ్యలు లాలవో
యెల జవ్వనముల మోహినులాల
చెలువంపు హరి తలచిన నాకు నే
నులుకు కన్నీరాపకుండ లేనికను॥

పోటులాల జవ్వనపు మేటులాలవో
గాటపు తురుముల చీకటు లాల
వాటమైన వేంకటేశ్వరు బాసి నే
నాట దాననై జన్మమంద లేనికను॥ (12-99)

నాయకుని ఎడబాటును ఏమాత్రం భరించలేని నాయిక విరహ వేదనతో తల్లడిల్లుతూ ఇరుగు పొరుగు తమ్ములకు, అన్నలకు, తల్లులకు తన బాధను వ్యక్తం చేసుకోవడం ఈ సంకీర్తనలో కనిపిస్తుంది.

ఓ తమ్ములాల, అన్నలాల, తల్లులాల నేను నిండైన మంచి మనస్సు కల్గిన తామరరేకులవంటి కన్నులు కలిగిన, అందమైన, అను

కూలుడైన శ్రీహరిని వదలి నిలువలేను. ఈ విరహవేదనను భరించలేను. కన్నీరు ఆపుకోలేను. ఇక స్త్రీనై జన్మించలేను అని శ్రీహరి సౌందర్యాన్ని, అతని నిర్మల మనస్సును అందరికీ తెలియచేస్తూ తన విరహతాపాన్ని వ్యక్తం చేసుకుంటోంది. ఈ సంకీర్తనలోని నాయిక విరహోత్కంఠితగా స్పష్టమవుతుంది.

## దేసాళం

మేడలెక్కి నిన్నుజూచి కూడెననె యాసతోడ
వాడుదేరి వుస్సురందురా వెంకటేశ
యాడనుంటీ విందాకాసురా॥

దప్పిగొంటి వనినీకు కప్పురముపార మిచ్చి
ముప్పిరి నీ విరహానను వెంకటేశ
నిప్పనుచు భ్రమసితిరా॥

నిండపూచిన మానిపై గండుకోవిల కూయగా
నిండిన నీ యెలుగంటాను వెంకటేశ
అండకు నిన్ను రమ్మంటిరా॥

మల్లెపువ్వు కొనదాని ఝల్లునను పులకించి
ఉల్లము నీ కొప్పించితిరా వెంకటేశ
కల్లకాదు మమ్ము కావరా॥

పట్టుచీర కొంగుజారి గుట్టుతో నేనుండగా
వట్టి నవ్వులేల నవ్వేవు వెంకటేశ
దిట్టవు నీయంత వారమా॥

నీకు వలచిన వలపులు పులకలెత్తె నా మదిని
వాక్కు నసే చెప్పజాలరా వెంకటేశ
లోకమెల్ల ఎరిగినదే॥

పాయము నీకొక్కనికే చాయగా మీదెత్తితిని

ఈ యెడ కైవాల కుండను వెంకటేశ
మాయింటనే పాయకుండరా॥

ముమ్మాటికి నీ బాసలే నమ్మివున్న దానివేను
కుమ్మరించరా సికరుణ వెంకటేశ
చిమ్మ చీకటెల్ల పాయను (13-223)

అన్నమయ్య ఒక్కోసారి తానే సఖిగా, తానే పద్మావతిగా మారి తన ప్రియదైవమైన శ్రీ వేంకటేశ్వరుని ఎడబాటుకు తట్టుకోలేక విరహవేదన చెందడం కనిపిస్తుంది.

ఈ సంకీర్తనలో నాయిక తన నాయకుడైన శ్రీ వేంకటేశ్వరుని కలుసుకోవాలని మేడమీదకెక్కి చూస్తుంది.

అక్కడ శ్రీ వేంకటేశ్వరుడు కనబడకపోయేసరికి ఆమె నిరాశతో నిట్టూర్పు విడుస్తుంది. తర్వాత కొంతసేపటికి తన ప్రియుడు రాగానే తాను చెందిన విరహవేదనను, తన ప్రియుడైన శ్రీ వేంకటేశ్వరునిపై తన కున్న అనన్య, అవ్యాజమైన ప్రేమానురాగాల్ని వ్యక్తంచేస్తుంది.

వెంకటేశా! నీకు దప్పికగా వుందని కర్పూరం అందించాను. విరహతాపంతో కాగిపోతున్న నేను ఆకర్పూరాన్ని నిప్పుగా భ్రమచెందాను. (విరహవేదనలో ఉన్నవారికి చంద్రుడు, చందనం, నీరు, పువ్వులు, చిగురాకులు మొదలైన శైత్యోపచారాలు (విరహబాధను ఇంకా అతిశయింప చేస్తాయని పూర్వకవుల కావ్యాల్లో వర్ణితమయ్యాయి). నిండుగా పుష్పాలు వికసించిన చెట్టుపై గండుకోయిల కూస్తే అది నీ స్వరం అనుకుని దగ్గరకు రమ్మని పిలిచాను, అని తన విరహవేదనను, తాను చెందిన భ్రాంతిని తెలియచేస్తుంది. అంతేకాక ఆ స్వామిపై తనకున్న మమతానురాగాల్ని తెలుపుకుంటుంది.

మల్లెపువ్వు వసంతఋతువులో పుష్పించే పుష్పం. ఇది ప్రేయసీ ప్రియుల్లోని ప్రేమానురాగాల్ని పెంపొందింపజేస్తుంది అలాంటి మల్లెపువ్వు కొనను తాకగానే పులకించిపోయి నా మనసును నీకు ఒప్పించానురా

వెంకటేశా! పట్టుచీర కొంగుజారి గుట్టుగానేనుంటే ఊరకే ఎందుకు నవ్వు తావు. వెంకటేశా! నేను నీఅంత చతురురాలను కాను. నీకోసం వలచిన వలపులు నా మనస్సులో పులకలెత్తాయి. వాటిని గూర్చి వాక్కులతో నేను చెప్పలేను ఈ వలపు ఎలాంటిదో లోకానికంతా విశదంగా తెలుసు. ఈ ప్రాయాన్ని నీకొక్కడికే వశం చేసాను ఏమాత్రం ఎడబాటులేకుండా మాయింటిలోనే వుండరా వెంకటేశా! మాటిమాటికి నీవు చేసిన ప్రమాణ వాక్కులనే నమ్ముకొని వున్నదాన్ని.

నాపై నీ కరుణామృతాన్ని అలముకున్న చీకట్లు పటాపంచ లయ్యేలాగా కుమ్మరించరా వెంకటేశా అని నాయిక ఎంతో ప్రేమగా, ఆత్మీ యంగా అభ్యర్థించడం ఇందులో వ్యక్తమవుతుంది. ఈ సంకీర్తనలో నాయిక తన విరహతాపాన్ని, అనితర సామాన్యమైన ప్రేమానురాగాల్ని తన నాయకునితో ప్రత్యక్షంగా విన్నవించుకోవడం స్పష్టమవుతుంది.

## 1.2.4. విప్రలబ్ధ :

ముందు నిర్ణయించుకున్న సంకేత స్థలానికి వెళ్ళి చూడగా అక్కడ ప్రియుడు లేనప్పుడు, అక్కడికి ప్రియుడు రానప్పుడు విరహంతో బాధపడే నాయిక విప్రలబ్ధ రసమంజరీకారుడు, పూర్వ అలంకారికులు విప్రలబ్ధకు చెప్పే లక్షణాల్లో సంకేతస్థానానికి ప్రాముఖ్యం ఇచ్చారు. కానీ శృంగారమంజరీ కారుడుమాత్రం సంకేతవిషయాన్ని తొలగించి, ప్రియుడు రాకపోవడం వల్ల విరహాతిశయంతో బాధపడే నాయిక అనే అర్థాన్ని చెప్పా డని ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారు పేర్కొన్నారు. తాళ్ళపాక వారి శృంగార పదాల్లోని నాయిక సర్వత్ర స్వీయమే అందును దివ్య. అట్టి జగజ్జనని దివ్యశృంగార వర్ణన సందర్భంలో "సంకేత" స్థలాల ప్రసక్తే వుండదని కూడా ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారు తెలిపారు. అందు వల్ల విప్రలబ్ధకు విరహవేదన చెందే నాయిక లక్షణాలున్న సంకీర్తననే ఉదహరించడం జరిగింది.

# సామంతం

పొద్దిక నెన్నఁడు వొడచునొ పోయిన చెలి రాదాయను
నిదురకంటికి తోపదు నిమిషం బొక యేఁడు॥

కన్నుల నవ్వేడి నవ్వులు గచ్చి తనంబుల మాటలు
నున్నని యొయ్యారంబులు నొచ్చిన చూపులును
విప్పఁ దనంబులు మఱపులు వేడుక మీరిన యలపులు
సన్నపు చెమటలుఁ దలచిన ఝుల్లనె నామనసు॥

ఆగిన రెప్పల నీరును నగ్గలమగు పన్నీటను
దోఁగియుఁ దోఁగని భావము దోచిన వయ్యెదయు
కాఁగిన దేహపు సెకలును కప్పిన పువ్వుల సౌరబులు
వేగిన చెలితాపమునకు వెన్నెల మండెడిని॥

దేవశిఖామణి తిరుమల దేవుని దలచినఁ బాయక
భావించిన యీ కామిని భావము లోపలను
ఆ విభుడే తానుండిక నాతడె తానెఱఁగఁ గపటె
నీ వెలదికి గల విరహంబేమని చెప్పుదుము॥ (12-138)

నాయకుడు ఎంతకూ తనదగ్గరకు రాకపోయేసరికి నాయిక తన చెలిని తన నాయకుని దగ్గరకు పంపింది. ఆమెకూడా సకాలానికి రాకపోయేసరికి నాయిక ఎంతో వేదన చెందుతుంది. తన విరహబాధను ఉపశమనం కోసం అతనితో ఆమెకున్న పూర్వఅనుభూతుల్ని సాటి స్త్రీకి తెలియజేస్తుంది. ఎప్పుడు తెల్లవారుతుందో ఏమో వెళ్ళిన చెలి ఇంకా రాలేదు. ఒక నిమిషంకూడా కంటికి నిద్రరాలేదు. ప్రియుడు కన్నుల నవ్వే నవ్వులు, గడుసరి మాటలు, సుకుమారమైన ఒయ్యారాలు, వేడుకతో కూడిన ఆలసటలు, సన్నని చెమటలు తలచుకుంటే మనసు ఝల్లుమన్నది.

కంటి రెప్పలమీదా కన్నీటిలో, జాలువారుతున్న పన్నీటిలో ప్రవహించీ స్రవహించని భావం, తొలగిన పైట, వేడెక్కిన శరీరపు సెగలు,

కప్పిన పువ్వుల సౌరభాలు, నాయిక తాపానికి వెన్నెల మండిపోతున్నాయి. దేవతాశిఖామణి అయిన తిరుమల దేవుని వదలకుండా భావించిన నాయిక మనస్సులో ఆ స్వామే ఉండి ఈమె చెందిన విరహతాపాన్ని తెలుసుకోవాలి ఈమె చెందే విరహతాపాన్ని గూర్చి మనం ఏమని చెప్పగలం అని సఖీజనం చెప్పుకోవడం ఇందులో కనిపిస్తుంది. భగవంతుడైన ఆ శ్రీ వేంకటేశ్వరుడు తప్ప ఇంకెవ్వరూ తెలుసుకోలేరని సఖీజనం చెప్పుకోవడంలో నాయిక చెందిన విరహతాపాతిశయం ఎంతటిదో భావించవచ్చు.

## 1.2.5. ఖండిత :

ప్రియుడు పరస్త్రీతో క్రీడించి శరీరంపై సంగమ చిహ్నాలతో వచ్చినపుడు ఆక్షేపించే నాయిక ఖండిత అన్నమయ్య సంకీర్తనల్లో ఈ విధమైన లక్షణాలున్న నాయికకూడా వుంది.

ఆహిరి

వేడుక నెవ్వతెరా విడువక నిన్నంటి
వాడుదేరే వలపుల వన్నెలు వెట్టినది॥

గద్దరి యెవ్వతెరా నీ గారవంపు చెక్కున
నిద్దంపు చంద్రరేఖ నిలిపినది
అద్దిరా దాసిగయ్యాళి తన మెట్టిదో
ముద్దు తనమోము నీ మోమున రాచినది॥

దిట్టైనయది యెవ్వతెర నీ యధరమందు
కొట్టగొన మరుచిలుకు లొత్తినది
గట్టిగ చూడఁగా దానిగబ్బి తన మెట్టిదో తన
గుట్టెల్ల నీకు నాతున వ్రాసంపినది॥

చక్కని దెవ్వతెర నీసరి లేని మేన తన
మిక్కుటంపు మేనితావి మేళవించినవి
అక్కరగా తిరు వేంకటాధీశ కూడితివి
మక్కువతో నీకు పరిమళమూలంపినది॥ (12-159)

పరస్త్రీ సంగమ గుర్తులతో ఇంటికి వచ్చిన నాయకుని నాయిక నిలదీసి ప్రశ్నిస్తూ ఆక్షేపించడం ఈ సంకీర్తనలో కనిపిస్తోంది.

నిన్ను విడువకుండ నిన్ను అంటుకొని వేడుకతో అతిశయించిన వలపుల సొగసులు పెట్టింది ఎవ్వతెరా? అందమైన నీ చెక్కిలిపై నఖాలతో మెరుస్తున్న చంద్రరేఖలు నిలిపిన గడుసరి ఎవ్వతెరా? ఆమె గయ్యాళితనం ఎలాంటిదో కానీ తన ముద్దుమొకంతో నీ ముఖాన్ని రాచిం ది నీ పెదవిపై తన కొనముక్కుతో ప్రేమగుర్తులు (మరుచిలుకలు) ఒత్తిన ఆ దిట్టైనది ఎవ్వతెరా? ఆమె జాణతనం ఎలాంటిదో కానీ తన అంతర్యమంతా అతుపై వ్రాసిపంపింది సాటిలేని నీ శరీరంపై తన శరీరంలోని పరిమళాల్ని అంటించిన ఆ చక్కనిది ఎవ్వతెరా? ఆసక్తితో ఆమెను కలశావు. ఆమె ప్రేమతో నీకు సుగంధాలను పంపింది అని తన ఆక్షేపణను వ్యక్తం చేయడంలో ఖండిత నాయిక స్పష్టమవుతుంది.

## 6. కలహాంతరిత :

కోపంతో ప్రియుని దూషించి తర్వాత పశ్చాత్తాపం చెందే నాయిక కలహాంతరిత. అన్నమయ్య సంకీర్తనల్లో ఇలాంటి లక్షణాలున్న నాయిక కూడా కనిపిస్తుంది.

### శుద్ధవసంతం

ఎంతవాడవైన నిన్ను నింతసేసితి
యింతని నయపరాధా లెట్టోరిచేవయ్యా॥

చేర రమ్మంటే రానైతి చెక్కులు చేత గిల్లితి
గారవించగా నిన్ను కసరితిని
కూరిమి కొసరగాను కోపాన జంకించితిని
యీరీతి నాయపరాధా లెట్టోరిచేవయ్యా॥

మనసు నొప్పించితిని మాటలెల్లానాడితిని
చెనకగా వద్దని పైఁ జేయి వేసితి

పెనగితి నీతోడ ప్రేమము రెట్టించగాను
యెడసి నాయపరాధా లెట్టోరి చేవయ్యా॥ (17-565)

కోపంతో నాయకుని దూషించి తర్వాత పశ్చాత్తాపం చెందుతున్న నాయిక అతనితో—ఎంతో గొప్పవాడవైన నిన్ను స్త్రీ అయిన నేను ఇంతగా బాధపెట్టాను. నీవు దగ్గరకు రమ్మంటే నేను రాలేదు. చేతితో నీవెక్కిలి గిల్లాను. నీవు నన్ను గౌరవిస్తే నేను నిన్ను కోపంతో కసరాను నీవు ప్రేమతో కసరితే నేను కోపంతో బెదిరించాను. ఈ విధంగా నేను చేసిన అపరాధాల్ని ఎలా ఓర్చుకున్నావయ్యా! నీ మనసును నొప్పించాను. మాటలన్నీ అన్నాను, నన్ను తాకవద్దని చెయ్యి అడ్డుగా పెట్టాను. నీతో ప్రేమ రెట్టించే విధంగా పెనగులాడాను. ఇలా నా అపరాధాల్ని ఎలా సహించావయ్యా అని తన అపరాధాలేవో తెలియజేస్తూ పశ్చాత్తాపం చెందుతోంది. అలాగే నాయకుని లోని మంచితనాలేవో తెలుపుతూ నాయకుని సహనగుణానికి ఆశ్చర్యం చెందుతూ నాయకునితో భాషించడం ఇందులో వ్యక్తమవుతుంది.

## 1.2.7. ప్రోషిత భర్తృక లేక ప్రోషిత పతిక :

నాయకుడు లేక ప్రియుడు కార్యనిమిత్తం దూరప్రాంతానికి వెళ్ళినపుడు విరహవేదనతో కృశించే నాయిక ప్రోషిత భర్తృక. అన్నమయ్య సంకీర్తనల్లో ఇలాంటి లక్షణాలున్న నాయిక కూడా కనిపిస్తుంది.

కాంబోది

నీల రాడమ్మ యింతిరో వా
డేల రాడమ్మ నన్నేలిన వాడు॥

పచ్చని పులుగుల బండిమీద నుండు
పచ్చవింటి పిన్నబాలుని తండ్రి
పచ్చని చాయల పాయని బంగారు
పచ్చడము గట్టిన బాగైన వాడు॥

తెల్లని పులుగుపై తిరుగ మరగినట్టి
తెల్లని సతిపాలి దేవరతండ్రి
తెల్లని పరపుపై తేలిపొరలు వెట్టు
తెల్లని కన్నుల తెలివైన వాడు॥

కొండవింటి వాని గుత్తగొనిన యట్టి
కొండుక పాయపు కూతురు తండ్రి
కొండల రాయుడు కోనేటి తిమ్మయ్య
కొండతల నెత్తి గురుతైన వాడు (12-235)

ఎక్కడికో దూర ప్రాంతానికి వెళ్ళిన తనను కాపాడిన తన ప్రియుడు ఎందుకు ఇంకా రాలేదో అని ప్రేయసి ఆశ్చర్యం చెందుతూ బాధ పడుతూ సాటి స్త్రీకి వ్యక్తం చేసుకొంటోంది. తన ప్రియుడు ఎలాంటి వాడో వ్యక్తం చేస్తోంది పచ్చని చిలుకల తేరుమీద వుంటూ పచ్చని చెరకును విల్లుగా కలిగిన చిన్నబాలుడైన మన్మథునికి తండ్రి- పచ్చని రంగులు వదలని బంగారు వస్త్రాన్ని కట్టుకునె అందగాడు తెల్లని పక్షి అయిన హంసపై తిరగడానికి అలవాటైన తెల్లని సతిఅయిన సరస్వతిక భర్త అయిన బ్రహ్మకు తండ్రి. తెల్లని పరుపులాగా వుండే ఆదిశేషునిపై తేలుతూ పొరలు పెట్టే తెల్లని కన్నుల తెలివైనవాడు. కొండను విల్లుగా కల్గిన శివుని ప్రియుడుగా కల్గినగంగకు తండ్రి కేనేటి తిరుమ లేశుడు. కొండలరాయుడు అనిచెబుతూ అలాంటి తన ప్రియుడు ఇంకా ఎందుకు రాలేదో అని పరితపిస్తోంది.

## ఆహిరి

ఆఁపరాని వలపాయ నమ్మలాలా యింతి
ఏపులకు లోనైతిమిక నేమిసేతమే॥
అరగించు మన గదరమ్మలాలా అయ్యో
నీరు వుక్కలించ డిదె నిన్నట్టనుండి
అరినది బోనమెల్లా నమ్మలాలా అయ్యో
శ్రీరమణుడంతట విచ్చేయడేమి సేతమే॥

అద్దమరాతిరి వోయ నమ్మలాలా అయ్యో
నిద్దురకంట బెట్టదు నిన్నటనుండి
అద్దపు చెక్కులు వాడే నమ్మలాలా అయ్యో
యిద్దరి కోపము తీరదిక నేమిసేతమే॥

అలయికే ఘనమాయ నమ్మలాలా దీని
నిలుప వశము గాదు నిన్నటనుండి
అలమివెంకట విభుఁ డమ్మలాలా దీని
నెలయించి కూడతున్న నికనేమి సేతమే॥ (12-32)

విరహవేదనతో బాధపడుతూ కృశించిపోతున్న నాయికను చూచి సఖీజనం–నాయికకు నాయకునిపై వున్న ప్రేమ అపరానిది మనం ఏమి చేయగలం! ఆహారం భుజించమని చెప్పండి. అమ్మలారా నిన్నటినుంచి నీరుకూడా త్రాగలేదు. పళ్ళెంలోని అన్నం చల్లారిపోతుంది. ఆమె విభుడు ఇంకారాలేదు. మనం ఏమిచేయగలం? అద్దాలవంటి ఈమె చెక్కిళ్లు వాడి పోయాయి. ఈమెకు అలసట ఎక్కువైపోయింది. ఈమెను చక్కబెట్టడం ఓదార్చడం మనవల్ల కాదు. నాయకుడైన శ్రీవేంకటేశ్వరుడు ప్రేమతో ఈమెను కలుసుకోకపోతే మనం ఇకఏమి చేయగలం! అని ఒకరికొకరు సంభాషించుకోవడం వ్యక్తమవుతుంది.

## 1.2.3. అభిసారిక :

ప్రియ వ్యామోహంతో ప్రియుని వద్దకు తానే స్వయంగా వెళ్ళే నాయిక అభిసారిక. తాను ప్రియుని వద్దకు వెళ్ళక ప్రియుని తనదగ్గరకు రప్పించుకునే నాయిక కూడా అభిసారికే అవుతుంది. ఈ అభిసారిక మూడు రకాలు. తెల్లని వస్త్రాలు, తెల్లని పువ్వులు, తెల్లని గంధహారాదులు ధరించి వెన్నెల్లో ప్రియుని అభిసరించే నాయిక జోత్స్నాభిసారిక. నల్లని వస్త్రాలు నల్లని పుష్పాదులు ధరించి చీకటిలో ప్రియుని అభిసరించే నాయిక తమోఽభిసారికా. పగలు గృహములోని తన వారందరూ ఏదైనా కార్యం నిమిత్తం ఎక్కడికైనా వెళ్ళినపుడు తాను ఏదో ఒకనెపంతో గృహంలోనే వుండి ప్రియుని తన దగ్గరకు రప్పించుకునే అభిసారిక దివసాభిసారిక.

## అహిరి

కామించి నీవరుగ గలయు నాయకుడునే
డేమి భాగ్యము సేసెనే తరుణి॥

కాగిన గుబ్బల మీద కమ్మ చెమటలఁ దొప్ప
దోగిన పయ్యెద కొంగు దూలగను
వేగైన కొప్పున క్రొవ్విరులు దురిమి వి<u>ట్ట</u>
పీగుచు నీవెటు వొయ్యేవే తరుణి॥

ఒప్పైన శిరసుమీదఁ గుప్పశించిన జవ్వాది
చిప్పిలి చెక్కుల వెంటఁ జిందగను
అప్పళించిన కస్తూరిలప్పలు రాలగ నీ
విప్పుడెక్కడికి నేగేవే వో తరుణీ॥

వీడినది మొలనూలు విరులు చెదరె కొంత
వాడినది కెమ్మోవి వన్నెలై
యీడులేని తిరువేంకటేశుడిదె నిన్నుంగూడె
యీడ కొత్తలిపి యేటివే వో తరుణీ॥ (12-142)

ప్రియునికోసం వెళుతున్న నాయికను చూచి సఖి-నీవు ప్రేమతో నాయకుని కలుసుకోవడానికి వెళుతున్నావు. అతడెంత భాగ్యం చేసుకున్నాడో కదా. వేడెక్కిన నీ వక్షస్థలంపై పై పరిమళాలతో కూడిన చెమట కారుతోంది. పైట జారిపోతుంది. ఎత్తైన నీ కొప్పులో అప్పుడే పూచిన పువ్వుల్ని పెట్టుకొని ప్రేమాతిశయంతో ఎక్కడికి వెళుతున్నావు. అందమైన నీ తలపై పూసుకున్న జవ్వాది చిప్పిలిపోయి నీ చెక్కిలిపై కారుతోంది అద్దుకున్న కస్తూరి రాలిపోతుంటే ఇప్పుడు ఎక్కడికి వెళుతున్నావు? నీ మొలనూలు వీడిపోయింది పువ్వులు చెదరిపోయాయి. ఎర్రని నీపెదవి వాడిపోయింది. సాటిలేని శ్రీ వేంకటేశ్వరుడు నిన్ను కలిసాడు. నీలో కనిపిస్తున్న ఈ కొత్త భావనలు ఏమిటో ఓ తరుణీ! అని భాషిస్తోంది. ఈ సంకీర్తనలో నాయిక నాయకుని కోసం వెళ్ళడాన్ని, నాయిక వేషధారణను వస్త్రధారణను, సుగంధాలను వ్యక్తం చేస్తుంది. ఈ సంకీర్తన చివర్లో నాయికా నాయకుల సమైక్యత చెప్పబడింది.

## 1.3. సమాప్తం :

ఈ విధంగా అన్నమయ్య సంకీర్తనల్లో స్వాధీన పతిక, వాసక సజ్జక, విరహోత్కంఠ, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక అభిసారిక అనే అష్టవిధ శృంగార నాయికల లక్షణాల్ని గుర్తించడం జరిగింది. ఆ సంకీర్తనల్ని సేకరించి, ఉదహరించి, వివరించి, సమన్వయించడం జరిగింది అన్నమయ్య సంకీర్తనా సాహిత్యం అనంత విశ్వం లాంటిది. అందులో అష్టవిధ నాయిక లక్షణాలున్న సంకీర్తనలు పరిశోధించే సరికి అనేకం కనిపిస్తాయి ఇంకా సరిక్రొత్త అంశాలు కూడా వ్యక్తమవుతాయి

## ఉపయుక్త గ్రంథావళి :

| | | |
|---|---|---|
| కీర్తనా కౌముది | — | డా॥ పొన్నా లీలావతి |
| తాళ్ళపాక కవుల పదకవితలు | | |
| బాషా ప్రయోగ విశేషాలు | — | ఆచార్య వేటూరి ఆనందమూర్తి గారు |
| సాహిత్య సోపానములు | — | ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు |
| శృంగార సంకీర్తలు | — | తాళ్ళపాక అన్నమాచార్యులు |
| (సంపుటం–12) | — పరిష్కర్త | శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ<br>తి తి దే. ప్రచురణ |

శ్రీ తాళపాక అన్నమాచార్య
447వ వర్థంతి మహోత్సవాలు
అన్నమయ్య ఇతర తాళపాక
కవుల కృతులు
అన్నమాచార్య ప్రాజెక్ట్
తిరుమల తిరుపతి దేవస్థానం
తిరుపతి
పొన్నా లీలావతి
6-4-2000

# అన్నమయ్య సంకీర్తనల్లో రామావతార విశేషాలు

విష్ణుమూర్తి దుష్టశిక్షణ, శిష్టరక్షణ కోసం, ధర్మసంస్థాపన కోసం ప్రతి యుగంలోను భూమిపై అవతరిస్తుంటాడు. ఆవిధంగా త్రేతాయుగంలో కౌసల్య, దశరథ చక్రవర్తులకు అయోధ్యలో చైత్ర శుద్ధ నవమి. పునర్వసు నక్షత్రం కర్కాటక లగ్నంలో మధ్యాహ్నం పన్నెండు గంటలకు అభిజిన్ముహూర్తంలో శ్రీరాముడు జన్మించాడు. ఈ పరమ పుణ్యదినాన్ని "శ్రీరామనవమి" పండుగగా ఆనాటినుంచి ఉత్సవాలు జరుపుకుంటూ వస్తున్నారు. శ్రీరాముని రూపం మంగళకరమయింది. శ్రీరామనామం మధురాతి మధురమయింది.

శ్రీరాముని వినయం, వివేకం మాతృ, పితృభక్తి, గురుసేవ, గాంభీర్యం ప్రజానురంజక పరిపాలన, మిత్రత్వం, ఏకపత్నీ వ్రతనియమం మొదలైన సద్గుణాలు భూలోకంలోని సమస్త మానవులకు ఆదర్శమార్గ దర్శకం, అందుకే శ్రీరాముని చరిత్రను తెలియజేసే రామాయణం ఒక్క భారతీయ సాహిత్యంలోనే కాక ప్రపంచ సాహిత్యంలో కూడా విశిష్టస్థానాన్ని అలంకరించింది. మలయ, బర్మా, ఇండోనేషియా, నెపాల్, చైనా, టిబెట్ రష్యన్, జర్మన్, మొదలైన విదేశభాషల్లోకి రామాయణం అనువదించబడటం విశేషం. ప్రపంచ సాహిత్యంలోనే ఇంతటి ప్రభావం చూపిన మహాకావ్యం మరేదిలేదు.

"యావత్ స్థాస్యంతి గిరయః సంతశ్చ మహీతలే
తావద్రామాయణ కథా లోకేషు ప్రచలిష్యతి"

పర్వతాలు భూమండలం పైన ఉన్నంతకాలమూ, నదులు భూమిపై ప్రవహించినంత కాలం పవిత్రమైన రామకథ సమస్తలోకాల్లో ఉండగలదని ఈ శ్లోకార్థం. ఇంతటి మహిమాన్వితుడు అయిన శ్రీరామచంద్రమూర్తిని హనుమంతుడు, విభీషణుడు, అహల్య, గుహుడు, శబరీ, సుగ్రీవుడు, వాల్మీకి, తులసిదాసు, కృష్ణమాచార్యులు, మొల్ల, పోతన, రామదాసు,

త్యాగయ్య, మన్నెంకొండ హనుమద్దాసు మొదలైన మహనీయులెందరో కీర్తించి తరించారు. తెలుగు సాహిత్యంలో శ్రీరామచరిత్ర కమనీయ కావ్యాలుగా, ప్రబంధాలుగా. నాటకాలుగా, యక్షగానాలుగా, శతకాలుగా, హరికథలుగా, బుర్రకథలుగా, జానపద కథలుగా, గేయాలుగా, స్త్రీలపాటలుగా, సంకీర్తనలుగా వెల్లివిరిసిసాయి. సంకీర్తనా రచనకు శ్రీకారం చుట్టిన శ్రీవేంకటేశ్వర పరమభక్తుడైన అన్నమయ్య కూడ అత్యంత ప్రీతితో రామ చరిత్రను ద్విపద కావ్యంగా రచించినట్లు అనమయ్య మనుమడు చిన్నన్న రచించిన అన్నమాచార్య చరిత్రలోని—

ఘనతర సకల భోగంబులు గాక
మనుచు వాల్మీకి రామాయణ మెల్ల
రాగంబుతో ననురాగంబు తోడ
బాగుగా గంధర్వ బాగుగ చదివి

అనే ద్విపద పాదాల్ని బట్టి తెలుస్తుంది. కానీ ఈ కావ్యం నేడు లభించడం లేదు. అయినా చిన్నన్న పేర్కొనట్లు—

"యోగమార్గంబున నొక కొని బుధులు
రాగిల్ల శృంగార రసరీతిఁ గొన్ని
వైరాగ్య రచనతో వాసింపకొన్ని
సారస నేత్రుపై సంకీర్తనములు
పరసత్వమున తాళసముఖముల్ గాగ
పరమ తంత్రములు ముప్పదిరెండు వేలు"

అన్నమయ్య సంకీర్తనల్లో శ్రీరామావతార ఘట్టాలకు సంబంధించిన సంకీర్తనలు అనేకం కనిపిస్తాయి. అన్నమయ్య శ్రీవేంకటేశ్వర భక్తితో, ప్రీతితో శ్రీవేంకటేశ్వర ముద్రతో సంకీర్తనలు రచించాడు. అందువల్ల కొన్నిచోట్ల శ్రీరాముని వేంకటాద్రి రాముడని, వేంకటరాముడని వేంకటేశ్వరుని పేరు ముందు కలుపుకొని కీర్తించాడు. నేటికీ వేంకటేశ్వరునికి ప్రభాత సమయంలో పాడే సుప్రభాతంలో—

కౌసల్యా సుప్రజా రామా! పూర్వా సంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవ మాహ్నికమ్,

అని శ్రీ వేంకటేశ్వరుని కౌసల్యాతనయుడైన శ్రీ రాముడుగా పేర్కొన్నారు. కీర్తిస్తున్నారు.

చరితం రఘునాథస్య
శతకోటి ప్రవిస్తరమ్
ఏకైక మక్షరం ప్రోక్తం
మహాపాతక నాశనమ్

శ్రీరాముని చరిత్ర శతకోటి యోజనాలు విస్తరిస్తుందని, రామాయణం లోని ఏ ఒక్క అక్షరాన్ని ఉచ్చరించినా మహాపాతకాలు నశించి పోతాయని విశ్వసించడం జరిగింది. ఇంతటి కమనీయమైన, లోకాదర్శమైన, పరమ పవిత్రమయిన శ్రీ రామ చరిత్రను అన్నమయ్య సంకీర్తనల రూపంలో సంక్షిప్తంగా వర్ణించాడు.

అన్నమయ్య తర్వాతి వాగ్గేయకారులైన రామదాసు, త్యాగయ్య, అన్నమయ్య కన్నా పూర్వుడై కృష్ణమాచార్యులు మొదలైన వారి కృతుల్లో కూడా రామనామ మహిమ వర్ణించబడింది.

రామా దశరథ రామా నిజసత్య
కామ నమోనమో కాకుత్స్థ రామ॥

కరుణానిధి రామ కౌసల్యానందన రామ
పరమ పురుష సీతాపతి రామా
శరధి బంధన రామ సవనరక్షక రామా
గురుతర రవివంశ కోదండరామా॥

దనుజ హరణ రామ దశరథ సుత రామ
వినుతామర స్తోత్ర విజయరామ
మనుజావతార రామ మహనీయ గుణరామ
అనిలజ ప్రియ రామా అయోధ్యరామా॥

సులలిత యశరామ సుగ్రీవ వరద రామ
కలుషరావణ భయంకర రామా
విలసిత రఘు రామ వేదగోచరరామా
కలితాప్రతాప శ్రీవేంకటగిరి రామా॥

అన్నమయ్య శ్రీరామచంద్రుని కాకుత్స్థ వంశ రాముడని సత్య వంతుడని, దశరథుని రాముడని, యజ్ఞాన్ని రక్షించిన రాముడని, ఘనమైన సూర్యవంశములోని కోదండరాముడని, రాక్షసులను సంహరించిన రాముడని, దేవతలచే స్తుతించబడిన రాముడని, విజయాలను పొందిన రాముడని మానవ అవతారాన్ని దాల్చిన రాముడని, మహనీయ గుణాలు కల్గిన రాముడని, సుగ్రీవునికి వరాలిచ్చిన రాముడని, కల్మషుడైన రావణాసురునికి భయాన్ని కలిగించిన రాముడని, తేజస్వరూపుడైన రఘువంశములోని రాముడని, వేదాలచే తెలియదగిన రాముడని, ఆ రాముడే నేడు మిక్కిలి ప్రతాపంతో వేంకటాచలం పై వెలశాడని, వేంకటాద్రి రాముడని అన్నమయ్య కీర్తించాడు.

## బౌళి రామక్రియ

ఇతడే పరబ్రహ్మ మిదియే రామకథ
శతకోటి విస్తరము సర్వపుణ్యఫలము॥
ధరలో రాముడు పుట్టె ధరణిజ పెండ్లాడే
అరణ్యవాసులకెల్లా నభయమిచ్చె
సొరిది ముక్కుచెవులు చుప్పనాతిని గోసె
ఖర దూషణులులను ఖండించివేసె॥
కినిసి వాలిజంపి కిష్కింధ సుగ్రీవుకిచ్చె
వనధి బంధించి దాటె వానరులతో
ఘనలి రావణ కుంభకర్ణాదులను జంపి
వనిత జేకొని మళ్ళివచ్చె అయోధ్యకును॥
సౌమిత్రియు భరతుడు శత్రుఘ్నుడు కొలువగ
భూమియేలె కుశలవ పుత్రుల గాంచె
శ్రీమంతుడై నిలచె శ్రీవేంకటాద్రి మీద
రాముడు విభీషణు లంకకు పట్టము గట్టె॥ (11-1-224)

రాముడే పరబ్రహ్మమని, రామకథ శతకోటి యోజనాలు విస్తరించిందని, ఈ కథ సకల పుణ్యఫలమని అన్నమయ్య లోకానికి తెలియ చెప్పుతూ (శ్రీరామ చరిత్ర) నంతటిని ఒక సంకీర్తనలో సంక్షిప్త పరచి రచించాడు. ఈ భూమిపై రాముడు పుట్టాడు. సీతను వివాహమాడాడు. ఆరణ్య వాసులందరికీ అభయమిచ్చాడు. తనపట్ల కాముకంగా ప్రవర్తించిన శూర్పణఖ ముక్కుచెవుల్ని కోశాడు ఖరదూషణులను సంహరించాడు వాలిని సంహరించి కిష్కింద రాజ్యాన్ని సుగ్రీవునకిచ్చాడు సముద్రాన్ని బంధించి వానరులతో కలసిదాటాడు. రావణ కుంభకర్ణులను చంపి సీతను తోడ్కొని అయోధ్యకు వచ్చాడు. లంకారాజ్యానికి విభీషణుని పట్టాభిషక్తుని చేసాడు భరతుడు, లక్ష్మణుడు, సుగ్రీవుడు సేవిస్తుండగా భూమిని పాలించాడు. కుశలవులనే పుత్రులను గాంచాడు. శ్రీమంతుడైన ఆరాముడే నేడు వేంకటాద్రి మీద నిలిచాడు అని వివరించాడు

## ఆహిరి

జగురు వంటి వాడె శినకాటి చింత
శిగురమ్మం బోనీడె శినకాటి॥

సేతి కుత్తికవాడు సెడకుంద దాచిన
పాత పెద్దవిల్లు బలువున
నాతి కొరకు వచ్చి నడిమికి విరిశిన
శేతలాడు గదె శినకాటి॥

చట్టడి శేతల రాకాశి నాయని
పట్టపు శెలియలి వడవేసి
కొట్టకొన ముక్కు కోసివేశినట్టి
శిట్టగీడుగదె శినకాటి॥

బలువున వేంకటనగమున కోనేటి
నెలవున సొంపుతో నెలకొని
కలిమి పడుసుతోడి కాపురమున్నట్టి
శిలుగులాడు గదె శినకాటి (12-367)

అన్నమయ్య ఆలోచనతరంగాలు ఎప్పుడు ఏ అవతారమూర్తి వైపు వ్యాపిస్తాయో చెప్పలేము. శ్రీహరి తన రూప లావణ్యాలతో, గాన మాధుర్యంతో వనితలను వలపించింది శ్రీకృష్ణావతారంలోనే. భగవంతుడు తన భక్తుల వెంట జిగురులాగా అంటిపెట్టుకొని వెన్నంటి తిరుగుతుంటాడు. ఈ విషయాన్ని జానపద స్త్రీ మరొక జానపద స్త్రీతో చెబుతున్నట్లు అన్నమయ్య వర్ణించాడు. వాడు (భగవంతుడు లేక కృష్ణుడు) జిగురులాంటి వాడె చిన్నక్కా. చింత చిగురు అమ్ముకోవడానికి పోతుంటే పోనివ్వడంలేదు అని చెప్పుతూ అతని వెనకటి అవతారమైన శ్రీరాముని చర్యలను వర్ణిస్తుంది అతడు శివుని విల్లును విరిచి సీతను పెండ్లి చేసుకున్నాడని. వనవాసానికి వెళ్ళినప్పుడు రావణాసురుని చెల్లెలైన శూర్పణఖ తన పట్ల కాముకంగా ప్రవర్తించినందుకు తన ముక్కు చెవులు కోసివేశాడని, ఆ శ్రీరాముడే నేడు వెంకటేశ్వరుడై లక్ష్మిదేవితో వేంకటాచలంపై కాపురం చేస్తున్నాడని ఒక జానపద స్త్రీ పాత్రద్వారా లేక గోపిక పాత్రద్వారా అన్నమయ్య తెలియజేసాడు. ఈ సంకీర్తనలో శివుడు అనడానికి సేతికుత్తిక వాడు (చేదైన విషాన్ని కంఠంలో ఉంచుకున్నవాడు) అని, రావణాసురుడు అనడానికి రాకాసిరాయుడు అని, లక్ష్మిదేవి అనడానికి కలిమిపడుచు అని అన్నమయ్య జానపదులు వ్యవహరించే పదాలను, అచ్చ తెలుగు పదాలను ఉపయోగించడం విశేషం.

## శ్రీరాగం

పిడికిటి తలంబ్రాల పెండ్లికూతురు కొంత
పెడమరలి నవ్వీనే పెండ్లికూతురు॥

పేరుకల జవరాలె పెండ్లికూతరు పెద్ద
పేరుల ముత్యాలమేడ పెండ్లికూతురు
పేరంటాండ్ల నడిమి పెండ్లికూతురు విభు
పేరుకుచ్చ సిగ్గువడీ పెండ్లికూతురు॥

బిరుదు పెండెము వెట్టె పెండ్లికూతురు నెర
బిరుదు మగని కంటె పెండ్లికూతురు
పిరుదూరి నప్పుడె పెండ్లికూతురు పతి
పెరరేచ నిచ్చీవో పెండ్లికూతురు॥

పెట్టెను పెద్దతురుము పెండ్లికూతురు నేడే
పెట్టెడు చీరలు కట్టె పెండ్లికూతురు
గట్టిగ వేంకటపతి కౌగిటను వడి
వెట్టిన నిధానమైన పెండ్లికూతురు॥ (12-185)

అన్నమయ్య సీతారాముల కల్యాణోత్సవాన్ని మనో నేత్రంతో దర్శించాడు, పెండ్లికూతురైన సీతను, పెండ్లికొడుకైన శ్రీరాముని వేషాలంకరణలను, వారిఔన్నత్యాన్ని ఎంతో రమ్యంగా వర్ణించాడు సీతమ్మను పిడికిట్లో తలంబ్రాలు ఉంచుకున్న పెండ్లికూతురని, కొంచెం చిరునవ్వు నవ్వుతోందని మంచిపేరు ప్రఖ్యాతులు కలిగిందని, ముత్యాలదండలతో సింగారించిన మేడలాంటిదని, (లేక ముత్యాల దండలు వేసుకున్న మెడ కలిగిందని కూడా భావించవచ్చు) పేరంటాండ్ల మధ్యలో కూర్చుని వుందని, విభుని పేరు చెప్పడానికి సిగ్గుపడుతోందని, అతనికన్నా పెద్ద పెండెము (గండపెండేరము లేక ఒకరకమైన ఆభరణము) పెట్టుకున్నదని కటి ప్రదేశం లావెక్కి వున్నదని, విభుని మోహింప చేస్తోందని, పెద్దకొప్పు వేసుకొన్నదని, పెట్టెడు చీరలు కట్టిందని, శ్రీవేంకటేశ్వరుని బిగికౌగిలిలో నిధానమై (తరగని నిధియై) వెలసిందని అన్నమయ్య వర్ణించాడు.

## బౌళి

పెట్టని కోటిందరికి పెండ్లికొడుకు బొమ్మ
పెట్టెన సురలకెల్ల పెండ్లికొడుకు॥
పెల్లగించి భూమెత్తి పెండ్లికొడుకు వాడె
పిల్లగోపి రాగాల పెండ్లికొడుకు

పెల్లైన యీవుల పెండ్లికొడుకు వాడె
పిల్లదీపు పెన్నుద్ది పెండ్లికొడుకు॥

పెంచెపు శిరసుపాగ పెండ్లికొడుకు గుం
పించిన కోపగించి పెండ్లికొడుకు

పెంచకప్పుడే పెరగీ పెండ్లికొడుకు వల
పించె చక్కని సిరి పెండ్లికొడుకు॥

పెంట పెరుగుల దొంగ పెండ్లీకొడుకు భూమి
పెంటిపోతుల కూరిచె పెండ్లికొడుకు
గెంటులేని వేంకటగిరి మీదను వాడె
పెంట వెట్టుకున్నవాడు పెండ్లికొడుకు॥ (12-186)

మానవుడు నిర్మించిన పెట్టిన కోట ఒకప్పటికి కూలిపోతుంది. కానీ భగవంతుడనే పెట్టని కోట శాశ్వతంగా నిలిచివుంటుంది. సదా రక్షిస్తూ వుంటుంది. పెండ్లికొడుకైన శ్రీరామచంద్రుడు పెట్టని కోట అని, రాక్షసుల్ని సంహరించిన వాడని, భూదేవిని ఉద్ధరించాడని, శ్రీకృష్ణావతారం దాల్చి పిల్లనగ్రోవి రాగాలను వినిపించాడని. గొప్పగా దానధర్మాలు చేసినవాడని శౌర్యవంతుడని, తలపాగా చుట్టుకున్నవాడని, దుష్టచేష్టలు చేస్తే కోపగించుకునే వాడని, పెంచకనే అప్పటికప్పుడే పెరిగిన వాడని, (వామనావతారం త్రివిక్రమరూపం దాల్చిన సంఘటన) సుందరాంగి అయిన లక్ష్మీదేవిని వలపించిన వాడని, పేరుగును దొంగిలించిన వాడని, సుభద్రార్జునులకు వివాహం చేసిన వాడని, కృష్ణావతార సంఘటన) నేడు వేంకటాచలంపై వెలసిన వాడని అన్నమయ్య వర్ణించాడు.

శ్రీరాగ

రామచంద్రుడితడు రఘువీరుడు
కామిత ఫలము లియ్య కలిగెనిందరికి॥

గౌతము భార్యపాలిట కామధేనువితడు
ఘాతల కౌశికుపాలి కల్పవృక్షము
సీతాదేవి పాలిటి చింతామణీతడు
యీతడు దాసుల పాలి యిహపర దైవము॥

పరగ సుగ్రీవు పాలి పరమబంధుడితడు
సరి హనుమంతు పాలి సామ్రాజ్యము

నిరతి విభీషణుని పాలి నిధానము
గరిమ జనకు పాలి ఘనపారిజాతము॥

తలప శబరి పాలి తత్త్వపు రహస్యము
అలరి గుహుని పాలి అదిమూలము
కలదన్న వారిపాలి కన్నులెదుట మూరితి
వెలయు శ్రీవేంకటాద్రి విభుడితడు॥ (10-147)

శ్రీరామచంద్రుడు రఘువంశ వీరుడని, కోరిన ఫలితాలను ఇవ్వడానికి మన అందరికోసం వెలశాడని, గౌతముని భార్య అయిన అహల్యపాలిట కామధేనువని, కౌశికు (విశ్వామిత్రుని) పాలిట కల్పవృక్షమని, సీతాదేవి పాలిట చింతామణీ అని, దాసుల (భక్తుల) పాలిట ఇహపర దైవమని, సుగ్రీవుని పాలిట పరమ బంధువని, హనుమంతుని పాలిట సామ్రాజ్యమని, విభీషణుని పాలిట నిధానం (తరగని నిధి) అని జనక మహారాజు పాలిట గొప్ప పారిజాతమని, శబరి పాలిట తత్త్వ రహస్యమని, గుహుని పాలిట ఆదిమూలమని, ఉన్నాడు అనుకునే వారికి కంటి ఎదుట కనిపించే రూపమని, నేడు శ్రీవేంకటనాథుడై వెలుగొందుతున్నాడని, అన్నమయ్య శ్రీరామచంద్రమూర్తిని ఉల్లేఖించాడు

## నాట

రాముడు లోకాభిరాముడందరికి రక్షకుడీతని తెలిసి కొలువరో
కామిత ఫలదుడు చరాచరములకు కర్తయైన సర్వేశ్వరుడితడు॥

తలప దశరథుని తనయుడట తానే తారక బ్రహ్మమట
వెలయ మానుషపు వేషమట వెగటు హరువిల్లు విరిచెనట
అలరగ తానొక రాజట పాదాన నహల్యా శాపము మాన్పెనట
సొలవక దైవిక మానుషలీలలు చూపుచు మెరసీ చూడరో యితడు॥

జగతి వశిష్ఠుని శిష్యుడట జటాయువుకు మోక్షమిచ్చెనట
అగచరులే తన సేనలట అంబుధి కొండల గట్టెనట
మగువకొరకు కానట కమలాసను మనుమని రావణు చంపెనట
తగలౌకిక వైదికములు నొక్కట తానొకరంచి చూడరోయితడు॥

వెపన మరుల వరమడిగెనట విభీషణు పట్టము గట్టెనట
యెసగ నయోధ్యకు నేలికట యింద్రాదులకు కొలువిచ్చెనట
పొసగ శ్రీవేంకటగిరి నివాసమట భువనము లుదరంబున ధరించెనట
సుసరపు సూక్ష్మాధికములు తనందు చూపుచున్నాడు చూడరో
యితడు (10–277)

అన్నమయ్య శ్రీరామచంద్రుని లోకాభిరాముడని, అందరికీ రక్షకుడని, కోరిన కోర్కెలు తీర్చేవాడని, సమస్త జడపదార్థాలకు, జీవరాశులకు భగవంతుడని, అధిపతి యని తెలుసుకొని సేవించమని లోకానికి గళమెత్తి చాటుతున్నాడు ఇతడు దశరథుని కుమారుడు, తారక బ్రహ్మము మానవ రూపములో ఉన్నాడు ఎంతోబలమైన శివుని విల్లును విరిచాడు. ప్రజలను అనురక్తితో పరిపాలించిన రాజు. తన పాదస్పర్శతో అహల్య శాపాన్ని పోగొట్టాడు. ఒకవైపు దేవుడులాగ మరోవైపు మానవుడులాగా ప్రవర్తిస్తూ వెలగొందుతున్నాడు. వశిష్ఠునికి శిష్యుడు తన తండ్రికి మిత్రుడైన జటాయువునకు మోక్షాన్ని ఇచ్చాడు కొండల్లో చరించే వానరులు ఇతని సైన్యం. కొండలతో సముద్రానికి వారధి కట్టాడు సీతాపహరణ జరిగినప్పుడు దుఃఖించాడు బ్రహ్మ మనుమడైన రావణుని సంహరించాడు లౌకికమైన, వేదసంబంధమైన కర్మలను ఆచరించాడు. విభీషణుని లంకకు పట్టాభిషిక్తుని చేసాడు. లౌకికమైన, వైదికమైన కర్మలనాచరించాడు. అయోధ్యకు రాజయ్యాడు ఇంద్రాది దేవతలకు సేవచేసుకొనే భాగ్యాన్ని కలిగించాడు. నేడు శ్రీవేంకటాచలంపై నివసిస్తున్నాడు. లోకాలను తన ఉదరంలో ధరించాడు. తనలో ఎన్నో సూక్ష్మాలను అధిక్యాలను చూపిస్తున్నాడు చూడండి అని అన్నమయ్య శ్రీరాముని అవతార సంఘటనలను లోకంలో చెప్పుకుంటున్న తీరును తన పరిసర ప్రజలకు ఆత్మీయంగా తెలియజేయడం ఇందులో కనిపిస్తుంది

## సామంతం

రామునికి శరణంటే రక్షించి బ్రదుకరో
యేమిటికి విచారాలు యిక దౌత్యాలాల
చలమున తాటకిం జదిపిన బాణము

అరి మారీచు సుబాహుపై బాణము
మెలగి పరశురాము మెల్లేసిన బాణము
తళతళ మెరిసీని తలరో యసురలు॥

మాయా మృగముల మీద మరి వేసిన బాణము
జిగి రావణుఁ బరిమార్చిన బాణము
మిగుల శ్రీవేంకటేశు మేటి పొదిలోనున్నది
పగసాధించీ నిక పారరో రాకాసులు॥ (10-283)

శ్రీరాముని శరణు కోరితే రక్షిస్తాడని, బ్రతకండి అని ఎందుకు విచారిస్తారు? అని అన్నమయ్య దైత్యులను ఓదార్పుగా ప్రశ్నిస్తున్నాడు రామబాణం పంతంతో తాటకిని చంపిందని, మారీచ సుబాహులపై పడింది పరశురాముని వేసింది తళతళ మెరుస్తోంది. మాయా మృగాలపై వేసింది వాలిని వేసింది. సముద్రం మీద వేసింది. కుంభకర్ణుని తల త్రుంచింది రావణాసురుని సంహరించింది నేడు శ్రీవేంకటేశ్వరుని అమ్ముల పొదిలో వుంది, దుష్టులపై రామబాణం పగసాధిస్తుంది ఇక పారిపొండి. అని రామ బాణ మహిమను దైత్యులకు వివరించాడు.

## దేవగాంధారి

ఎంతని నుతియింతు రామరామ యిట్టె నీ ప్రతాపము రామరామ
పంతాన సముద్రము రామరామ బంధించ వచ్చునా రామరామ॥

బలు సంజీవిని కొండ రామరామ ఒక్క కోలనేసితివట రామరామ
కొలదిలేని వాలిని రామరామ ఒక్క కోలనేసితివట రామరామ॥

వెలయ నెక్కుపెట్టి రామరామ హరువిల్లు విరిచితివట రామరామ
పెలుచు భూమిజను రామరామ పెండ్లాడితివట రామరామ॥

శరణంటె విభీషణుని రామరామ చయ్యన గాచితివట రామరామ
బిరుదుల రావణుని రామరామ పీచమణచితివట రామరామ
ధరలో చక్రవాళము రామరామ దాటి వచ్చితివట రామరామ
సురలు నుతించిరట రామరామ నీచొప్పయిక నదియెంతో రామరామ,

సౌమిత్రి భరతులు రామరామ శత్రుఘ్నులు తమ్ములట రామరామ
నీ మహత్త్వము రామరామ నిండె జగములెల్లా రామరామ
శ్రీమంతుడ వన్నిటాను రామరామ శ్రీ వేంకటగిరిమీద రామరామ
కామిత ఫలదుడవు రామరామ కౌసల్యానందనుడవు రామరామ
(11-1-190)

శ్రీరాముని ప్రతాపాన్ని స్తుతించడానికి సాధ్యంకాదు ఎంతో పట్టుదలతో సముద్రాన్ని బంధించాడు. ఉన్నతమైన సంజీవని పర్వతాన్ని ఒక్క బాణంతో వేశాడు. బలాఢ్యుడైన వాలిని ఒక్క బాణంతో కూలదోసాడు శివధనస్సును విరిచాడు. సీతాదేవిని వివాహమాడాడు శరణు వేడిన విభీషణుని కాపాడాడు. గర్వించిన రావణాసురుని వధించాడు. దేవతలచేత స్తుతించబడ్డాడు. లక్ష్మణ భరత శత్రుఘ్నుల్ని తమ్ములుగా కలిగినవాడు. ఈ ప్రపంచమంతా రామ మహిమతో నిండిపోయింది. అన్నింటిలోను ఐశ్వర్యవంతుడు కోరినకోరికల్ని ఇచ్చేవాడు. కౌసల్యా కుమారుడు. అలాంటి శ్రీరాముడు నేడు వేంకటాచలంపై వున్నాడు. అని అన్నమయ్య శ్రీరామునితో ప్రత్యక్షరీతిలో ప్రస్తుతించాడు.

భళిభళి రామ పంతపు రామా నీ
బలిమి కెదురు లేదు భయహర రామా॥

విలువిద్య రామా వీరవిక్రమరామ
తలకొన్న తాటకాంతక రామా రామా
కొలయై తరుణి తలగుండు గండరామా
చెలమరి సమరపు జయ రామా రామా॥

రవికుల రామా రావణాంతక రామా
రవిసుత నుత కపిరాజ రామా రామా
సవరగా కొండలచే జలనిధి కట్టిన రామా
జవసత్వ సంపన్న జానకి రామా॥

కౌసల్య రామా కరుణానిధి రామా
భూసుత వరద సంభూత రామా

వేసాల పొరలె శ్రీవేంకటాద్రి రామా
దాసుల మమ్ము కావ తలకొన్న రామా॥

శ్రీరాముడు ఎంతో పట్టుదల కలిగినవాడు. అతని బలానికి ఎవరూ ఎదురు రారు. భయాన్ని హరింపచేస్తాడు. విలువిద్యలు తెలిసినవాడు. వీరుడు. పరాక్రమవంతుడు. తాటకి అనే రాక్షసిని సంహరించాడు. యుద్ధంలో విజయం సాధించినవాడు. సూర్యవంశస్థుడు. రావణాసురుని అంతం చేసినవాడు సూర్యకుమారుడైన సుగ్రీవునిచే స్తుతించబడినవాడు. ఎంతో నిపుణంగా కొండలతో సముద్రానికి వారధికట్టినవాడు జపతపాలనే సంపద కలిగినవాడు. కౌసల్యా తనయుడు కరుణా సముద్రుడు. బ్రాహ్మణులకు వరాలిచ్చినవాడు. నేడు శృంగారమూర్తి అయిన శ్రీవేంకటేశ్వరుడుగా వెలసినవాడు. భక్తులను కాపాడటం కోసం అవతరించినవాడు అని అన్నమయ్య శ్రీరామచంద్రుని మహిమాతిశయాన్ని స్తుతించాడు.

## శుద్ధవసంతం

దీన రక్షకు డఖిల వినుతుడు దేవదేవుడు రాముడు
జానకీపతి కొలువుడీ ఘన సమర విజయుడు రాముడు॥

హరుని తారక బ్రహ్మ మంత్రమై యమరిన యర్థము రాముడు
సురలగాచి యసురుల నడచిన సూర్యకులజుడు రాముడు
పరము నందును ముక్తిచూరలు జనుల కొసగెను రాముడు
హరియే ఈతడు హర విరించుల కాదిపురుషుడు రాముడు॥

మునుల ఋషులకు నభయ మొసగిన మూలమూరితి రాముడు
మనసులోపల పరమయోగులు మరుగు తేజము రాముడు
పనిచి మీదటి బ్రహ్మపట్టము బంటు కొసగెను రాముడు
మనుజ వేషము తోడ నగజకు మంత్రమాయెను రాముడు॥

బలిమి మించిన దైవికముతో భక్తసులభుడు రాముడు
నిలిచి తన సరిలేని వేలుపు నిగమ వంద్యుడు రాముడు
మెలుపు శ్రీవేంకట గిరీంద్రము మీది దేవుడు రాముడు
వెలసె వావిలిపాటి లోపలి వీర విజయుడు రాముడు॥

శ్రీరాముడు దీనరక్షకుడు సమస్త లోకంచేత స్తుతించబడుతున్న దేవాధి దేవుడి. సీతకు విభుడు. యుద్ధంలో విజయం పొందినవాడు శివునికి తారకబ్రహ్మ మంత్రమై అమరిన పరమార్ధం. రాక్షసులను సంహరించి దేవతల్ని రక్షించిన సూర్యవంశస్థుడు. సరయునదిలో ముక్తి పొందే విధానాన్ని ప్రజలకు తెలియజేసాడు. బ్రహ్మరుద్రాలకు ఆది పురుషుడైనవాడు. మునులకు, ఋషులకు అభయాన్నిచ్చినవాడు. భక్తుల హృదయాల్లో వెలిగే తేజస్సు మానసరూపం దాల్చినవాడు. భవిష్యత్తులో హనుమంతునికి బ్రహ్మ పట్టాన్నిచ్చినవాడు. మానవ బలాన్ని మించిన దైవశక్తితో భక్తులను సులభంగా అనుగ్రహించేవాడు. సాటిలేని మేటిఅయిన దేవుడు. వేదాలచేత సంస్తుతించబడుతున్నవాడు నేడు శ్రీవేంకటగిరిపై వెలసినవాడు. రాయలసీమలో వావిలపాడులో వెలసిన శ్రీరాముని సుగుణాలను, ప్రతాపాన్ని, దయాహృదయ అన్నమయ్యం కీర్తించాడు

## సాళంగం

కొలచిన వారల కొంగుపైఁడితడు
బలిమి తారక బ్రహ్మ మీతఁడు॥

ఇన వంశాంబుధి నెగసిన తేజము
ఘన యజ్ఞంబులఁగల ఫలము
మనుజ రూపమున మనియెడి బ్రహ్మము
నినువుల రఘుకుల నిధాన మితఁడు॥

పరమాన్నము లోపలి సారపు జవి
పరగిన దివిజుల భయహరము
మరిగిన సీతా మంగళ సూత్రము
ధరలో రామావతారం బితఁడు॥

చకిత దానవుల సంహారచక్రము
సకల వనచరుల జయకరము
వికసితముగు శ్రీవేంకట నిలయము
ప్రకటిత దశరథ భాగ్యంబితఁడు॥ (3-419)

శ్రీవేంకటేశ్వరుడు ప్రార్థించిన భక్తుల పాలిట కొంగుపైడి (కొంగున ముడివేసుకున్న బంగారం) వంటివాడు. ఇతడు బలమైన తారక బ్రహ్మం. సూర్యవంశ సముద్రం నుంచి ఉబికి వచ్చిన తేజస్సు. యజ్ఞాలలోని ఫలము. మానవ రూపంలో వున్న బ్రహ్మస్వరూపం. రఘువంశానికి నిధి అయినవాడు. పరమాన్నంలోని సారవంతమైన రుచి. దేవతల భయాన్ని హరించేవాడు సీతాదేవికి మంగళసూత్రం. ఈ భూమిపై రామావతారం దాల్చినవాడు. రాక్షసుల్ని సంహరించే చక్రం. వనాల్లోని సమస్త జీవులకు జయాన్ని కలిగించేవాడు. ప్రకాశవంతమైన పుణ్యాలకు నిలయం. త్రేతా యుగంలో కీర్తిశాలి అయిన దశరథ మహారాజుకు భాగ్యం అని అన్నమయ్య శ్రీరాముని ఘనతను రమ్యంగా వర్ణించాడు

## రామక్రియ

రాముడు లోకాభి రాముడు
అముక విజయనగర మందున్నవాడు॥

చక్కదనముల వాడు జానకీ వల్లభుడు
గక్కన శబరి పూజ గైకొన్న వాడు
వెక్కసమైన పైడి విల్లు నమ్ములవాడు
రక్కసుల వైరి దశరథ నందనుడు॥

శరధి గట్టినవాడు చాయ నల్లనివాడు
యిరవై సుగ్రీవాదుల నేలినవాడు
పరి భరత శత్రుఘ్న సౌమిత్రి సేవితుడు
అరిది మునుల కభయ మిచ్చిన వాడు॥

అట్టి కౌసల్యాత్మజుండు అయోధ్యా పతైన వాడు
వొట్టి తారక బ్రహ్మమై వుండేటి వాడు
గుట్టుతో వరములిచ్చే కోనేటి దండవాకు
పట్టపు శ్రీవేంకటాద్రి పరగినవాడు॥ (3–`.33)

శ్రీరాముడు లోకానికి ఆనందాన్ని చేకూర్చే అభిరాముడు అందమైన వాడు. సీతకు ప్రియమైన వాడు. ఏ మాత్రం ఆలస్యం చేయకుండా

శబరి పూజను స్వీకరించాడు. అతిశయమైన బంగారు విల్లు అమ్ముల పొది కలిగివాడు రాక్షసులకు శత్రువు దశరథునికి కుమారుడు. సముద్రాన్ని బంధించినవాడు. నల్లనిరంగు శరీరం కలిగినవాడు. ప్రేమతో సుగ్రీవుడు మొదలైన వారిని రక్షించినవాడు. భరత లక్ష్మణ శత్రుఘ్నులచే సేవించ బడే వాడు. మునులకు అభయాన్నిచ్చిన వాడు. కౌసల్యకు కుమారుడు. అయోధ్యకు రాజు తారక బ్రహ్మమై వెలసినవాడు. అలాంటి శ్రీరాముడు నేడు శ్రీవేంకటాద్రిపై కోనేటి సమీపంలో వుంటూ గుట్టుగా వరాలిస్తున్నాడు అని అన్నమయ్య విజయనగరంలో వెలసిన శ్రీరామచంద్రుని దయా హృద యాన్ని, రూపలావణ్యాలను కీర్తించాడు.

## సాంళగనాట

అవధారు దేవ హరికుల రామా
వివిధమై నీ బంటు వెలయుచున్నాడు॥

అదె కలశాపురము హనుమంత రాయుడు
కదనములోన రక్కసుల గొట్టి
తెదుట నిందరిలోన నేకాంగ వీరుడై
కొదిలేక ప్రతాపించి కొలువైవున్నాడు॥

చల్లని వనాలనీడ సాగుడు కొండలోన
వల్లెగా వేసుకున్న వాలముతోడ
పల్లదానము కేలు పంతమున నెత్తుకొని
కొల్లున మంటపములో కొలువైవున్నాడు॥

పెక్కుపండ్ల గొలలు పిడికిట పట్టుకొని
చక్కగా పెరిగి పెద్ద జంగచాచి
యిక్కువ శ్రీ వేంకటాద్రి నిరవైన సర్వేశ
గుక్కక నీవై భక్తి కొలువై వున్నాడు॥ **(3-144)**

హనుమంతుడు యుద్ధంలో రాక్షసుల్ని సంహరించి వీరులందరి మధ్యలో బ్రహ్మచారియై ప్రతాపంతో కొలువుతీరి వున్నాడు. చల్లని చెట్ల

నీడలో విశాలమైన కొండలమీద వాలాన్ని(తోక) పరచుకున్నాడు. రకరకాల పండ్లగెలల్ని పిడికిట్లో పట్టుకొని శరీరాన్ని బాగా పెంచుకొని శ్రీవేంకటేశ్వరుని పై భక్తితో కొలువు తీరివున్నాడు. అని కలశాపురంలోని హనుమంతుని అన్నమయ్య కీర్తించాడు.

## సాళంగనాట

సిగ్గరి పెండ్లి కూతుర సీతమ్మ
దగ్గరి సింగారబొమ్మ తలవంచకమ్మా॥

అల్లనాడే రాఘువుడు హరివిల్లు విరిచెను
యెల్లినేడే పెండ్లాడీ నిదివో నిన్ను
యెల్లగా జనకుడు నిన్నిచ్చీనట వీడె
వెల్లవిరి నీమాట వినవమ్మా॥

అదె పెండ్లి తెర యెత్తిరి అండనే వశిష్ఠుడుండి
చదివీ మంత్రాలు సేస చల్లవమ్మా
మొదల రాముని కంటె ముంచి తలంబ్రాలు వోసి
సుదతి యాతని మోము చూడవమ్మా॥

కంకణ దారాలు గట్టి కాలు దొక్కితివి మీదు
పొంకాన బువ్వ మందరో పొత్తుల నమ్మ
వుంతువ వావిలిపాటి నుండి శ్రీవేంకటగిరి
తెంకుల నిన్నుఁగూడి తిరుమాయనమ్మా॥ (32-40)

అన్నమయ్య తన మనోనేత్రంతో పెండ్లి పీటపై కూర్చున్న పెండ్లి కూతురైన సీతమ్మను వర్ణించి ఎంతో పరవశించిపోయాడు. సిగ్గుపడుతున్న పెండ్లికూతూర ఓ సీతమ్మ! సింగారబొమ్మా! తలవంచవద్దమ్మా అని సీతమ్మ పక్షాన నిలబడి అన్నమయ్య హెచ్చరిక చేస్తూ చైతన్య పరచడం ఆహ్లాదకరంగా వుంది. ఆనాడే శ్రీరాముడు శివునివిల్లు విరిచాడు. నేడు నిన్ను వివాహం చేసుకుంటున్నాడు. జనక మహారాజు ఆతనికి నిన్ను అప్పగించాడు. నేనుచెప్పే ఈ మాట వినవమ్మా పేరంటాండ్లు పెండ్లి తెర ఎత్తారు

వశిష్టుడు నీదగ్గరే వుండి మంత్రాలు చల్లుతున్నారు. నీవు శ్రీరాముని పై వేసలు చల్లమ్మా శ్రీరాముని కన్నా ముందే ఆతని తలపై తలంబ్రాలు పోసి ఆతని ముఖాన్ని చూడమ్మా. నీవు శ్రీరామునికి కంకణ దారాలు కట్టావు కాలుదొక్కావు ప్రేమతో మీరిద్దరూ విందు అరగించండి. అని అన్నమయ్య సీతమ్మతో ప్రతంకంగా సంభాషిస్తున్నట్లు వర్ణించాడు.

## గుండక్రియం

జయ జయ రామా సమర విజయ రామా
భయహర నిజభక్త పారీణ రామా॥

జలధి బంధించిన సౌమిత్ర రామా
సెలవిల్లు విరిచిన సీతారామా
అల సుగ్రీవునేలిన అయోధ్యరామా
కలిగి యజ్ఞము గాచే కౌసల్యరామా॥

అరి రావణాంతక ఆదిత్యకుల రామా
గురు మౌనులను కాచే కోదండ రామా
ధర నహల్య పాలిటి దశరథ రామా
హరు రాణి నుతల లోకాభిరామా॥

అతి ప్రతాముల మాయా మృగాంతక రామా
నుత కుశలవ ప్రియ సుగుణ రామా
వితత మహిమల శ్రీవేంకటాద్రి రామా
మతిలోన పాయని మనువంశ రామా॥ (9–11)

అన్నమయ్య శ్రీరాముని సముద్రాన్ని బంధించిన సౌమిత్రి రాముడని. శివుని విల్లు విరిచిన సీతారాముడని, సుగ్రీవుని రక్షించిన అయోధ్య రాముడని, విశ్వామిత్రుని యజ్ఞాన్ని సంరక్షించిన కౌసల్య రాముడని, రావణాసురుని సంహరించిన సూర్యవంశ రాముడని మునులను రక్షించిన కోదండ రాముడని, అహల్య పాలిటి దశరథరాముడ, శివుని రాణి అయిన పార్వతి స్తుతించె లోకాభిరాముడని, ఎంతో శౌర్యంతో మాయా మృగాన్ని

(మాయలేడి) సంహరించిన రాముడని, కుశలవులచే గుణగానం చేయబడిన సుగుణ రాముడని, విశేషమైన మహిమలు కలిగిన వేంకటాద్రి రాముడని మనసునుండి వదలని మనువంశ రాముడని పలువిధాలుగా వర్ణించాడు.

## సామంతం

ననువె రావణుడు సమరము లోపల
అమరులు కడు ముదమందిరి మెరసి॥

చెరగిరి రాముని శరీరముల కసురలు
సురగిరి పోట్ల చురుకునను
తొరగిరి నెత్తుట తునియలు సెసిన
తిరిగిరి తరుమగ దిక్కులకు॥

కూలిరి భల్లూకముల ఘోషలకు
వాలిరి వాయుజ వాలహతి
పీలిరి యంగదు వివిధ నాదముల
తూలిరి సుగ్రీవ దోర్బలమునను॥

దాగిరి లక్ష్మణ దాకకు నులుకుచు
వీగిరి వనచర వితతికిని
పాగిరి శ్రీవేంకటగిరి కృపారసమున
దోగిరి జనులు సంతోషంబునను॥ (11-228)

అన్నమయ్య రామ రావణ యుద్ధ సన్నివేశాన్ని కళ్ళకు కట్టిన రీతిగా వర్ణించాడు. యుద్ధంలో రావణాసురుడు హతుడయ్యాడు. శ్రీరాముని బాణాలకు రాక్షసుల శరీరాలు ముక్కలు ముక్కలై అన్ని దిక్కుల వైపు తిరిగి తిరిగి కూలాయి. భల్లూకాల(ఎలుగుబంట్లు) ఘోషలకు హనుమంతుని తోక దెబ్బలకు, అంగదుని రకరకాల అరుపులకు, సుగ్రీవుని భుజబలానికి లక్ష్మణుని పరాక్రమానికి, వానరుల శౌర్యానికి రాక్షసులందరు నశించారు సమస్త జనులు శ్రీవేంకటేశ్వరుని కృపవల్ల సంతోషించారు అని అన్నమయ్య రామ రావణ యుద్ధరంగ దృశ్యాన్ని వీర రసస్ఫోరకంగా వర్ణించాడు.

## సాళంగ నాట

కౌసల్యా నందనరామా కమలాప్త కులరామ
భాసుర వరద జయ పరిపూర్ణ రామ॥

మునుప దశరథ రాముడవై తమ్ములు నీవు
జనించి తాటకం జంపి జన్నము గాచి
వెనుకొని హరువిల్లు విరిచి సీత పెండ్లాడి
అనుమతి పరశురామునిచే కైకొంటివి॥

సుప్పనాతి శిక్షించి సొరిది ఋషుల గాచి
అప్పుడే కరదూషణాదుల గొట్టి
చొప్పుతో మాయామృగము శోధించి హరియించి
కప్పి హనుమంతు బంటుగా నేలుకొంటివి॥

సొలసి వాలినడచి సుగ్రీవు కూడుక
జలధి బంధించి లంకసాధించి
వెలయ రావణు గెల్చి విభీషణుని మన్నించి
చెలగితి వయోధ్యలో శ్రీవేంకటేశుడ॥

శ్రీరాముడు దశరథునికి పుత్రుడై తాటకి అనే రాక్షసుని సంహరించాడు. విశ్వామిత్రుని యాగాన్ని రక్షించాడు. శివధనుస్సును విరిచి సీతను వివాహమాడాడు. పరశురాముని జయించి కోదండాన్ని స్వీకరించాడు. శూర్పణఖను శిక్షించాడు. ఋషులను రక్షించాడు. ఖరదూషణాది రాక్షసుల్ని సంహరించాడు. మాయా మృగం రూపంలోని మారీచుని చంపాడు. హనుమంతుని బంటుగా ఏలుతున్నాడు. వాలిని సంహరించాడు. సుగ్రీవునితో కలసి సముద్రాన్ని బంధించి లంకలో ప్రవేశించాడు. రావణాసురుని జయించి సంహరించి విభీషణుని గౌరవించాడు. తిరిగి అయోధ్యకు వచ్చి రాజ్యాన్ని ఏలాడు ఈ సంఘటనలన్ని శ్రీవేంకటేశ్వరునికి గుర్తుచేస్తూ ప్రత్యక్షంగా స్వామివారితో సంభాషించడం ఈ కీర్తనలో కనిపిస్తుంది.

## పాడి

సౌమిత్రి సహోదర దశరథ రామా॥
చేముంచి గుత్తిలో వెలసిన రామా॥

చెలిమి సుగ్రీవుతోడ చేసిన రామ తొల్లి
శిలను పడతి గావించిన రామా
చెలరేగిన వానర సేనల రామా
శిలుగు మాయా మృగము చించిన రామా॥

తరణి వంశ తాట కాంతక రామా
నరనాథ కౌసల్యా సందన రామా
సిరుల పెండ్లాడిన సీతారామా॥
గరిమతో సేతువు గట్టిన రామా॥

రావణాది దనుజ హరణ రామా
కావించి విభీషణుని గాచిన రామా
దీవెన లయోధ్యలో చెందిన రామా
శ్రీవేంకటాద్రి మీద శ్రీరామా॥ (9-210)

శ్రీరాముడు లక్ష్మణునికి అన్న అని, సుగ్రీవునితో స్నేహంచేసిన వాడని, రాతిని స్త్రీగా మార్చిన వాడని. వానరసైన్యం కలిగినవాడని, మాయా మృగాన్ని చెండాడిన వాడని, సూర్యవంశస్థుడని, తాటకిని సంహరించిన వాడని, ప్రజలను పాలించే రాజని, కౌసల్యా కుమారుడుని, వైభవంగా సీతను పెండ్లాడిన వాడని, పట్టుదలతో, ప్రతాపంతో సముద్రానికి వారధి కట్టినవాడని, రావణాసురుడు మొదలైన రాక్షసుల్ని సంహరించిన వాడని. ప్రేమతో విభీషణుని రక్షించిన వాడని, అయోధ్యలో తులతూగిన వాడని, అలాంటి శ్రీరాముడు నేడు వేంకటాచలంపై నివసిస్తున్నాడని అన్నమయ్య శ్రీరాముని సుగుణాలను. శౌర్యాన్ని, దయాహృదయాన్ని కీర్తించాడు.

## మాళవిగౌళ

సీతక పడుసు దోసిటపాల మగఁడు
బాతి పడిన నగుపడునటె వీఁడు॥

మూడుగాళ్ళ పెద్ద ముసలి సవ్వలుగొన్న
పాడి మేక పాలి పాశము
వేడి జుట్టిన తల్లి వేకటియై కన్న
వాడు వీడు శిన్న వాడటె వీడు॥

కొండలంత సనుగుబ్బల రాకాశి
మిండెత గవిశిపై మింగరాగా
గుండె వగుల నొక్క కోలనె సరగన
సెండి వేసినట్టి సిసువటె వీడు॥

వృదుకు నుదుటి వాడు వుదుటున దాసిన
బెడిదపు మోతల పెను విల్లు
తొడికి విరిశివేసి దోమటి నునుబాల
కడుపుల తొలి పెండ్లికొడుకటె వీడె॥

మారు తల్లి నేతిమాటల పడలేక
వూరు విడిసి అడవుల కేగి
సేరవచ్చిన యింతి సెవులు ముక్కు కోసి
పేరువారిన పెద్ద బిరుదటే వీడు॥

పొగదాగు తపసుల పుల్ల వెలుగు మాట
లగడు సేయుగ ముగు రసురుల
సగము సాయునంపి సడిపెట్టి విడిసిన
బగడికాడు సిన్నపడుపటే వీడు॥

మిసమిస మెరిసేటి మొగము మేనిపై
పసల తగిలి వెంట పారిపారి
గసిక వింటికోళ గరిగాడ నేసిన
మసిమాయల పల మరిగదె వీడు॥

రవ్వాల సేతల రాకాశి నాయుని
కొవ్వుప మదము తెక్కులు గొని
యివ్వాల తిరు వేంకటుడై యున్నాడు
గువ్వేక నిన్ను జట్టి గొనెగదె వీడు॥ (12–378)

శ్రీరాముడు సీతక్క దోసిట్లోని పాలమగడు (నిర్మలమైన) అని వృద్ధుడైన దశరధుని పుత్ర కామేష్టి యజ్ఞంలో వెలువడిన పాయసం వల్ల పుట్టినవాడని, కృష్ణావతారంలో విషపు పాలు ఇవ్వడానికి వచ్చిన పూతనను పిడికిలితో గుద్ది చంపిన వాడని శివధనస్సును విరిచి సీతను పెండ్లాడిన కొడుకని, కైకమాటల్ని భరించలేక అడవుల కెళ్ళాడని అక్కడ తనను కామించిన శూర్పణఖాకు ముక్కు చెవులు కోసిన వాడని, రాకసుల్ని సంహరించి విశ్వామిత్రుని యజ్ఞాన్ని రక్షించి తపస్సులకు ఆనందాన్ని కలిగించిన వాడని, రాకసరాజైన రావణాసురుని హతమార్చి నేడు వేంకటాచలం పై శ్రీవేంకటేశ్వరుడై వెలశాడని అన్నమయ్య శ్రీరామావతార ఘట్టాల్ని అచ్చ తెనుగులో రచించాడు. ఒక జానపద స్త్రీ మరొ జానపద స్త్రీతో శ్రీరాముని సద్గుణాలను, శౌర్యాన్ని ఆశ్చర్యంతో చెబుతున్నట్లు అన్నమయ్య భావించి రచించాడు.

ఒక్కడే ఏకాంగ వీరుడు ర్వికి దైవమౌనా
ఎక్కడా హనుమంతుని కెదురా లోకము॥

ముంటట నేలేటి పట్టమునకు బ్రహ్మైనాడు
అందరు దైత్యుల జంపి హరిదేవైనాడు
అందిరుద్ర వీర్యము తానై హరుడై నాడు

ఎందునా హనుమంతుని కెదురా లోకము॥
చుక్కలు మోవ పెరిగి సూర్యుడు తానైనాడు
చిక్కు పాతాళము దూరి శేషుడైనాడు
గక్కన వాయుజుడె జగత్ప్రాణుడైనాడు
ఎక్కువ హనుమంతుని కెదురా లోకము॥

జలధి పుటమి కెగసి చంద్రుడు తానైనాడు
చెలగి మేరువు పొంత సింహమైనాడు
బలిమి శ్రీవేంకటేశు బంటై మంగాంబుధి
ఇల ఈ హనుమంతుని కెదురు లోకము॥

ఈ భూమికి ఏకాంగా వీరుడు, బ్రహ్మచారి అయిన హనుమంతు డొక్కడే దైవమని, ఈ లోకంలో ఎక్కడా హనుమంతునికి ఎదురు లేదని

రాబోవు కాలంలో బ్రహ్మ పట్టాన్ని అధిష్ఠించనున్నాడని, రాక్షసులందరినీ చంపి హరికి ప్రీతిపాత్రుడయ్యాడని, ఆకాశమంత ఎత్తు పెరిగి తానే సూర్యుడయ్యాడని, భయంకరమైన పాతాళంలోకి దూసుకుపోయి ఆదిశేషుడయ్యాడని. అంతలో వాయుపుత్రుడై ఈ జగాలకు ప్రాణమయ్యాడని, సముద్రం నుండి పైకి ఎగిరి తానే చంద్రుడయ్యాడని. మేరుపర్వతం సమీపంలోని సింహమయ్యాడని, మంగాంబుధిలో శ్రీ వేంకటేశ్వరుని ఇంటై వెలశాడని, అలాంటి హనుమంతునికి ఈ లోకంలో ఏదీ ఎదురులేదని మానవాళికి మంగాంబుధి అనే క్షేత్రంలో వెలసిన హనుమంతుని ప్రతాపాన్ని, మహిమల్ని అన్నమయ్య తెలిపాడు

పెరిగినాడు చూడరో పెద్ద హనుమంతుడు
పరగినా విద్యల బలవంతుడు

రక్కసుల పాలికి రణరంగ శూరుడు
వెక్కసపు ఏకాంగ వీరుడు
దిక్కులకు సంజీవి దెచ్చిన ధీరుడు
అక్కజమైనట్టి ఆకారుడు॥

లలి మీరినయట్టి నాముల భీముడు
బలు పతికుల సార్వభౌముడు
నెలకొన్న లంకా నిర్ధూమ ధాముడు
తలపున శ్రీరాము నాత్మారాముడు॥

దేవ కార్యముల దిక్కు వరేణ్యుడు
భావింపగల తపః ఫల పుణ్యుడు
శ్రీ వేంకటేశ్వర సేవాగ్రగణ్యుడు
సావధానుడు సర్వ శరణ్యుడు॥

హనుమంతుడు కామగమన విద్యలు, కామరూప విద్యలు, సకల శాస్త్రాలు తెలిసినవాడు. రాక్షసుల్ని యుద్ధరంగంలో హతమార్చిన శూరుడు. అత్యంత బలం కలిగిన వీరుడు. సంజీవిని తెచ్చిన ధీరుడు. ఆశ్చర్యకరమైన

ఆకారం కలిగినవాడు. గర్వించే వారిపట్ల అతిశయించిన భయంకరుడు. వానర రాజ్యానికి సార్వభౌముని వంటివాడు. లంకా పట్టణాన్ని దహించినవాడు. శ్రీరాముని ఆత్మారాముడుగా కలిగినవాడు. దేవకార్యాలను దిక్కుగా కలిగి నెరవేర్చినవాడు భావించిన వారికి తపః ఫలాన్నిచ్చే పుణ్యమూర్తి. శ్రీ వేంకటేశ్వరుని సేవకుల్లో మొదటివాడు, ఏకాగ్ర చిత్తం కలిగినవాడు. సర్వప్రాణులకు శరణ్యమైనవాడు. అని అన్నమయ్య హనుమంతుని మహిమలను, సాహసకృత్యాలను, దయా హృదయాన్ని వర్ణిస్తూ, స్తుతిస్తూ అలాంటి హనుమంతుడు ఎంతో ఎత్తున పెరిగాడు చూడండి అంటూ లోకానికి తెలియజేసుడం ఈ సంకీర్తనలో కనిపిస్తుంది.

## సాంభగనాటు

శరణు శరణు వేదశాస్త్ర నిపుణనీకు
అరుదైన రామకార్య ధురంధరా॥

హనుమంత రాయ అంజనా తనయా
ఘన వాయుసుత దివ్య కామరూప
అనుపమలంకా దహన వార్ధిలంఘన
జనసురనుత కలశాపుర నివాస॥

రవితనయ సచివ రావణ వనా పహార
పవన వేగ బలాఢ్య భక్త సులభ
భువన పూర్ణ దేహ బుద్ధి విశారద
జవసత్వ వేగ కలశాపుర నివాస॥

సీతాశోక నాశన సంజీవ శైలాకర్షణ
అతత ప్రతాప శౌర్య అసురాంతక
కౌతుక శ్రీ వేంకటేశు కరుణాపమేత
శాత కుంభవర్ణ కలశాపుర నివాశ॥

వేదాల్లో, శాస్త్రాల్లో నైపుణ్యం కలిగినవాడు, రామకార్యాల్లో ధురంధరుడు,

కామరూప విద్యలు తెలిసినవాడు, సముద్రాన్ని లంఘించినవాడు, లంకను దహించినవాడు, సూర్యపుత్రుడైన సుగ్రీవునికి మంత్రి, రావణాసురుని వనాన్ని నాశనం చేసినవాడు, వాయువేగం కలిగిన బలాఢ్యుడు, బుద్ధిబలం కలిగినవాడు, లోకమంతా నిండిన పరిపూర్ణ దేహం కలిగినవాడు, జవము, సత్వము, వేగము కలిగినవాడు, సీతాదేవి శోకాన్ని పోగొట్టేవాడు, సంజీవ పర్వతాన్ని పెకలించినవాడు, సాటిలేని ప్రతాపం, శౌర్యం కలిగినవాడు, రాక్షసుల్ని హతమార్చినవాడు, శ్రీ వేంకటేశ్వరుని దయకలిగినవాడు, బంగారు కలశాలవంటి రంగు కలిగినవాడు, కలశాపురంలో వెలసినవాడు అయిన హనుమంతుని అన్నమయ్య శరణు వేడడం ఈ సంకీర్తనలో కనిపిస్తుంది

## శంకరాభరణం

శరణు కపీశ్వర శరణం బనిలజ
సరవినెంచ నీ సరియిక యేది॥

పుట్టిననాడే భువనము లెరగగ
పట్టితి సూర్యుని పండనుచు
ముట్టిన చుక్కలు మోపగ జెరిగితి
యిట్టి ప్రతాపివి యెదురేదయ్యా॥

అంపిన యప్పుడె యంబుధి దాటితి
వింపులు సీతకు నిచ్చితివి
సంపద మెరయుచు సంజీవి దెచ్చితి
పెంపును సొంపును పేర్కొన వశమా॥

చెదరక నేడే శ్రీ వేంకటగిరి
గదిసి రామకృప గైకొంటి
వదలక నీకృప వాడనైతి నిదె
యెదుటనే కాచితి వికకడమేమి॥ (1-421)

వానర శ్రేష్ఠుడు, వాయుదేవుని కుమారుడు అయిన హనుమంతునికి సాటి ఎవ్వరూ లేరని, పుట్టినప్పుడే లోకాలన్నీ చూస్తుండగా సూర్యుని పండుగా భావించి పట్టుకోబోయాడని, ఆకాశంలోని చుక్కల్ని తాకేలా పెరిగాడని, హనుమంతుడు ఇంతటి ప్రతాపం కలిగినవాడని, సుగ్రీవుడు ఆజ్ఞాపించగానే సముద్రాన్ని దాటి లంకలో ప్రవేశించి సీతాదేవికి ఆనందం చేకూర్చాడని, ఎంతో సాహసంతో, పట్టుదలతో సంజీవిని తెచ్చాడని, హనుమంతుని పేరును, పెంపును కీర్తించడానికి సాధ్యం కాదని, అనాడు శ్రీరాముని కృపను, నేడు శ్రీ వేంకటేశ్వరుని కృపను పొందాడని, అలాంటి హనుమంతుని కృపను పొందానని అన్నమయ్య హనుమంతునితో ప్రత్యక్షంగా సంభాషించడం, హనుమంతునికి శరణాగతి చేయడం ఈ సంకీర్తనలో కనిపిస్తుంది.

కలశాపురము కాడ కందువ చేసుకొని
అలరుచున్నవాడు హనుమంత రాయడు॥

సహజాన నొక జంఘ చాచి సముద్రము దాటి
మహిమ మీరగ హనుమంత రాయడు
ఇహమున రామబంటై ఇప్పుడూ నున్నవాడు
అహరహమును దొడ్డ హనుమంత రాయడు॥

వడలని ప్రతాపాన వాయుదేవ సుతుడై
మదియించినాడు హనుమంత రాయడు
చెదరగ యే పొద్దు శ్రీ వేంకటేశు వాకిట
అదివో కాచుకున్నాడు హనుమంత రాయడు॥

హనుమంతుడు కలశాపురంలో నివసిస్తూ అలరారుతున్నాడు. అలవోకగా ఒక జంఘను చాచి మహిమాతిశయంతో సముద్రాన్ని దాటాడు. ఇప్పటికీ ఇహలోకంలో శ్రీరాముని బంటుగా వున్నాడు. వీడని ప్రతాపం కలిగి, వాయుదేవుని కుమారుడై ఎప్పుడూ శ్రీ వేంకటేశ్వరునివాకిట్లో వుంటున్నాడు. అని అన్నమయ్య శ్రీరామదాసుడైన హనుమంతుని శౌర్యాన్ని, అతని ఉనికిని లోకానికి తెలియజెప్పాడు.

సింహగిరి నరహరిపై చాతుర్లక్ష కీర్తనలవంటి రచనలు చేసిన కృష్ణమాచార్యులు రామనామ నృసింహనామాలు రచించాడు.

నీలకంధర వరపురందర నిత్యకృత్యము రామనామము
శైలరాజ సుతా తనూభవ సతతకృత్యము రామనామము
దివ్యమంత్రము రామనామము భవమంత్రము రామనామము
జననిధానము రామనామము మనువిధానము రామనామము

దశరథాత్మజ రామా రామా
ధన్య చరిత్రా రామా రామా
భరతాగ్రజా రామా రామా
పంకజేక్షణా రామా రామా॥

శివుడు, ఇంద్రుడు, పార్వతి ప్రతినిత్యం స్మరించే రామనామం దివ్యమయిందని, మంగళకరమయిందని, జనులకు నిధి వంటిదని, శ్రీరాముడు దశరథునికి ప్రియ పుత్రుడని. ధన్యమైన చరిత్ర కలవాడని, భరతునికి అగ్రజుడని, పద్మాల వంటి నేత్రాలు కలిగిన వాడని, కృష్ణమాచార్యులు శ్రీరాముని, శ్రీరామ నామాన్ని కీర్తించాడు.

భద్రాచల రామదాసు శ్రీరామ నామ మహత్యాన్ని అనేక రకాలుగా కీర్తించాడు,

భజరే శ్రీరామం హే మానస భజరే రఘురామం
భజరే మానస రామం భజరే జగదభి రామం॥

రామ రామయని నోట రవ్వంత సేపైన
నీమము తప్పక మంచి నీతితో పల్కని వా
డున్మత్తుడు మూఢచిత్తుడు॥

దేహ మశాశ్వతమని తెలియక దుర్బుద్ధి చేత
సాహసమున సాధుజనులను సంకట బెట్టెడి వాడు
పాతకి బ్రహ్మ ఘాతకి॥

రామజోగి మందు కొనరే ఓ జనులారా
రామజోగి మందుకొని ప్రేమతో భుజింపుడన్న
కామ క్రోధ లోభ మోహ ఘనమైన రోగాలకు మందు॥

శ్రీరాముల దివ్యనామస్మరణ చేయుచున్న
ఘోరమైన తపములను కోరనేటికే మనసా
వేరువేరు దైవములను వెదుక నేటికే మనసా॥

రామ నామము పల్కవే పాపపు జిహ్వా
రామ నామము పల్కవే పాపపు జిహ్వా
రామ నామము నీవు ప్రేమతో పల్కిన
స్వామి ఎల్లపుడును కామితార్థములిచ్చు॥

శ్రీరామ నామమే జిహ్వాకు స్థిరమై యున్నది యున్నది
శ్రీరాముల కరుణయే లక్ష్మికరమై యున్నది యున్నది
ఓరామ నీనామ మేమి రుచిరా
శ్రీరామ నీనామము మేమి రుచిరా॥

జగదభి రాముడైన శ్రీరాముని మనసుతో సేవించండి. రామరామ అని నోటితో కొంతసేపైన నియమం తప్పకుండా పలుకనివాడు ఉన్మత్తుడు, మూర్ఖుడు, ఈ శరీరం అశాశ్వతం అని తెలుసుకోకుండా దుష్టబుద్ధితో, సాహసంతో సాధుమానవుల్ని కష్టపెట్టేవాడు పాతకి, బ్రహ్మఘాతకి, రామ యోగి అనే మందును కొని ప్రేమతో భుజించండి. ఈ మందు కామ క్రోధ లోభ మోదమాత్సర్యాలనే అరిషడ్వర్గాలకు ఘనమైన మందు. శ్రీరాముని స్మరణ చేస్తూవుంటే కఠినమైన తపస్సులను చేయవలసిన పనిలేదు. రకరకాల దైవాల్ని వెతుక్కోవలసిన పనిలేదు శ్రీరామ నామాన్ని పల్కని నాలుక పాపపు నాలుక అవుతుంది. కాబట్టి రామనామాన్ని పలకాలి. రామ నామాన్ని పలకాలి రామనామాన్ని పల్కిన ఆ స్వామి ఎల్లప్పుడూ కోరిన కోరికల్ని తీర్చుతాడు అని శ్రీరాముని మహిమను, రామనామ ఘనతను రామదాసు లోకానికి ప్రబోధించాడు. శ్రీరామనామమే తననాలుకకు స్థిరమై వుంది అన్ని శ్రీరాముని దయే శుభకరమని, ఐశ్వర్యవంతమయిందని

రామనాను విస్మవించుకున్నాకు. సంగీతరత్నం, రామభక్తుడు నాదబ్రహ్మ అయిన త్యాగరాజు సంకీర్తనల్లో రామమహత్యం, రామనామ మహిమ అంశాలు అనేకం కనిపిస్తాయి.

రామ భక్తి సామ్రాజ్యమే మానవుల కబ్బెనో
ఆ మానవుల సందర్శన మత్యంత బ్రహ్మానందమే మనసా
చక్కని రాజమార్గము లుండగ
సందుల దూరనేల! ఓమనసా

కంటికి సుందర తరమగు రూపమే ము
క్కంటి నోట చెలగెడు నామమే, త్యాగరా
జింటనే నెలకొన్న దైవమే యిటు
వంటి శ్రీ సాకేత రాముని భక్తియను॥

నామ కుసుమములచే పూజించెడి
నరజన్మమే జన్మము మనసా॥

శ్రీమన్మానస కనక పీఠమున
చెలగ జేసికొను వర శివరామా

నాదస్వరమను వరనవరత్న పు
వేదికపై సకల లీలావి
నోదుని పరమాత్ముని శ్రీరాముని
పాదములను త్యాగరాజు హృద్భూషణుని

ఆనందసాగర మీదని దేహము
భూమి భారము రామబ్రహ్మ
శ్రీ నాయకాఖిల నైగమా
శ్రిత సంగీత జ్ఞానమను బ్రహ్మ

ప్రొద్దు పోయెను శ్రీరాముని పూని భజించవే మనమా
నిద్దురచేత కొన్నాళ్ళు ఓమనసా

బాగుగా నామ కీర్తనములు చేయుట
భాగ్యమనక కొన్నాళ్ళు

త్యాగరాజు నుతుడైన శ్రీరాముని
తత్త్వము తెలియకయే కొన్నాళ్ళు

ఆతడే ధన్యుడురా ఓమనసా
కర్మ నిష్ఠుడైన ధర్మశీలుడైన
కర్మ రామనామ మర్మము దెలిసిన

భజన పరుల కేల దండపాణి భయము మనసా రామ
అజరుద్ర సురేశుల కాయా స్థానమొసంగు రామ

భజన సేయ రాదా రామ
అజరుద్రాదులకు సతతమాత్మ మంత్రమైన రామ
ఈ మేను గలిగినందుకు సీతారామ నామమే పల్కవలెను
కామాది దుర్గుణ స్తోమ పూరితమైన

పామరత్వమే గాని నేమము లేనట్టి
ఊరకయే కల్గునా రామభక్తి
సారెకును సంసారమున జొచ్చి
సారమని యెంచువారి మనసున

ఆలు సుతులు చుట్టాలు వరసద
నాలు కాయ ఫలాలు కనకధ
నాలుగల విభవాల గని యస్థి
రాలను భాగ్యశాలులకు గాక

రాజస గుణ యుక్త పూజల నొనరించ
కజ సన్నుత త్యాగరాజుని జిహ్వపై
రాజిల్లు వరమంత్ర రాజసమును స
దాజపించు మహరాజులకు గాక

తెలియలేరు రామభక్తి మార్గమును
ఇలనంతట తిరుగుచు కలవరించెదరు గాని

వేగలేచి నీటమునిగి విభూతిపూసి
వేళ్ళనెంచి వెలికి శ్లాఘనీయులై
బాగుగా పైకి మార్జన లోలురై
రేగాని త్యాగరాజ నుత

మోక్షము గలదా భువిలో జీవన్ముక్తులు గానివారలకు
సాక్షాత్కార నీ సద్భక్తి సంగీత జ్ఞాన విహీనులకు

రామభక్తి అనే సామ్రాజ్యం ఏ మానవులకు అలవడుతుందో ఆ మానవుల్ని దర్శిస్తే బ్రహ్మానందం కలుగుతుంది. రామభక్తి అనే చక్కని రాజమార్గం వుండగా సందుల్లో దూరడం ఎందుకు? శ్రీరాముని రూపం కంటికింపుగా వుంటుంది రామనామం ఎల్లప్పుడు శివుని నోటిలో అలరారుతుంది. నామాలు అనే బంగారు పీఠంలో నెలకొన్న రాముడు. నాదస్వరం అనే నవరత్నపు వేదికమీద శ్రీరాముని పాదాలను పూజించాలి,

రామబ్రహ్మం అనే ఆనందసాగరాన్ని, సంగీత జ్ఞానమనే బ్రహ్మనందసాగరాన్ని ఈదలేని శరీరం భూమికి భారం. నిద్రచేత కొన్నాళ్ళు సంకీర్తన గావించడం భాగ్యం అని తెలుసుకోకుండా కొంతకాలం, శివునిచే స్తుతింపబడే శ్రీరాముని తత్త్వాన్ని తెలుసుకొనకుండా కొంతకాలం వ్యర్థమైపోయింది. కాలమంతా అయిపోతోంది ప్రొద్దుపోతోంది శ్రీరాముని పట్టుదలతో సేవించు, కర్తవ్యపరాయణుడు, ధర్మబుద్ధుడు, రామనామ మర్మం తెలిసినవాడే ధన్యుడు. బ్రహ్మ, శివుడు, దేవేంద్రాదులకు అయాపదవుల నిచ్చే శ్రీరామభజన చేసేవారికి యముని భయం వుండదు

కామక్రోదాధి దుర్గుణాలతో కూడిన, నియమం లేనట్టి ఈ శరీరం కలిగినందుకు పవిత్రమైన సీతారామ నామాన్నే పలకాలి సంసారమే సారం అని భావించే వారికి శ్రీరామునిపై భక్తి ఊరకే కలగదు, భార్య బిడ్డలు,

బంధువులు, సుందరగృహాలు, కాయలు, పండ్లు, బంగారం, ధనం మొద లైన వైభవాలను చూసి అవి అస్థిరం అనగలిగిన భాగ్యవంతులకు, సాత్త్విక మైన పూజలు చేసేవారికి, శ్రీరాముని నామాన్ని ఎల్లప్పుడు జపించే వారికి మాత్రమే శ్రీరామునిపై భక్తి కలుగుతుంది. కపట సన్యాసులు కొంతమంది అజ్ఞానులు ఉదయాన్నే లేచి నీటిలో మునిగిని, విభూతి పూసుకుని, వ్రేళ్ళతో రుద్రాక్షలు త్రిప్పుతూ, ఇతరులచే స్తుతించబడుతూ డబ్బును సంపాదిస్తు న్నారేకానీ రామభక్తి మార్గాన్ని తెలుసుకోలేకపోతున్నారు. లోకమంతా తిరుగుతున్నారు. బ్రతికి వుండగానే మానవులు ముక్తిని సంపాదించాలి' అలా జీవన్ముక్తిని సాధించలేని వారికి మోక్షంరాదు. అని త్యాగయ్య లోకా నికి రామభక్తిని, సంగీత శక్తిని ప్రబోధించాడు.

ఈవిధంగా అన్నమాచార్య సంకీర్తనల్లో శ్రీరాముని అవతార ఘట్టాలు శ్రీరాముని సద్గుణాలు, శ్రీరామ బంటైన హనుమంతుని ప్రతాపం వర్ణించ బడింది, అలాగే కృష్ణమాచార్యులు, రామదాసు, త్యాగరాజు మొదలైన పదకవుల సంకీర్తనల్లోని శ్రీరామ నామ మహత్యం, రామావతార ఘనత మొదలైన అంశాలు పేర్కొనబడ్డాయి,

శ్రీరామనవమి 35వ సంగీతోత్సవాలు
ఉపన్యాసం
శ్రీరామ భక్త గానసభ, రాజమండ్రి.
తేది 12-4-2000

# అన్నమయ్య సంకీర్తనల్లో శ్రీ వేంకటేశ్వరుడు

॥ ప్రస్తావన – అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుల ఆత్మీయానుబంధం ।

'వేంకటాద్రి సమస్థానం బ్రహ్మాండే నాస్తికించన
వేంకటేశ సమోదేవో నభూతో నభవిష్యతి॥

వేంకటాచలంతో సమానమైన స్థానం బ్రహ్మాండంలో లేనేలేదు శ్రీవేంకటేశ్వరుని సమానమైన దైవం భూత భవిషత్కాలాల్లో లేదు అను 'కలౌ వేంకటనాయక' అని విశ్వఖ్యాతి, శ్రీవేంకటేశ్వర వరప్రసాది అన్నమయ్య, ఈయన స్వామివారి పంచాయుధాల్లో ఒకటైన నందకాంశంలో జన్మించిన పరమ భాగవతోత్తముడు, ప్రజల్లో విష్ణుభక్తిని, విష్ణు దశవతార లీలల్ని, నీతి, జ్ఞాన, మానవత్వాంశాల్ని ప్రబోధించడానికే అవతరించిన సంకీర్తనాచార్యుడు. పద్యకవిత్వం రాజ్యమేలుతున్న కాలంలో పదకవిత్వానికి పట్టంకట్టిన పదకవితా పితామహుడు; అన్నమయ్య ఆజన్మాంతం శ్రీవేంకటేశ్వరుని సర్వకాల సర్వావస్థల్లో త్రికరణశుద్ధిగా సేవించి తాను తరించి లోకాన్ని తరింపచేశాడు.

శిశుప్రాయంలో కూడా తల్లి అన్నమయ్యకు ఉగ్గుపెట్టాలన్నా ఇది తిరుమలప్పని ప్రసాదమంటే కాని తినేవాడు కాదు.

'— —యుగ్గు పెట్టఁబోయినను
పనిఁబూని తిరుమలప్పని ప్రసాదంబు
గొనుమని యనక లోగొనఁడు' (చిన్నన్న అన్నమాచార్య చరిత్ర పుట 10)

అలాగే తల్లి బాలఅన్నమయ్యను ఉయ్యాలతొట్టిలో వేసి జోలపాట పాడేటప్పుడు శ్రీవేంకటపతి పేరుమ వివరించకపోతే ఏడుపు మానేవాడు కాదు.

'ఎడపక తొట్టిలో నిడి యొంతపాటు
పడియెంత షడిజోలఁ బాడెనేనియును

వేంకటపతి పేరు వివరించి పాట
పొంకించ కుండినఁ బోరూర డిలండు
చిన్నన్న అన్నమాచార్య చరిత్ర పుట 10)

అన్నమయ్యకు చిన్నప్పటినుంచే శ్రీహరి వరంవల్ల సమస్త విద్యలు అతని నాలుకపై వాటంతట అవి నర్తించసాగాయి. మాట్లాడిన ప్రతిమాట అమృతకావ్యమయ్యింది. పాడిన ప్రతిపాట పరమగానమయ్యింది అతని కవిత్వాన్ని అతని గానాన్ని సమస్త లోకాలు కీర్తించసాగాయి. అన్నమయ్య శ్రీవేంకటేశ్వరునిపై చిత్రవిచిత్రమైన సంకీర్తనలు రచించారు

అన్నమాచార్యున కహినాయకాద్రి
వెన్నుని వరముచే విద్యలన్నియును
నమితంబులగుచు జిహ్వాం రంగసీమ
తముఁదామే సొచ్చి నర్తనమాడఁ దొడఁగె

నా పిన్నప్రాయంబు నందు నామెటి
యేపారఁ దనమది కిచ్చయైనట్లు
ఆడిన మాటెల్ల నమృత కావ్యముగ
పాడిన పాటెల్లఁ బరమగానముగ

తన కవిత్వమునకుఁ దనగానమునకుఁ
గనుఁగొని సకల లోకములు గీర్తింప
వేంకటపతి మీఁద వింతవింతలుగ
సంకీర్తనంబులు సవరించు నిచ్చ' (చి అ చ పుట 11)

అన్నమయ్య చిన్నప్పటినుంచీ జననీ జనకులు, అన్న వదినెలు చెప్పే పనుల్ని కాదనకుండా చేస్తుండేవాడు. ఒకసారి వారు పశువులకు కసువు కోసుకుని రమ్మని ఆజ్ఞాపించారు. బాలఅన్నమయ్య కొడవలి తీసుకుని అడవికెళ్ళి పడికెడు గడ్డి కోస్తున్నప్పుడు చిటికెనవ్రేలు తెగి రక్తం కారింది అది చూచి అన్నమయ్య ఎంతోబాధపడ్డాడు. శ్రీవేంకటేశ్వరుని పాదాల్ని తలచుకొని శ్రీహరి హరీ అంటూ వదినచేత దెబ్బలు తినడం రోతఅని భావించడు. హరి సకలచరాచర దేహిఅని పెద్దలు చెప్పగా తెలుసుకొని కూడా

ఈ పూజలను నీ పాదాల దగ్గర దాచుకో. ఇది నీ కీర్తిరూప పుష్పాలయ్యా మమ్మల్ని రక్షించడానికి ఒక్క సంకీర్తనే చాలు. తక్కినవి భండాగారంలో దాగి వుండనీ. మహిమాన్వితమైన నీ నామానికి వెలలేదు. కానీ ఫలితం మాత్రం ఎక్కువ. నీవు దిక్కుగా ఉండి నన్ను కాపాడుతున్నావు. ఈ సంకీర్తనతే తరగని నీ ధనమయ్యా. నా నాలుకపై నుంచి రకరకాల సంకీర్తనల్ని ప్రయత్నించి నాచేత నిన్ను పొగిడించుకున్నావు వెయ్యినామాల స్వామి నిన్ను స్తుతించడానికి నేనెంతటి వాడిని, నీవు ఇష్టపడి నాకు ఈ పుణ్యాన్ని ఆపాదించావు అంతే, ఈమాట గర్వంకాదు. నీమహిమనే స్తుతించాను. కానీ నాకు నేనుగా స్వతంత్రించి చెప్పిన వాడినికాను. నియమంగా పాడేవాడిని నాలో తప్పులెంచకు. మాధవా! నేను నీదాసుణ్ణి. నువ్వు వేంకటేశ్వరుడవయ్యా అని అన్నమయ్య స్వామివారికి వినమ్రంగా విన్నవించుకున్నాడు.

## గుండక్రియ

దాఁచుకో నీ పాదాలకుఁ దీగ నేఁజేసిన పూజలివి
పూఁచి నీ కీరితి రూప పుష్పములవి యయ్యా॥

ఒక్క సంకీర్తనే చాలు వొద్దికై మమ్ము రక్షించఁగ
తక్కినవి భండారాన దాచివుండనీ
వెక్కసమగు నీనామము వెల సులభము ఫలమధికము
దిక్కై నన్నేలితివిఁక నవి తీరని నాధనమయ్యా॥

నా నాలికపై నుండి నానా సంకీర్తనలు
పూని నాచే నిన్నుఁ బొగడించితివి
వేనమాల వెన్నుండా వినుతించ నెంతవాఁడ
కానిమ్మని నాకీ పుణ్యము గట్టితి వింతేనయ్యా॥

యీ మాట గర్వముకాదు. నీ మహిమే కొనియాడితిఁగాని
చేముంచి నా స్వాతంత్ర్యమున చెప్పినవాఁడఁగాను
నేమాన బాడేవాడను నేరము లెంచకుమీ
శ్రీ మాధవా నే నీదాసుండ శ్రీవేంకటేశుండవయ్యా॥ (1-338)

అప్పుడు శ్రీవేంకటేశ్వరుడు అన్నమయ్యతో వాత్సల్యంగా 'ఆనాడు పతకమూరి భాగవతుల జోలపాట విని పసిబిడ్డనయ్యాను. కృష్ణమాచార్యుని అధ్యాత్మ స్తుతి విని కొన్నాళ్ళు విరక్తుడనయ్యాను ఇప్పుడు నీ శృంగార సంకీర్తనలు విని నవయువకుడనయ్యాను. అని అభినందించాడు.

'ఆడుచుఁ బతక మా కన్నులజోల
పాడగ నెఁడెల్ల బసిబిడ్డనైతి
నా కృష్ణమాచార్యు నధ్యాత్మ వినుతి
రాఁకఁగొన్నాళ్ళు విరక్తుండ నైతి
జగతి నీ శృంగార సంకీర్తనముల
తగపడి మంచి ప్రాయపువాఁడ నయితి'

(చిన్నన్న అ.చ పుట 42)

అప్పుడు అన్నమయ్య స్వామివారితో గోవిందా నిన్ను వేదాలు పొగడుతుండగా, పండితులు కీర్తిస్తుండగా, దేవతలు స్తుతిస్తుండగా, నేనెంతటి వాణ్ణి. పరిశీలించి చూస్తే పలుకుతున్న వీణలోని చక్కదనం పలికించే వానిదైనట్లు నానేర్పు నీ నేర్పే అని తన వినయ వివేకాల్ని విన్న వించుకున్నాడు.

'వేదముల్ పొగడఁ గోవిదులు నుతింప
నాదేవతలు కొనియాడ గోవింద
నేనిన్నుఁ గొనియాడ నెంతటివాఁడ
నానేర్పు నీనేర్పు పరసి చూచినను
పలికెడు వీణలో చక్కఁదనము
పలికించు నతనిదై పరగిన రీతి' (అ.చ. పుట 42)

ఈవిధంగా అన్నమయ్య అవతరించింది మొదలు శ్రీవేంకటేశ్వరునిలో లీనమయ్యే వరకు 95 సం॥లు శ్రీవేంకటేశ్వరుని ధ్యానంతోనే జీవించడం వల్ల ఈ పకృతిలోని ప్రతి చరాచరం అతనికి శ్రీవేంకటేశ్వరుడు గానే సాక్షాత్కరించింది. అన్నమయ్య తనఅధ్యాత్మ సంకీర్తనల్లోను శ్రీవేంకటేశ్వరుని బహువిధాలుగా అభివర్ణించారు.

ఇలాంటి పనులు చేయడం ఉచితమని తర్కించుకున్నాడు. చేతిలోని కొడవలిని వెంటనేపారేసాడు.

ఇలాంటివాళ్ళు నాకెక్కడి చుట్టాలు, వాళ్ళకు నేనెక్కడి బంధువును నన్ను వదలకుండా తల్లి, తండ్రి, గురువు దైవం సమస్త సంపదలుగా నాలో ఉండి అన్ని విధాలుగా నన్ను కాపాడే శేషశైలనాధుని సేవించి బ్రతుకుతాను. అని నిశ్చయించుకున్న శ్రీవేంకటేశ్వర సుస్థిర భక్తి సంపన్నుడు అన్నమయ్య

'— — — శ్రీహరి హరీయనుచు
నీ కొంత కొలంది నాదెఱింగిన వపనె
ఏకొంత పదంగాచు చీరొంతయనుచు
హరిచరాచవ దేహియుని పెద్దలనంగ
నిరవొంద నెఱింగియు నటుసేయందగునె
కొడవలి నెలగ్రక్కనం బాఱవైచె
నెన్నటి చుట్టంబు అటువంటి వార
లెన్నటి బంధుండ నేను వారలకు
నీ వట్టి వెట్టి నాకేల కావింప
భావింప నాలోనంబాయ కెల్లప్పుడు
తల్లియుం దండ్రియు దైవంబు గురువు
నెల్ల సంపదలునై యెల్ల చందముల
నన్ బ్రోచు శేషాద్రినాథుని గొలచి
మనియెద ననుచు నెమ్మది పాడు పఱచి (అ.చ)

సాళువ నరసింగరాయులు అన్నమయ్య పాడిన 'ఏమొకో చిగురుటధరమున' అనే సంకీర్తన విని తనమీద కూడా అలాంటి సంకీర్తన వ్రాయమని అన్నమయ్యను ఆదేశించాడు అపుడు అన్నమయ్య హరిహరి అని చెవులు మూసుకొని హరిని కీర్తించే నా నాలుక నిన్ను కీర్తించనేరదని ఇలాంటి నీచపుపలుకు ఎలా పలికావు అంటూ అతనికొంకను తిరస్కరించాడు. నువ్వువద్దు ఇలాంటి నీ పొందువద్దు అని శ్రీవేంకటేశ్వరుని సేవించడానికి వెళ్ళిపోతానన్నాడు.

'హరిముకుందుని గొనియాడునా జిహ్వ
నినుఁగొనియాడంగ నేరదెంతైన
నన్ను నెట్లు పలికితివి నైచ్యంపుఁ బలుకు
నాయచ్యుతునిఁ దక్కనన్యుల వినుతి
సేయుట నాకన్న చెలియలి వావి' (చి.అ చ పుట 37)

'నినునోల్ల నిటువంటి నీ పొందునొల్లం
'జనియెద శ్రీవేంకటేశ్వరుఁ గొల్వనేను' (చి.అ.చ పుట)

'నరహరి కీర్తన నానిన జిహ్వ
ఒరుల నుతింపగ నోపదు జిహ్వ'
(అన్నమాచార్య ఆధ్యాత్మిక సంకీర్తన)

ప్రభువైన తన కోరికను తిరస్కరించినందుకు సాళువ నరశింగ రాయలు కోపోద్రిక్తుడై కళ్ళల్లో నిప్పులుకురిపిస్తూ భటులచేత అన్నమయ్యకు మూరు రాయర గండ అనే సంకెల బిగింపవేసి చెరసాలలో పెట్టించాడు అప్పుడు అన్నమయ్య శ్రీవేంకటేశ్వరునే ధ్యానం చేసాడు. ఆకలిగా ఉన్నప్పుడు, అలసిపోయినప్పుడు, చంపడానికి పిలచినప్పుడు, సంకెలపెట్టి నప్పుడు, అప్పులవాళ్ళు నిలదీసినప్పుడు ఇలాంటి ఆపత్కాలాల్లో ఒక్క హరినామం తప్ప ఇంకేదీ దిక్కులేదని నిర్ణయించుకుని స్వామివారిని స్తుతించి విముక్తుడయ్యాడు.

'ఆఁకటి వేళల నలపైన వేళలను
తేఁకువ హరినామమే దిక్కు మరిలేదు॥

సంకెలఁ బెట్టినవేళ చంపఁ బిలిచిన వేళ
అంకిలిగా అప్పులు వారాఁగిన వేళ
వెంకటేశు నామమే విడిపించగతిగాక
మంకుబుద్ధిఁ బొరలిన మరిలేదు తెరఁగు'

(అ అ. సంకీర్తన)

అన్నమయ్య తన సంకీర్తనా యజ్ఞం పూర్తి అయిన తర్వాత శ్రీవేంకటేశునికి తన సంకీర్తనా సుమాలను అంకిత మిచ్చాడు. నేను చేసిన

# 1.2. అన్నమయ్య ఆధ్యాత్మ సంకీర్తనల్లో శ్రీ వేంకటేశ్వరుడు

అన్నమయ్య ఆధ్యాత్మక సంకీర్తనల్లో శ్రీవేంకటేశ్వరుని బహు విధాలుగా ఉల్లేఖించి వర్ణించాడు అన్నమయ్య అవతరించిందే శ్రీవేంకటేశ్వరుని నందకాంశం నుండి కాబట్టి ఆజన్మాంతం ఆ స్వామివారిని సర్వకాల సర్వావస్థల్లో త్రికరణ శుద్ధిగా కీర్తించాడు. అన్నమయ్యకు ఈ సృష్టిలోని ప్రతివస్తువు, ప్రతి భావన. శ్రీవేంకటేశ్వరునిగానే గోచరించింది అన్నమయ్య తన ఆధ్యాత్మ సంకీర్తనల్లో శ్రీవేంకటేశ్వరుని మంత్రము, కులదైవం, నిధానం, కాలమేఘం, పారిజాతం, చింతామణి, కామధేనువు, సిద్ధమంత్రం దివ్యౌషధం, ప్రాణబంధుడు, తల్లి తండ్రి చుట్టము, పాలము, మందు, పండు, సింహము, బేహరి (వ్యాపారి), ఎద్దు, ధనము, బోయనాయుడు భూతము అని బహు విధములుగా అత్మీయంగా అభివర్ణించాడు.

## మంత్రము

హిందువుల దేవతలు ముప్పైమూడు కోట్లమంది ఉన్నారని చెబుతుంటారు. అన్ని దైవాలకు ప్రత్యేకంగా ఒక్కొక్క మంత్రం ఉంటుంది. సకల దేవతల మంత్రాలు శ్రీవేంకటేశ్వర మంత్రంలో లీనమైఉన్నాయని అంతటి వేంకటేశుని మంత్రం తనకు వెన్నతోనే అబ్బిందని, వేంకటేశ్వర శబ్దమే ఒక మంత్రం వంటిదని అన్నమయ్య సూచించాడు. ఏ యే భక్తుడు ఏ యే మంత్రాన్ని ధ్యానించాడో ఇందులో పేర్కొన్నాడు

అన్ని మంత్రములు నిందే యావహించెను
వెన్నతో నాకుఁ గలిగే వేంకటేశు మంత్రము॥

నారదుడు జపియించె నారాయణ మంత్రము
కోరి విభీషణుడు చేకొనె రామమంత్రము
వేరేనాకు కలిగె వేంకటేశు మంత్రము॥

అలాగే 'పొడగంటి మయ్యా మిమ్ము పురుషోత్తమా' అనే సంకీర్తనలో ఓ పురుషోత్తమా! నిన్ను దర్శించానయ్యా. మమ్మల్ని ఎడబాయ వద్దయ్యా అని విన్నవించుకుంటూ ఇష్టపడి మమల్ని ఏలిన కులదైవం, నేర్పుతో పెద్దలిచ్చిన నిధానం, దప్పికతీర్చే కాలమేఘం, తమచేతికి వశమైన పారిజాతం, దృఢంగా లభించిన చింతామణి, ఇష్టపడి కోరికలిచ్చే కామధేనువు, చెడనీక బ్రతికించే సిద్ధమంత్రము, రోగాల్ని పోగొట్టే దివ్యౌషధం, తమను వదలకుండా తిరిగే ప్రాణబంధుడు అని బహుభంగులుగా వర్ణించాడు

## శంకరాభరణం

పొడగంటిమయ్యా మిమ్ము పురుషోత్తమా మమ్ము
నెడయకు వయ్యా కోనేటి రాయఁడా॥

కోరిమమ్ము నేలినట్టి కులదైవమా, చాల
నేరిచి పెద్దలిచ్చిన నిధానమా
గారవించి దప్పితీర్చు కాలమేఘమా మాకు
చేరువఁ జిత్తములోని శ్రీనివాసుఁడాఁ

భావింపఁ గైవసమైన పారిజాతమా మమ్ము
తావై రక్షించేటి ధరణీధరా॥

కావించి కోరికలిచ్చే కామధేనువా మమ్ము
తావై రక్షించేటి ధరణీధరా

చెడనీక బ్రతికించే సిద్ధమంత్రమా రోగా
లడచి రక్షించే దివ్యౌషదమా
బడిఁ బాయక తిరిగే ప్రాణబంధుఁడా మిమ్ము
గడియించినట్టి శ్రీవేంకటనాథుడా

తల్లి, దండ్రి, బంధువు, ప్రభువుగా సంసారులకు ఎన్నో కష్టాలు వస్తూంటాయి. ఎన్నో వేదనలకు గురి అవుతూంటారు. అలాంటి వారికి అన్నమయ్య అన్నిటికీ ఆతడే రక్ష అని ఉదార్పు చెబుతూ తల్లి, దండ్రి, ప్రభువు శ్రీవేంకటేశ్వరుడే అని తనను గురిగా పెట్టుకొని వృద్ధిచెందవ మని అన్నమయ్య సంసారులకు హితబోధచేసాడు.

## పొలము

'సర్వం విష్ణుమయం జగత్' అని ఆర్యోక్తి, అనాటి ఈ శ్రీహరే ఈనాటి శ్రీవేంకటేశ్వరుండు శ్రీవేంకటేశ్వరుడనే పొలాన్ని లోకులందరు పంచుకుని బ్రతుకుతున్నారని అన్నమయ్య వర్ణించాడు. ఇందులో ఒక్కొక్క పాదంలో ఒక్కొక్క అవతార సంఘటనను ధ్వనింప జేసారు.

## సామంతం

'తిమ్మిరెడ్డి మాకు నిచ్చె డిష్టమైన పొలము
బొమ్మిరెడ్డి కప్పగించి వాడిసేసెఁ బొలము' అనే సంకీర్తనలో

'నిండినట్టి మడుగుల నిదు వంకపొలము' అనే పాదంలో మత్స్యావతారం కొండలు మోచిన పెద్ద గొబ్బరపు పొలము' అనే పాదంలో కూర్మావతారం, 'అంతనె పొలము రాజులుండేటి పొలము' అనే పాదంలో వరాహావతారం, 'చెండివేసి మాకు లెల్లా సెలగిన పొలము' అనే పాదంలో నారసింహావతారం, 'ఆనపడి వరదాన మడిగిన పొలము' అనే పాదంలో వామనావతారం, బాసలతో కడునెత్రు "పట్టమైన పొలము"అనే పాదంలో పరశు రామావతారం. 'వాసికెక్కె మునులు రచ్చైన పొలము' అనె పాదంలో శ్రీరామావతారం, "వేసరక నాఁగేటి వేగిరైన పొలము" అనే పాదంలో బలరామావతారం 'మంచి గురుతైన రావిమాని చేసి పొలము' అనే పాదంలో బుద్ధావతారం, 'వంచెన గుఱ్ఱము తోలే వయ్యారి పొలము' అనే పాదంలో కల్కి అవతారం సూచించబడింది. అనాటి శ్రీహరే ఈనాటి శ్రీవేంకటేశ్వరుడు. శ్రీవేంకటేశ్వరుడనె పొలాన్ని లోకులందరూ పంచుకుని బ్రతుకుతున్నారని అన్నమయ్య వర్ణించాడు.

శ్రీవేంకటేశ్వరుడు శరణాగతుల పాలిట కోరినకోర్కెలు తీర్చే పారిజాత పుష్పమని, రాక్షసుల పాలిట భూతం వంటి వాడని, ఈ సృష్టికి ఆదిమూలం అని, తనను కొలిచేవారికి కొంగుబంగారం అని, కష్టాల్లో మునిగి పోయిన వానికి మొనవాడి అని, అన్నీ కలిగిన శ్రీవేంకటరాయుడనీ, భక్తులకు విధేయుడు. దాసాను దాసుడని అన్నమయ్య వర్ణించాడు.

జయమంగళము నీకు సర్వేశ్వరా
జయమంగళము నీకు జలజవాసినికి॥

శరణాగతా పారిజాతమా
పోరి నసురల పాలి భూతమా
అరుదైన సృష్టికి అదిమూలమా వో
హరి నమో పరమపుటాల వాలమా॥

కొలిచిన వారల కొంగుపైడి
ములిగిన వారికి మొనవాడి
కలిగిన శ్రీవేంకటరాయా
మలసి దాసులమైన మాకు విధేయా॥

ఈ కలియుగ వైకుంఠమే వెంకటాచలం శ్రీమహావిష్ణువే శ్రీవేంకటేశ్వరుడు. వేంకటాచలం పదివేల శేషుల పడగలమయుంగా భాసిస్తోంది. అది శ్రీహరికి నివాసం సమున్నత మయింది. బ్రహ్మాదిదేవతలకు అపురూపమయింది. సమస్త మునులకు, ఆకాశంలోని దేవతలకు నివాసమయింది అది ముంగిట్లోని మూలధనం వంటిది. మోక్షదాయకమయింది. శ్రీవేంకటేశ్వరునికి సిరులిచ్చేది. సమస్త సంపదలకు రూపం, పవిత్రానికే పవిత్రమయింది. అలాంటి ఆనందప్రదం, బంగారు శిఖరాలతో, అనేక బ్రహ్మలతో కూడిన ఆ వేంకటాచలాన్ని తిలకించి మ్రొక్కి ఆనందించండి. అని అన్నమయ్య భక్తిపారవశ్యంతో ఆడుతూ పాడుతూ లోకానికి ఆదేశించాడు.

అదివో అల్లదివో హరివాసము
పదివేల శేషుల పడగలమయము॥

అదె వేంకటాచల మఖిలోన్నతము
అదివో బ్రహ్మాదుల కపురూపము
అదివో నిత్యనివాస మఖిల మునులకు
అదెచూడు డదె మ్రొక్కు డానందమయము॥

చెంగట నల్లదివో శేషాచలము
నింగినున్న దేవతల నిజవాసము
ముంగిట నల్లదివో మూలనున్న ధనము
బంగారు శిఖరాల బహు బ్రహ్మమయము॥

కైవల్యపదము శ్రీవేంకటనగ మదివో
శ్రీవేంకటపతికి సిరులైనది
భావింప సకల సంపదరూప మదివో
పావనముల కెల్ల పావనమయము॥

నారాయణుడు అత్యంత ఆనందరూపుడు. సమస్త ప్రపంచానికి పోషకుడు. భూదేవియొక్క ఘనమైన పర్వతంవంటి వక్షస్థలాన్ని కౌగలించు కోవడం వల్ల వెలువడిన పరిమళ భరితమైన స్వేదజలంతో ఆనందిస్తున్న వాడు. లక్ష్మీదేవిచేత సరసమైన ప్రణామాలను అందుకొంటున్న పాదాలు కల్గినవాడు. దేవేంద్రుని కిరీటంలోని దివ్యరత్నాల కిరణాలచేత ప్రకాశించ బడుతున్న పాదపద్మాలు కల్గినవాడు. మోక్షకాంతకు భర్త అయిన శ్రీవేంకటాచలంలో వెలసిన నారాయణునికి నమస్కారంఅంటూ అన్నమయ్య అపురూపంగా, మధురభక్తిపూరితంగా వర్ణించాడు,

నమో నారాయణాయ
సమధికానందాయ సర్వేశ్వరాయ॥

ధరణీ సతీఘనస్తనశైల పరిరంభ
పరిమళ శ్రమజల ప్రమదాయ
సరసిజ నివాసినీ సరస ప్రణామయుత
చరణాయుతే నమో సకలాత్మకాయ॥

దేవతాధిప మకుట దివ్యరత్నాంశు సం
భావితామల పాదపంకజాయ
కైవల్యకామినీ కాంతాయుతే నమో
శ్రీవేంకటాచల శ్రీనివాసాయ॥

అన్నమయ్య శ్రీకృష్ణుని గోపికల అరచేతులకు మాణిక్యంవంటి వాడని, దుష్టుడైన కంసుని పాలిట వజ్రమని, ముల్లోకాలకు గరుడపచ్చ పూస, రతికేళిలోని రుక్మిణీదేవి రంగు పెదవికి పగడం, గోవర్ధన పర్వతా నికి గోమేధికం, శంఖచక్రాల మధ్య వైడూర్యం, కాళియ సర్పం తలపైన పుష్యరాగం, వేంకటాచలంపై వెలసిన ఇంద్రనీలం, పాలకడలిని వదలని

దివ్యరత్నం అని నవరత్నాలతో పోల్చి వర్ణించాడు. ఆ శ్రీకృష్ణుడే నేడు శ్రీ వేంకటేశ్వరుడై వెలసి మనకు దిక్కుగా నిలిచాడు అని తెలియజేశాడు గోపికల అరచేతులు ఎర్రగా ఉంటాయి కాబట్టి మాణిక్యంతో పోల్చడం, కంసుడు దుష్టుడు కాబట్టి వజ్రంతో పోల్చడం, రుక్మిణి పెదవి ఎర్రగా ఉంది కాబట్టి పగడంతో పోల్చడం, స్వామి నల్లనివాడు కాబట్టి ఇంద్రనీలం అనడం, సముద్రంలో రత్నాలుంటాయి కాబట్టి పాలజలనిధిని వదలని దివ్యరత్నం అనడం సముచితంగా ఉంది.

ముద్దుగారే యశోద ముంగిట ముత్యము వీడు
తిద్దరాని మహిమల దేవకీ సుతుడు॥

అంతనింత గొల్లెతల అరచేతి మాణిక్యము
పంతమాడే కంసుని పాలివజ్రము
కాంతుల మూడు లోకాల గరుడపచ్చపూస
చెంతల మాలోనున్న చిన్నికృష్ణుడు॥

రతికేళి రుక్మిణికి రంగుమోవి పగడము
మితిగోవర్ధనపు గోమేధికము
సతమై శంఖచక్రాల సందుల వైడూర్యము
గతియై మమ్ముఁగాచే కమలాక్షుడు॥

కాళింగుని తలలపైన గప్పిన పుష్యరాగము
ఏలేటి శ్రీవేంకటాద్రి ఇంద్రనీలము
పాలజలనిధిలోన పాయని దివ్యరత్నము
బాలునివలె తిరిగీ పద్మనాభుడు॥

## మందు

అన్నమయ్య శ్రీవేంకటేశ్వరుని 'మందుగా' అభివర్ణిస్తూ ఈ మందు ఎంతో ప్రీతికరమైందని, ఉండటానికి, బ్రతకడానికి ఇది ఒక్కటే మందు అని ధ్రువుడు, ప్రహ్లాదుడు, నారదుడు, జనకుడు, నాలుగు యుగాల రాజులు ఇంపుగా కొనిన చల్లనిమందు అని, పుట్టుక అనే రోగాలు వదలి

పోతాయని. పూర్వకాలంలోని పెద్దలు నిర్ణయించుకున్న నిశ్చలమైన మందు అని, బ్రహ్మకు పరమాయువైన మందు అని, సమస్తలోకాల్లో నిండినమందు అని. ముల్లోకాలు, తెలుసుకోవాలని, తెలుసుకొనేలా శ్రీవేంకటాచలం పై ధ్వజమెత్తి కోనేటి సమీపంలో ఉన్నమందు అని స్వామివారిని వర్ణించారు.

## శంకరాభరణం

కొనరో కొనిరో మీరు కూరిమి మందు
వునికి మనికి కెల్ల నొక్కటే మందు॥

ధ్రువుడు గొనిన మందు తొల్లియుఁ బ్రహ్లాదుడు
చవిగాఁ గొనిన మందు చల్లని మందు
భవరోగములు వీడి పారగ పెద్దలు మును
జవకట్టి కొనిన నిచ్చలమైన మందు॥

నిలిచి నారదుడు కొనిన మందు జనకుడు
గెలుపుతో కొని బ్రదికిన యా మందు
మొలచి నాలుగు యుగముల రాజులు ఘనులు
కలకాలము కాని కడగొన్నమందు॥

అజునకు పరమాయువై యొసగిన మందు
నిజమై లోకము లెల్ల నిండిన మందు
త్రిజగములు నెఱుగ తిరువెంకటాద్రిపై
ధ్వజమెత్తె కోనేటి దరినున్న మందు॥ (1–237)

అలాగే వేదపండితులు వెదికే మొదలు తుదిలేని మందు అని అందరూ అడవి మందులూ, కషాయాలు, రసాలు, తైలాలు కొంటూ వుంటే మాకు ఈ భూమిపై స్థిరమైన, ఆహ్లాదకరమైన, అతిశయమైన, మందు దొరికిందని చుట్టుకున్న జన్మరోగాలచే అందరూ కదలకుండా ఉండే శ్రీవేంకటాచలం మీద ఉన్న ఈ మందును తమ గురువు ఇచ్చాడని అన్నమయ్య పేర్కొన్నాడు.

## దేసాక్షి

వేదవేద్యులు వెదికేటి మందు
అదివంత్యము లేని ఆమందు॥

అడవి మందులుఁ గషాయములు నెల్లవారు
కడగానక కొనఁగాను
తొడిఁబడ నొక మందు దొరికె మాకు భువి
నడియాల మైనట్టి ఆమందు॥

లలిత రసములుఁ దైలములు నెల్లవారు
కలకాలము గొనఁగాను
చెలువైన దొకమందు చేరెమాకు భువి
నలవి మీరిన యట్టి యా మందు॥

కదిసిన జన్మరోగముల నెల్లవారు
కదల లేక వుండఁగాను
అదన శ్రీ తిరువేంకటాద్రి మీద మందు
అదివో మాగురుఁ విచ్చె నా మందు (1-2)

అన్నమయ్య మరో సంకీర్తనలో శ్రీ వేంకటేశ్వరుని ఔషధంగా కూడా అభివర్ణించాడు తమకు పనికిమాలిన మంత్రాలు వేర్లు అవసరం లేదని శ్రీవేంకటేశ్వరుడే భువనౌషధమని లోకానికి తెలియజేసాడు. హరి అచ్యుత అంటే పాపాలు అణిగిపోతాయి. నరసింహ అంటే స్థిరమైన దుఃఖాలు తొలగిపోతాయి, పురుషోత్తమా అంటే పుండ్లు బూచులు పోతాయి కృష్ణా అంటె భయంకరమైన రోగాలుపోతాయి. శ్రీ సతీశ అంటే చింతలన్నీ సమసిపోతాయి. మాధవా అంటే ఇహపర సౌఖ్యాలు కలుగుతాయి. గోవిందా అంటే సంపదలు సమకూరుతాయి దేవనారాయణ అంటే శరీరం సుఖంగా వుంటుంది. అని అన్నమయ్య లోకానికి తెలియజేసాడు. ఈ కీర్తనల్లో వేంకటేశ్వరుని భువనౌషధం, పరమౌషధం, సిద్ధౌషధం అని అభివర్ణించాడు

వెదమంత్ర మిఁక నేల వేరు వెల్లంకులు నేల
పుడమి ధరుఁడ మాకు భువనౌషధము॥

హరి యచ్యుతా యంటే నణఁగు బాపములు
నరసింహాయని యంటే నాఁటిన దుఃఖములు మాను
పురుషోత్తమా యంటేఁ బుండ్లు బూచులు మాను
పరమౌషధ మితఁడే పాటింప మాకు॥

వాసుదేవా యని యంటే వదలు బంధము లెల్లా
వాసికిఁ గృష్ణాయంటే వంతలు రోగాలు మాను
శ్రీ సతీశ యని యంటే చింతలన్నియును మాను
గాసిదీర నితఁడే పోఘున దివ్యౌషధము॥

గోవిందాయని యంటే కూడును సంపదలు
యీవల మాధవ నిహముఁ బరము చేరు
దేవనారాయణ యంటే దేహము సుఖమైయుండు
శ్రీ వేంకటేశుఁ డే మాకు సిద్ధౌషధము॥ (1-45)

## పండు

అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుని రకరకాల పండ్లుగా కూడా రమ్యంగా వర్ణించి వాటిని స్వామివారి స్వరూపస్వభావాలకు అవతార విశేషాలకు అన్వయించాడు. శ్రీ వేంకటేశ్వరుడనే దేవలోకపు పండు తినరానిదని, కొనరానిదని, మనసులో తలచుకుంటేనే ఆనందం కలిగించేపండు అని శ్రీహరి పాలసముద్రంలో శేషతల్పం మీద పవళిస్తాడు కాబట్టి పాలవెల్లిలో పండిన పాలపండు అని, శ్రీ కృష్ణావతారంలో గోపికలతో సరసల్లాపాలు చేసాడు కాబట్టి వారి పెదవులకు దొండపండు (ఎర్రటి పెదవిని దొండ పండుతో పోల్చడం కావ్యాల్లో కూడా కనిపిస్తుంది) అని, స్వామి వారి శరీరఛాయ నల్లగా ఉంటుంది కాబట్టి అల్లునేరేడుపండు అని, నరసింహావతారంలో గోళ్ళతో హిరణ్యకశిపుని చీల్చి సంహరించాడు, కాబట్టి సింహపు గోళ్ళ ముళ్ళపండు అని, సోమకాసురుడు వేదాల్ని ముచ్చిలించి సముద్రంలో పడవేసినప్పుడు శ్రీహరి మత్స్యావతారం దాల్చి కష్టపడి వేదాల్ని వెలికి తెచ్చాడు కాబట్టి వేదశాస్త్రాలు తెచ్చిన పేరీతపండు అని, దైత్యులను

సంహరించిన దేవదారుపండు అని, అతిశయించి మెరిసే గురువిందపండు అని, ఇష్టమైన వారి ఇంటి అరటిపండు అని, మునుల పాలిట తియ్యని చింతపండు అని, లక్ష్మీదేవిని వలపించే తేనెపండు అని, ప్రతి ఇంటికి ముంగిట పండు అని, పదహారు వేలమంది గోపికలకు గొప్ప మామిడిపండు అని అన్నమయ్య వర్ణించాడు.

తినరాని కొనరాని దేవలోకపు పండు
మనసున దలంచితే మరగించె పండు॥

పంటకెక్క పాలవెల్లి పండిన పాలపండు
తొంటి గొల్లెతల మోవి దొండపండు
అంటుకొన్న మేనిచాయ అల్లు నేరేడిపండు
ముంటి సింహపు గోళ్ళ ముళ్ళపండు॥
ఇచ్చల వేదశాస్త్రాలు దెచ్చిన పేరీతపండు
తచ్చిన దైత్యమారి దేవదారు పండు
పచ్చిదేర మెరిసిన బండి గురువింద పండు
యిచ్చవలెనన్న వారి ఇంటి నంటిపండు॥

తెమ్మగా మునుల పాలి తియ్యని చింతపండు
తెమ్మల సిరివలపు తేనెపండు
యిమ్ముల శ్రీ వేంకటాద్రి నింటింటి ముంగిటపండు
కొమ్మల పదారు వేల గొప్ప మామిడిపండు॥ (13-84)

## ధనము

అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుని ధనంగా కూడా వర్ణించి ఆధనం ప్రయోజనాల్ని మహిమల్ని వర్ణించాడు. ఐహికమైన ధనం చాలా చపలమైంది. ఈ ధనం కోరిన కోరికల్ని తీర్చదు. పైగా ఈ ధనంవల అనేక కష్టాలు, మానసిక వేదనలు కలుగుతుంటాయి. కానీ ఈ ధనం కోరిన కోరికల్ని తీర్చలేదు. కానీ శ్రీ వేంకటేశ్వరుడనే ధనం ఇష్టంతో కోరినవన్నీ ఇస్తుందని అచ్యుతనామమే అధికమైన ధనం అని ఈ ధనం నారదాది

మహర్షులు పొగడే నాలుక మీది దని, సారమైన వేదాల్లో చాటేదని, నారాయణ నామమే నమ్మకమైన ధనమని, పరమపదవి అయిన మోక్షానికి సంబళమైన (దారిభత్తెమైన) ధనం, భక్తులందరికీ ఇంటిధనం, అంతరంగంలో నాటినట్టి ధనం, హరి నామమిదె అరచేతి ధనం అని, సమయుంచూసి శివుడు కాశీనగరం, గంగానదీ తీరంలో మణికర్ణికా ఘట్టంలో చనిపోయే వారికి చెవిలో రామనామాన్ని రహస్యంగా ఉపదేశించి మోక్షానికి దారి చూపుతాడని ప్రసిద్ధి ఆచార్యుల మూలధనమని, శ్రీవేంకటేశ్వరుడు పరిపాలించే ధనం విష్ణునామమె శాశ్వతమైనధనం అని అన్నమయ్యా వర్ణించాడు.

ఇచ్చులో గోరేవల్లా ఇచ్చేధనము
అచ్యుత నామమె పో అధికపు ధనము॥

నారదాదులు వొగడే నాలుకపయి ధనము
సారపు వేదములలో చాటేధనము॥

కూరిమి మునులు దాఁచుకొన్నట్టి ధనము
నారాయణ నామమిదె నమ్మినట్టి ధనము
పరమపదవికి సంబళమైన ధనము
యిరవై భక్తులకెల్లా నింటిధనము॥

పొంచి శివుడు కాశిలో బోధించే ధనము
ముంచిన ఆచార్యుల మూలధనము॥

పంచి శ్రీవేంకటపతి పాలించే ధనము
నించి విష్ణునామమిదె నిత్యమైన ధనము॥

అలాగే 'అందరికీ సులభుడై' అనే కీర్తనలో 'దండివేదాంతములు వెదకేధనము' అని 'పొడగంటిమయ్యా' అనే సంకీర్తనలో 'నేడిచి పెద్దలిచ్చిన నిధానమా, అని శ్రీవేంకటేశ్వని అన్నమయ్య శాశ్వతమైన ధనంగా వర్ణించి స్తుతించాడు.

## బోయనాయుడు

అన్నమయ్య తన చుట్టూవున్న గ్రామాల్ని, నగరాల్ని సందర్శించి అక్కడ వెలసిన హరి అవతారమూర్తుల్ని కీర్తించాడు. ఆ దేవతామూర్తులను వివిధ వస్తువులతో, జీవరాశులతో పోల్చి అభివర్ణించాడు అలాగే కొండ ప్రాంతాల్ని అక్కడ వెలసిన చెంచులను, బోయాలను, వారి జీవనవిధానాన్ని గమనించాడు. హరితత్వాన్ని వారికి సులభంగా తెలియజేయడానికి ఆత్మీయంగా స్ఫురించడానికి శ్రీవేంకటేశ్వరుని బోయనాయుడుగా అభివర్ణించాడు వారివేషం, గుణాలుల్ని వర్ణించడం ద్వారా పరోక్షంగా శ్రీహరి అవతారాల్ని సూచించాడు. శ్రీవేంకటేశ్వరుడు పొడవైన శేషగిరి బోయనాయకుని (ఒక నాయకుడు నిర్ణీత ప్రాంతంలో ఒకజాతికి మాత్రం నాయకత్వం వహించ గలడు. కాని శ్రీవేంకటేశ్వరుడనే నాయకుడు సృష్టిలోని సమస్త జీవ రాసుల్ని నిరంతరం కాపాడుతున్నాడు) వర్ణించి ఒక్కొక్క పాదంలో ఒక్కొక్క అవతారాన్ని ధ్వనింపజేసాడు.

పొలసి మీసాలు (చేపమీది పొట్టువంటి మీసాలు కల్గిన పెద్ద బోయనాయుడు అనడంలో మత్స్యావతారం, వీపునకట్టే మంకు బోయనాయడు అనడంలో కూర్మావతారం, పొలము రాజై తిరిగే బోయనాయడు అనడంలో వరహావ తారం, మోటున నుండే బోయనాయడని అనడంలో వామనావతారం, పుట్టు పగసాధించే బోయనాయుడు అనడంలో పరశురామావతారం, బొట్టుల మెకము (జింక) నేసే బోయనాయుడు అనడంలో శ్రీరామావతారం, నెమలి చుంగబలు బోయనాయుడు అనడంలో కృష్ణావతారం, సిగ్గువగ్గు ఎరగని బోయనాయడు అనడంలో కల్కి అవతారం, రాలమీద దాటె మెంతు బోయనాయడు అనడంలో కల్కి అవతారం స్ఫురిస్తుంది ఈ సంకీర్తనలో పొలసిమీసాలు, నెమలి చెంగు అనేవి బోయనాయుకుని వేషాల్ని తెలియ జేస్తాయి మంకుతనం పగసాధించడం, మోటుగ ఉండటం సిగ్గువగ్గు ఎరగకపోవడం మొదలైనవి బోయనాయుకుని స్వభావాల్ని తెలియజేస్తాయి. పొలము రాజై తిరగడం అతని కర్తవ్యాన్ని తెలియజేస్తుంది వేట బోయ నాయుడు, బొట్టుల మెకమును వేయడం, రాలమీద దాటడం మొ దలైనవి బోయనాయని జీవనవృత్తిని తెలియజేస్తాయి వీటిని దశావతార సంఘటన

లతో సమన్వయించి శ్రీ వేంకటేశ్వరుని బోయనాయడుగా రమ్యంగా అన్నమయ్య వర్ణించాడు.

పాడవైన శేషగిరి బోయనాయడు
విడువకిందరి గాచు నెడబోయనాయడు

పాలసి మీసాల పెద్దబోయనాయడు
మలిగి వీపున గట్టేమంటు బోయనాయడు
పాలము రాజై తిరిగే బోయనాయడు
వెలయ మోటున నుండే వేట బోయనాయడు

పొట్టిపొట్టి యడుగుల బోయనాయడు యెందు
బుట్టు పగసాధించే బోయనాయడు
బొట్టుల మెకము నేసే బోయనాయడు
పట్టపు నెమలి చుంగు బలు బోయనాయడు

పొంచి సిగ్గిగెఱంగని బోయనాయడు
మించి రాలమీద దాటే మెండు బోయనాయడు
పంచఁగాల వేలముల బలు బోయనాయడు
అంచల శ్రీ వేంకటేశ్వరుడనే బోయనాయ॥ (1-460)

## భూతము

భూతాలు తెల్లగా వుంటాయిని మానవుల్ని కొందరిని ఆవరిస్తాయని లోకంలో ప్రసిద్ధి. కానీ వేంకటేశ్వరుడనే భూతం నల్లనిదని, ఆ భూతం భూమిలోని వారినందరినీ పట్టుతుందనీ (భగవంతుడు సమస్త జీవరాశుల్లో ఉంటాడని దీనిభావం) అన్నమయ్య వాస్తవాన్ని చమత్కరించి చెప్పాడు, ఈ భూతం యొక్క రూప స్వభావ చేష్టాదుల్ని వర్ణిస్తూ వాటిద్వారా శ్రీహరి దశావతార సంఘటనల్ని స్ఫురింపజేశాడు తినిసి వోడ మింగెడి భూతము అనడంలో మీనావతారం, పునకపీపు పెద్దభూతము అనడంలో కూర్మావతారం, కనలికవియు చీకటి భూతము అనడంలో వరాహావతారం. పొనుగు సోమపు మోము భూతము అనడంలో నరసింహావతారం, చేటకాళ్ళమించిన భూతము అనడంలో వామనావతారం, పోటుదారల పెద్దభూతము అనడంలో

పరశురామావతారం, గాటపుజడల బింకపు భూతము అనడంలో శ్రీరామావతారం, జూటరీనల్ల ముసుగుభూతము అనడంలో బలరామావతారం, ఖిత్తలే తిరిగేటి భూతము అనడంలో బుద్ధావతారం, పాలుపు దాంట్ల పెద్దభూతము అనడంలో కల్కి ఆవతారరం, పులుగుమీది మహాభూతము అనడంలో కృష్ణావతారం సూచించబడింది.

పొదమి నిందరిఁ బట్టె భూతము కడు
పొడవైన నల్లని భూతము

కినిసి వేదమింగెడి భూతము
పునుక వీపు పెద్దభూతము
కనలి కవియు చీకటి భూతము

పొనుగు సోమపు మోము భూతము

చేటకాళ్ళ మించిన భూతము
పోటు దారల పెద్ద భూతము
గాటపు జడల బింకపు భూతము
జూటరి నల్లముసుగు భూతము

కెలసి ఖిత్తలే తిరిగేటి భూతము
పాలుపు దాంట్ల పెద్దభూతము
బలుపు వేంకటగిరి పయి భూతము
పులుగు మీది మహ భూతము (1-109)

## నేత బేహారి

అన్నమయ్య శ్రీవేంకటేశ్వరుని నేత వ్యాపారిగా అభివర్ణిస్తూ సృష్టి అంశాలను నేతవృత్తిలోని అంశాలకు సమన్వయం చేసాడు. అన్నమయ్య కాలంలో నేత పనివారు చీరలు నేసి ఊరూరా వీధివీధిలో తిరుగుతూ అమ్మే వారు. ఈకీర్తనల్లో శ్రీవేంకటేశ్వరుడే వాతవాడల్లో నీతనుండి చీరలమ్ముతున్నాడని వర్ణించాడు, పృథ్వి ఆప్ తేజో వాయువాకాశాలు అనే పంచభుతాలనెడి రకరకాల రంగునూలును చంచలత్వం అనే గంజిపోసి చరిచేసి గుణాలు అనే కొంచెపు కండెల నూలునేసి మంచి చీరలమ్మే

మాతు బేహరి అని, మాయా మోహాలతో తన స్త్రీ పసిడి నీటిని ప్రణయ కోపంతో చిలికిస్తుంటే కుటిల చేష్టలను కుచ్చులుగా కట్టి చీరలమ్మే బేహరి అని, మచ్చిక కర్మమనే మైల సంతలో వెచ్చపు కర్మమనే ధనాన్ని వెలువ చేసి పచ్చడాలుగా కుట్టి ప్రీతిగా చీరలు అమ్మే ఇంటి బేహరి అని అన్నమయ్య మిక్కిలి చాతుర్యంగా వర్ణించాడు.

వాడలవాడు వెంట వాఁడివో వాఁడివో
నీడనుండి చీరలమ్మే నేత బేహరి॥

పంచభూతములనెడు పలువన్నె నూలు
చంచలపు గంజివోసి చరిచేసి
కొంచెపు కండెలనూలి గుణములు నేసి
మంచి మంచి చీరలమ్మే మారు బేహరి॥

మట మాయముల తన మగువ పసిఁడి నీరు
చిటిపొటి యలుకలఁ జిలికించఁగా
కుటిలంపుఁ జేతలు కుచ్చులుగాఁ గట్టి
పటవాళీ చీరలమ్మే బలు బేహరి॥

మచ్చిక కర్మమనేటి మైల సంతల లోన
వెచ్చపు కర్మధనము వెలువచేసి
పచ్చడాలుగా కుట్టి బలు వేంకటపతి
ఇచ్చ కొలదాల నమ్మే ఇంటి బేహరి॥

## ఎద్దు

అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుని 'ఎద్దు'గా కూడా వర్ణించి పూర్వ అవతారాల్లో స్వామివారు సాధించిన ఘనకార్యాలను పేర్కొన్నాడు. శ్రీ వేంకటేశ్వరుడు భూమినంతా తిరిగిన బోడెద్దు అని, అంత సులభంగా ఎవ్వరి దగ్గరికీ రాని ఎద్దు అని, భూమిని ఉద్ధరించిన బఁడెద్దులు అని, మంద లోని పసువుల్ని వెలుపలికి తోలి రోటికి కట్టివేయబడిన ఎద్దు అని, నాలుగు యుగాల్లోను అవతరించి ధర్మదేవతగా నిలిచిన ఎద్దు అని, భూదేవిని

ప్రేమతో ఆదరించిన గొప్ప వృషభాచలపు టెద్దు అని, వేదాలు కొలువగా లక్ష్మీదేవితో వెలసిన శ్రీవేంకటాద్రిని మించిన మాయలెద్దు అని అన్నమయ్య రమ్యంగా వర్ణించాడు.

పొలమెల్ల దిరిగిన బోడెద్దు
గరిమెలో (తో) నెవ్వరికి దగ్గరి రానియెద్దు॥

పురములు సాధించఁ బూనినప్పుడు భూమి
భరమెత్తి నిలిచిన బండెద్దు
పరివోని మండల పసులఁ బోదోలి శ్రీ
వరుడై రోలఁ గట్టుపడి నెద్దు॥

ఒడలెత్తి నాలుగు యుగములఁ బడి
బడిధర్మ దేవతై పరగినెద్దు
తడవి దేవరులను దామెరలను గట్టఁ
గడఁగి మానిని రూపుకలపెద్దు॥

గోవైన భూదేవి నూరిమిఁ జేకొని
లావైన వృషభాచలటపుటెద్దు
మోపఁగ వేదాలు మొలమై సిరితోడ
శ్రీవేంకటాద్రి మించిన మాయలెద్దూ॥

## సింహం

శ్రీహరి దశావతారాల్లో నరసింహవతారం ఒకటి ఈ అవతారంలో హిరణ్యకశిపుని చంపి ప్రహ్లాదుని రక్షించాడు. ఆనాటి నరసింహస్వామి ఈనాడు శ్రీవేంకటేశ్వరుసిగా అవతరించాడు. ఈ అంశాన్ని దృష్టిలో పెట్టుకొని అన్నమయ్య శ్రీవేంకటేశ్వరుని సింహంగా అభివర్ణించాడు పహ్లాదుని ఆపదనుంచి ఉద్ధరించిన సింహమని, లక్ష్మీదేవికి క్రీడా సింహమని. దేవతల భయాన్ని పోగొట్టే సింహమని, హిరణ్యకశిపుని సంహరించిన సింహమని విశ్వానికి ఏలికైన సింహమని, శరణాగతుల్ని రక్షించే సింహమని, ధీరుడై వేదాల్లో చరించే సింహమని, పాపాల్ని పోగొట్టే సింహమని, మూడుమూర్తు

లకు ఆధారమైన సింహమని, చెంచులతో తిరిగే అహోబిలంలోని నార సింహమని, శ్రీవేంకటాద్రికి ఆభరణమైన సింహమని, అన్నమయ్య పేర్కొన్నాడు.

## ధన్నాసి

వీడె వీడె కూచున్నాడు వేడుకతో గద్దెమీఁద
వాఁడి ప్రతాపము తోడి వరదాన సింహము॥

అరయ ప్రహ్లాదుని అపదోద్ధార సింహము
గిరిపై యుందిరకును క్రీడా సింహము
నిరతి సురల భయ నివారణ సింహము
పరి హిరణ్యకసిపు సంహార సింహము॥

ఇట్టె విశ్వమునకు నేలికైన సింహము
గట్టిగ శరణాగతులఁ గాచే సింహము
దిట్టయై వేదాలలోని తెరవేఁట సింహము
నెట్టుకొనిన దురిత నివారణ సింహము॥

అంచెల మూడుమూర్తుల కాధారమైన సింహము
పంచల మునుల భాగ్యఫల సింహము
పొంచి శ్రీవేంకటాద్రికి భూషణమైన సింహము
చెంచుల అహోబలపు శ్రీనారసింహము॥ (3-151)

## పాదము

అన్నమయ్య శ్రీవేంకటేశ్వరుని పరిపూర్ణ స్వరూపాన్ని, సృష్టిలోని చరచరాలతో పోల్చి వర్ణిస్తుంటాడు అలాగే స్వామివారి అవతార విశేషాలను మహిమలను పేర్కొంటాడు.

స్వామివారి పాదం బ్రహ్మకడిగిన పాదము అనియు (వామనావతారంలో ఒక అడుగుతో ఆకాశాన్ని ఆక్రమించినపుడు బ్రహ్మతన తండ్రి అయిన శ్రీహరి పాదాన్ని కడిగి పూజించాడు) బ్రహ్మతానె అయిన పాదమని కామిని కొలచిన పాదమని, బలితలపై మోపినపాదమని, అహల్య పాపాన్ని

ప్రక్షాళనం చేసిన పాదమని, కాళీయ సర్పంపై మోపిన పాదమని, ప్రేమతో లక్ష్మీదేవి పిసికే పాదమని, గరుత్మంతుని ఎక్కే పాదమని, భక్తులకు మోక్షా నిచ్చే పాదమని, శ్రీవేంకటాచలమే స్థిరమని చూపిన మహోన్నతమైన పాదమని ఈ సంకీర్తనలో అన్నమయ్య విశదీకరించాడు. ఈ సంకీర్తనలో అన్నమయ్య వామనావతారం, శ్రీరామావతారం, కృష్ణావతార సంఘటన లను సూచించాడు.

## ముఖారి

బ్రహ్మ కడిగిన పాదము
బ్రహ్మము తానె నీపాదము॥

చెలఁగిన వసుధ గొలిచిన నీ పాదము
బలితల మోపిన పాదము
తలకక గగనము తన్నిన పాదము
బలరిపుఁ గాచిన పాదము॥

కామిని పాపము కడిగిన పాదము
పాము తలనిడిన పాదము
ప్రేమపు శ్రీసతి పిసికెడి పాదము
పామిడి తురగపు పాదము॥

పరమయోగులకుఁ బరిపరి విధముల
వరమొసఁగెడి నీ పాదము
తిరు వేంకటగిరి తిరమని చూపిన
పరమ పదము నీ పాదము॥

## చేయి

అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుని దివ్యపాదాన్ని స్తుతించి వర్ణించి నట్లే ఆస్వామివారి అభయహస్తాన్ని కూడా ఆత్మీయంగా స్తుతించి వర్ణించాడు. స్వామిచేయి లోకజనులకు అభయాన్నిచ్చే చేయి, నెఱవైన మంచి బంగారుచేయి. (నేటికీ రాయల సీమలో 'మంచి బిడ్డ' అనడానికి

బంగారు కొండ అనడం పరిపాటి. ఆనాడు కూడా అన్నమయ్య ఇదే మాటవాడారు. శ్రీవేంకటేశ్వరుని చేయి భయాలు పోగొట్టి ధైర్యంచెప్పి ఉపకారాలు చేసే మంచిచేయి అని అన్నమయ్య తెలిపాడు, ఇంకా నీటిలో మునిగిన వేదాల్ని మీనావతారం దాల్చి వేతికితెచ్చిన చేయ అని, క్షీరసాగర మథనం సమయంలో మంథర పర్వతం మునిగిపోకుండా పట్టుకున్న చేయి అని మనోహరిఅయిన భూదేవిని కౌగలించుకున్న చేయి అని, దిట్టైన కొన గోళ్ళు కలిగిన పదునైన చేయి అని, బలిచక్రవర్తిని దానం అడిగిన చేయి అని, ప్రేమతో భూదానం చేసిన చేయిఅని, ఒక్క బాణంతో సముద్రాన్ని లోబరచుకొన్న చేయిఅని, నాగేటిని ధరించిన చేయిఅని, పురసతుల మానాలను పోగొట్టిన చేయిఅని, త్రిపురాదులను సంహరించడం శివునికి శక్యం కానపోవడానికి కారణం వారి భార్యల పాతివ్రత్యమని తెలుసుకొని, వారిని వ్యామోహితుల్ని చేసి భంగపరచిన చేయి అని, కల్కిరూపం దాల్చిన గుర్రాన్ని నడిపే గొప్పచేయి అని, శ్రీవెంకటాచలానికి అధిపతియై మోక్ష మార్గాన్ని తెలిపే చేయిఅని, వరుసగా మత్స్య, కూర్మ, వరహ, నారసింహ వామన, పరశురామ, శ్రీరామ, బలరామ, బుద్ధ, కల్కి అవతారాన్ని సూచించాడు.

## సామంతం

ఇందరికి నభయంబు లిచ్చుఁజేయి
కందువగు మంచి బంగారు చేయి॥

వెలలేసి వేదములు వెదకి తెచ్చిన చేయి
చిలుకు గుబ్బలికింద చేర్చు చేయి
కలికియగు భూకాంతఁగాగిలించిన చేయి
వలనైన కొనగోళ్ళ వాడిచేయి॥

తనివోక బలిచేత దానమడిగిన చేయి
వొనరంగ భూదాన మొసగుచేయి
మొనసి జలనిధి యమ్ముమొనకుఁ దెచ్చిన చేయి
యెనయ నాఁగేలు ధరియించు చేయి॥

పురసతుల మానములు పొల్లసేసిన చేయి
తురగంబుఁ బరపెడి దొడ్డచేయి
తిరు వేంకటాచలా ధీశుడై మోక్షంబు
తెరువు ప్రాణుల కెల్లఁ దెలిపెడి చేయి॥ (1-334)

అన్నమయ్య ఈ విధంగా ఆధ్యాత్మిక సంకీర్తనల్లో శ్రీవేంకటేశ్వరుని బహుముఖాలుగా వర్ణించి తనకున్న హరిభక్తిని నిరూపించుకున్నాడు. తద్వారా ప్రజలకు హరి భక్తిని పెంపొందించాడు.

**1-3 అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో శ్రీవేంకటేశ్వరుడు**

అన్నమయ్య అలమేల్మంగా శ్రీవేంకటేశ్వరుల ప్రణయలీలల్ని వర్ణించిన శృంగార సంకీర్తనల్లో శ్రీవేంకటేశ్వరుని ప్రియుడుగా, మందుగా, దొంగగా పెండ్లికొడుకుగా, మొదలైన రీతులుగా వర్ణించాడు.

## ప్రియుండు

అన్నమయ్య తనను ప్రేయసిగా శ్రీవేంకటేశ్వరుని ప్రియుడుగా భావించుకొని వర్ణించిన సంకీర్తనలు చాలా వున్నాయి.

శ్రీవేంకటేశ్వరుడు పూర్వం శ్రీకృష్ణుడుగా అవతరించాడు. శ్రీకృష్ణుడు చిలుకల తేరుపై ఉండి, చెఱకును విల్లుగా కలిగిన మన్మథునికీ తండ్రి అని, కాంతులు వదలని బంగారు వస్త్రంకట్టిన అందమైనవాడు అని తెల్లనిపక్షి అయిన గరుత్మంతునిపై తిరగడానికి అలవాటుపడిన వాడని, తెల్లనిసతి అయిన సరస్వతికి భర్త అయిన బ్రహ్మకు తండ్రిఅని, తెల్లని పరుపులాంటి ఆదిశేషునిపై పవళించువాడు అని, కొండను విల్లుగా చేసుకున్న శివునిపై ప్రియురాలైన గంగకు తండ్రిఅని, నన్ను కాపాడిన వాడైన కొండలరాయడు అయిన శ్రీవేంకటేశ్వరుడు ఎందుకు రావడంలేదో అని తన విరహవేదనను సాటివనితకు చెప్పుకోవడం ఎంతోరమ్యంగా అన్నమయ్య వర్ణించాడు

## కాంభోది

ఏలరాఁడమ్మ యింతిరో వాఁ
డేలరాఁడమ్మ నన్నేలిన వాడు॥

పచ్చని పులుగుల బండి మీదనుండి
పచ్చ వింటి పిన్నబాలుని తండ్రి
పచ్చని చాయలఁ బాయని బంగారు
పచ్చడము గట్టి (న) బాగైనవాఁడు॥

తెల్లని పులుగుపైఁ దిరుగు మరిగినట్టి
తెల్లని సతిపాలి దేవరతండ్రి
తెల్లని పరపుపైఁ దేలిపొరలు వెట్టు
తెల్లని కన్నుల తెలివైన వాఁడు॥

కొండవింటి వాని గుత్త గొనినయట్టి
కొండక పాయపుఁ గూతురు తండ్రి
కొండలరాయఁడు కోనేటి తిమ్మయ్య
కొండల తలనెత్తి గుఱుతైన వాఁడు॥ (12-253)

అలాగే 'మేడలెక్కి నిన్నుజూచి' అనేసంకీర్తనలో కూడా అన్నమయ్య తనను ప్రేయసిగా, శ్రీవేంకటేశ్వరుని ప్రియునిగా భావించుకొని అతనికోసం ఎదురుచూడటం, అతను రాగానే తన ప్రేమనంతటినీ వ్యక్తం చేసి అతని ఔదార్యాన్ని ప్రశంసించడం వర్ణించబడింది. నిన్ను చూడాలని నిన్ను కలుసుకోవాలని, మేడమీదకెక్కాను నీవు లేకపోయేసరికి నేను నిట్టూర్పులు విడిచి బాధపడ్డాను. వెంకటేశ! ఇంతసేపు ఎక్కడున్నావు? నీకు దాహంగా ఉందని కర్పూరం అందించాను. నీమీద విరహంతో ఉన్ననేను దాన్ని నిప్పు అనుకొని భ్రమించానురా నిండుగా పూచినచెట్టు మీద గండుకోయిల కూస్తే అది నీకంఠస్వరమనుకొని నిన్ను నాసమీపానికి రమ్మన్నానురా, బొండుమల్లి పాన్పుమీద పండుకొని నిన్నుగూర్చి పాడిపాడి పూర్తి జాగారాలున్నానురా వెంకటేశ వెన్నెలలు ఎండలుగా తోచాయిరా. (విరహవేదనలో ఉన్నవారికి చల్లనివెన్నెల, కర్పూరం మొదలైనవి వేడిగాతోస్తాయి) మల్లెపువ్వుకొన తాక గానే ఝల్లున పులకించి నామనసును నీకు ఒప్పంచానురా వెంకటేశ! ఇది అబద్ధంకాదు మమ్మేల్చికాపాడరా. పట్టుచీర కొంగుజారి నేనుగుట్టుగావుంటే నీవు వట్టిగా ఎందుకు నవ్వుతావురా వెంకటేశ! నువ్వు డిట్టమైనవాడివి నేను నీఅంతటి దాన్నికాను.

ఉన్నతమైన వెంకటేశ దయతో నన్ను కలిసావు నన్ను ఎంతగా మెచ్చుకుంటున్నావు వెంకటేశ! కన్నులపండుగయిందిరా నీకోసం వలచిన వలపులు నామనసులో పులకెత్తాయిరా, ఇదంతా లోకానికి తెలిసిందే ఈ ప్రాయాన్ని నీకొక్కడికే సమర్పించాను. ఎప్పుడూవదలకుండా మాఇంట్లోనే వుండరా. ప్రతిసారి కచ్చితంగా నీమాటలనే నమ్ముకొని ఉన్నదాన్ని చుట్టూ అలుముకున్న చీకట్లు (అజ్ఞానం) తొలగిపోయేలాగా వెంకటేశా! నాపై నీ కరుణను కుమ్మరించరా అని వేడుకొంటోంది.

## దేసాళం

మేడలెక్కి నిన్నుజూచి కూడె నాయాసతోడ
వాడుదేరి షున్నతందురా వెంకటేశ
యాడనుంటి విందాఁ కానురా॥

దప్పిగొంటి వనినీకు కప్పురము పొరమిచ్చి
ముప్పిరి నీ విరహనను వెంకటేశ
నిప్పనుచు భ్రమసితిరా॥

నిండఁ భూచిన మానిపై గండుకోవిల గూయఁగా
నిండిన నీ యెలుగంటామ వెంకటేశ
అందకు నిన్ను రమ్మంటిరా॥

బొండుమల్లె పానుపుపై నుండి నిన్ను పాడిపాడి
నిండు జాగరము లుంటిరా వెంకటేశ
ఎండలాయ వెన్నెలలురా॥

మల్లెపువ్వు కొనదానికి ఝల్లునను ఫలకించి
ఉల్లము నీ కొప్పించితిరా వెంకటేశ
కల్లగాదు మమ్ముఁ గావరా॥

పట్టుచీర కొంగుజారి గుట్టుతోనే నుండగాను
పట్టినవ్వుతేలా నవ్వేవు వెంకటేశ
దిట్టవు నీ యంతవారమా॥

ఉన్నతి శ్రీవేంకటేశ మన్నించి కూడితి విదే
నన్ను నింతమెచ్చు మెచ్చేవు వెంకటేశ
కన్నుల పండువాయేరా॥

నీకు వలచిన వలపు పులక లెత్తె నామది
వాకునసె జెప్పజాలరా వేంకటేశ
లోకమెల్లా నెరిగినదే॥

పాయము నీ కొక్కనికే చాయగా మీదెత్తితిని
యీా యెడకై వాలకుందను వేంకటేశ
మా ఇంటనే పాయకుండరా॥

మమ్మాటికి నీ బాపలే నమ్మి వున్నదాన నేను
ఉమ్మరించరా నీ కరుణ వెంకటేశ
చిమ్మి చీకటెల్లా బాయను॥ (13-223)

## మందు

అన్నమయ్య కొన్ని సంకీర్తనల్లో తానే నాయికగా మారి స్వామి కోసం పరితపించడం కనిపిస్తుంది. కొన్ని సంకీర్తనల్లో అలమేల్మంగను నాయికగా చిత్రించి ఆమె వెంకటేశ్వరుని కోసం తపిస్తున్నట్లు వర్ణించడం, అన్నమయ్య చెలికత్తె రూపంలో నాయికా నాయకులకు ప్రబోధంచేసి వారిని సమైక్య పరచడం కనిపిస్తుంది. నాయిక జీవితానికి నీవే మందు. ఇంపైన విభుడా ఆమెను స్వీకరించు, ఆహ్లాదం కలిగించు అని చెబుతాడు. నాయిక విరహవేదన అనే జబ్బుకు శ్రీవేంకటేశ్వరుడే మందు అని అన్నమయ్య వర్ణించాడు.

నెలత జీవనానకు నీవేమందు
చెలిమోహపు విభుడ చేకొనవయ్యా (22-145)

అన్నమయ్యకు తన ప్రియదైవమైన శ్రీహరియే సర్వస్వం ఆస్వామిని వదలి ఆయన ఒక్కక్షణమైనా ఉండలేడు. అన్నమయ్య తన విరహవేదనను స్త్రీ రూపంలో ఇరుగు పొరుగు వారికి వ్యక్తంచేసుకుంటున్నాడు పద్మపత్రాలవంటి కన్నులు కలిగిన వానిని వదలి స్థిమితంగా ఉండలేను.

సుందరుడైన హరినితలచి నేనుకన్నీటిని ఆపుకోలేకపోతున్నాను. అనుకూలుడైన శ్రీవేంకటేశ్వరుని వదలి నేను స్త్రీగా జన్మించలేను అని అన్నమయ్య స్త్రీ భావనతో సాటి అక్కలకు, యువతులకు నివేదించుకోవడం.

## కాంభోది

తమ్ములాల అన్నలాల తల్లులాలనే
నెమ్మనపు హరిఁ బాసి నిలువలే నికను॥

కొమ్మలాల మరుకోట కొమ్మలాల వో
యమ్మలాల తొలరె నాయక్కలాల
తమ్మిరేకుఁ గన్నుల యాతనిఁ బాసినే
నుమ్మల సొమ్ముల చేతనుండ లేనికను॥

బోటులాల జవ్వనపు మేటులాల వో
గాఁటపు తురుముల చీకటులాల
వాటమైన వెంకటేశ్వరుఁ బాసినీ
నాఁటదానవై జన్మమంద లేనిఁకను॥ (12–99)

## దొంగ

అన్నమయ్యకు శ్రీవేంకటేశ్వరునితో సన్నిహిత సంబంధం ఉంది అందువల్ల భావనతో అనేక విధాలుగా ఎంతో చనువుగా వర్ణిస్తుంటాడు. లోకవ్యవహారంలో దొంగ అనేమాటను దొంగతనం చేసిన వారినేకాక ప్రియమైన వారిని సంబోధించడానికి కూడా వాడుతుంటాము. ఆవిధంగానే అన్నమయ్య శ్రీవేంకటేశ్వరుని కోవిదుడైన దొంగ అని, గుర్తుతెలిసిన దొంగఅని, గురిలోనే తలపులోనే దాగివుంటాడని వర్ణించాడు.

గురుతెఱిగిన దొంగ కూ గూ గు వీడె
గుఱిలోనే దాగీని కూ గూ గు

## పెండ్లికొడుకు

శ్రీవేంకటేశ్వరుడు నిత్యకల్యాణమూర్తి అన్నమయ్య స్వామివారిని పెండ్లికొడుకుగా అభివర్ణిస్తూ, ఈ పెండ్లికొడుకు ఎంతటిఘనుడో పేర్కొన్నాడు

సమస్త జనులకు పెట్టనికోట. రాక్షసులను సంహరించినవాడు, భూమిని ఉద్ధరించినవాడు. (వరాహావతారం దాల్చినప్పుడు), పిల్లనగ్రోవి రాగాలు పలికించేవాడు అతిక్రమిస్తే కోపగించేవాడు (పరశురాముడు), పెంచకనే అప్పటి కప్పుడే పెరిగినవాడు (వామనమూర్తి), నెమలిపింఛాన్ని తలపాగగా ధరించినవాడు. పాలు పెరుగుల దొంగ, స్త్రీపురుషులను కూర్చిన పెండ్లి కొడుకు, సాటిలేని వేంకటాచలంపై స్థిరమైనవాడు అని అన్నమయ్య దివ్యంగా వర్ణించాడు.

పెట్టని కోటిందరికి పెండ్లికొడుకు బొమ్మఁ
బెట్టిన సురలకెల్ల పెండ్లికొడుకు॥
పెల్లగించి భూమెత్తి పెండ్లికొడుకు వాఁడె
పిల్లగోవి రాగాల పెండ్లికొడుకు
పెల్లైన యావుల పెండ్లికొడుకు వాడె
పిల్లదీపు పెన్బుద్ధి పెండ్లికొడుకు॥
పెంచెపు శిరసుపాగ పెండ్లికొడుకు గుం
పెంచకప్పుడే పెరిగి పెండ్లికొడుకు వల
పించె చక్కనిసిరి పెండ్లికొడుకు॥
పెంట పెరుగుల దొంగ పెండ్లికొడుకు భూమి
పెంటి పోతుల కూరిచె పెండ్లికొడుకు
గెంటులేని వేంకటగిరి మీఁదను వాఁడె
పెంటపెట్టుకున్నవాడు పెండ్లికొడుకు॥ (12-186)

అన్నమయ్య ఈవిధంగా శృంగార సంకీర్తనలో శ్రీవేంకటేశ్వరుని ప్రియుడుగా, మందుగా, దొంగగా, పెండ్లికొడుకుగా ఇలా అనేక విధాలుగా వర్ణించాడు. అన్నమయ్య సంకీర్తనల్ని నిండుమనసుతో, చిత్తశుద్ధితో, తదేకదీక్షతో శోధించే కొలదీ ఎన్నో విశేషాలు కనిపిస్తాయి. అన్ని విశేషాల్లోనూ శ్రీవేంకటేశ్వరుడే మనకు సాక్షాత్కరిస్తాడు.

'దక్షిణ భారతీయ భాషల్లో వేంకటేశ్వర వాఙ్మయం'
జాతీయ సదస్సు మార్చి 2000
శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం
తెలుగు అధ్యయనశాఖ, తిరుపతి

# అన్నమయ్య సంకీర్తనల్లో సాహితీ విశేషాలు

తిరుమల తిరుపతి దేవస్థానం అన్నమాచార్య ప్రాజెక్టు అపార కృషివల్ల శ్రద్ధాశక్తులవల్ల నేడు అన్నమాచార్య సకీర్తనలు రాష్ట్రవ్యాప్తంగా దేశవ్యాప్తంగా, ప్రపంచవ్యాప్తంగా ప్రసిద్ధికెక్కాయి. వారు విడుదల చేసే క్యాసెట్లు, నిర్వహించే అన్నమయ్య జయంతులు, వర్ధంతులు, సంగీత సాహిత్య సభలు, సదస్సులు, ముద్రించే గ్రంథాలు ప్రజల్ని ఎంతో ప్రభావితం చేస్తున్నాయి. తిరుమల తిరుపతి దేవస్థానం వారేకాక ప్రభుత్వ ప్రభుత్వేతర సంగీత నృత్య కళాశాలలవారు, ఇతర సాంస్కృతిక సంస్థల వారు, వివిధ విశ్వవిద్యాలయాలవారు కూడా అన్నమాచార్య సంకీర్తనలను అందులోని సాహితీ విశేషాలను వెల్లడిచేయడంలో ఎంతో కృషిచేస్తున్నాయి. పద కవితా పితామహుడైన అన్నమయ్య కీర్తనలు మానవ జీవితాన్ని ఐహికంగా, ఆధ్యాత్మికంగా చక్కదిద్దే మహత్తరమైన సాధనాలు. దివ్య మంత్రాలు.

## అన్నమాచార్య సంకీర్తనలపై వెలువడిన వివిధపరిశోధనలు

అన్నమాచార్య సంకీర్తనలకు మొట్టమొదటిగా విశ్వవిద్యాలయ స్థాయిలో ఐచ్ఛిక పాఠ్యాంశ బోధన అవకాశాన్ని కల్గించి శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం. ఆతరువాత్వ దేశంలోని వివిధ విశ్వవిద్యాలయాలు గుర్తించి పరిశోధనలు ప్రారంభించాయి, వివిధ విశ్వవిద్యాలయాల్లో జరిగిన పరిశోధ నాంశాలు, పరిశోధకులు, పర్యవేక్షకులు, సంవత్సరాలు, విశ్వవిద్యాల యాలు మొదలైన వివరాలను పొందుపరచడం జరిగింది.

# అన్నమాచార్య సంకీర్తనలపై వెలువడిన పిహెచ్.డి. పరిశోధనాంశాలు

తాళ్ళపాక కవుల సాహిత్యంపై తొలిసారిగా ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారు – తాళ్ళపాక కవుల కృతులు – వివిధ సాహితీ ప్రక్రియలు, తాళ్ళపాక కవుల పదకవితలు – భాషాప్రయోగ విశేషాలు అనే పరిశోధనా గ్రంథాల్ని రచించారు. ఈ గ్రంథాలే భావి పరిశోధకులకు మార్గదర్శకమయ్యాయి.

| పరిశోధనాంశం : | పరిశోధకుడు : | పర్యవేక్షకులు : | సం॥ : | వి వి. |
|---|---|---|---|---|
| అన్నమాచార్య పదకవితల్లో అలంకారాలు | కె. వాణి | కె. సర్వోత్తమరావు | 1982 | శ్రీవేం.వి వి. |
| అన్నమాచార్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు | పి లీలావతి | కె సర్వోత్తమరావు | 1984 | శ్రీవేం వి.వి. |
| అన్నమయ్య సంకీర్తనల్లో ఉత్సవ విశేషాలు | సి. గోవిందరాజులు | కె సర్వోత్తమరావు | 1985 | శ్రీవేం వి.వి |
| పదకవితా పితామహుని సంకీర్తనల్లో శృంగారం | జి. రమేష్‌కుమార్ | టి కోటేశ్వరరావు | 1984 | శ్రీ.కృవి.వి |
| అన్నమాచార్య శృంగార సంకీర్తనల్లో సాహిత్య దృక్పథం | ఎస్. ఎస్. మోహన్‌నాయుడు | ఎల్.బి. శంకర్రావు | 1986 | మ.వి.వి |
| అన్నమయ్య సాహిత్యంలో స్త్రీ | ఎస్. సుగుణ | ఎ. రాజేశ్వరశర్మ | 1990 | ఉ.వి వి |

అన్నమయ్య
సంకీర్తనల్లో స్త్రీ జి ఉషారాణి సి గోవిందరాజులు 1995 శ్రీవేం వి.వి

అన్నమయ్య ఆళ్వారుల
తులనాత్మక జె మునిరత్నం జాస్తి సత్యనారాయణ 1986 శ్రీవేం.వి.వి
పరిశీలన

అన్నమాచార్య సంకీర్తల్లో
తెలుగునాడు డి. శివప్ప కె. సర్వోత్తమరావు 1988 శ్రీవేం.వి వి

పరిశోధనాంశం : పరిశోధకుడు : పర్యవేక్షకులు : సంవత్సరం వి.వి

తాళ్ళపాక సాహిత్యంలో
కవిసమయాలు జి. ఉమాదేవి కె సర్వోత్తమరావు 1989 శ్రీవేం వి.వి

తాళ్ళపాక సాహిత్యంలో జి సీతారామమ్మ 1989 శ్రీవేం వి.వి
సమకాలీన సాంఘిక జీవనం

అన్నమయ్య సంకీర్తనలు
నాయిక నాయకత్వం వి పార్వతిదేవి 1990 శ్రీవేం.వి.వి

తాళ్ళపాక అన్నమయ్య వైదుష్యం
ఒకపరిశీలన ఎ ఇంద్రాణి కె సర్వోత్తమరావు 1991 శ్రీవేం వి.వి

ఆంధ్ర వాగ్గేయ కారుల రచనలపై
అన్నమయ్య సీతాలక్ష్మి జె. మునిరత్నం 1996 శ్రీవేం వి.వి
సాహిత్య ప్రభావం

అన్నమయ్య యక్షగాన సంప్రదాయం ఎ గోపాలకృష్ణ 1986 ఆం.వి వి

తాళ్ళపాక కవుల లఘుకృతులు
సవిమర్శక పరిశీలన డి. శ్రవణకుమార్ సి. రమణయ్య పొ.శ్రీ తె.వి వి

అన్నమాచార్య సంకీర్తనలలో
వర్ణనలు జి. సాంభశివరావు ఎస్ గంగప్ప 1985 నా.వి.వి.

అన్నమాచార్యుల కృతుల్లో
భాషా విశ్లేషణ ఎం. మోహన్ ఎస్. అక్కిరెడ్డి 1986 మ వి వి

అన్నమాచార్యుని సంకీర్తనలు
సమాసము బి. దివాకర్ డి. చిన్నికృష్ణయ్య 1986 మ.వి.వి

అన్నమయ్య సంకీర్తనల్లో
గ్రామీణ జీవితం బి శ్రీరాములు కె సర్వోత్తమరావు 1993 శ్రీవేం.వి.వి

అన్నమయ్య అన్యదేశ్యాలు
తద్ధితాలు ఎన్. విజయలక్ష్మి జి రాధాకృష్ణ 1994 శ్రీవేం వి వి

పురందరదాస అన్నమాచార్య
కీర్తనలు అక్కమహాదేవి ఆర్.వి యస్. సుందరం 1987 మై.వి.వి
సాంస్కృతిక అధ్యయనం

అన్నమయ్య పురందర దాసుల ఆధ్యాత్మిక
సంకీర్తనలు ఎన్. రమాదేవి జాస్తి సూర్యనారాయణ 1992 శ్రీవేం.వి వి
తులనాత్మక పరిశీలన

అన్నమయ్య సంకీర్తనలు
బాలసాహిత్యం ఎస్. రవిచంద్రబాబు 1993 శ్రీవేం.వి.వి

అన్నమాచార్య శృంగార సంకీర్తనల్లో
మధురభక్తి వై రెడ్డిశ్యామల సి ఆనందరామం 1992 హైవి.వి,

అన్నమయ్య సంగీతధోరణులు
అన్నమయ్య టి. శ్రీనివాస్ యస్. అక్కిరెడ్డి 1994 మ.వి వి
శృంగార సంకీర్తనల్లో

రసవృత్తి వాక్యలయ
పి యల్ యన్, ప్రసాద్ జి. వెంకటరత్నం 1990 కా.వి వి

అన్నమయ్య సంకీర్తనలలో సామెతలు
సాహితీ వైచిత్రి ఆర్.వి శివప్రసాద్ పి. లీలావతి 1999 పొ.శ్రీతె వి వి

తాళ్ళపాక కవుల సంకీర్తనల్లో బాలగేయాలు
పరిశీలన బి. గోవిందనాయుడు పి. లీలావతి 1999 పొ శ్రీతె వి.వి

## వ్యక్తిగత పరిశోధనలు

విశ్వవిద్యాలయాల్లో ఎం.ఫిల్. పిహెచ్ డి డిగ్రీలకోసం జరిగిన ఈ పరిశోధనలేకాక వ్యక్తిగతంగా కూడా అన్నమయ్య సంకీర్తనలపై అనేక పరిశోధనా గ్రంథాలు వెలువడ్డాయి. ఆంధ్ర వాగ్గేయకార చరిత్రను కళా ప్రపూర్ణ శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు రచించారు అన్నమయ్య సంకీర్తనా సౌరభం, అన్నమాచార్యులు, ప్రముఖ వాగ్గేయకారులు మొదలైన గ్రంథాలను ఆచార్య ఎస్. గంగప్పగారు. అన్నమయ్య హనుమంత్సం కీర్తనలు, అన్నమయ్య, త్యాగయ్య, అన్నమయ్య–పురందరదాసు మొద లైన గ్రంథాలను, అన్నమయ్య అంతరంగంలో అలమేల్మంగ అనే గ్రంథాన్ని డా॥ కె వాణిగారు, పదకవితా వైజయంతి, అన్నమయ్య శృంగార సంకీర్త నాల్లో స్త్రీధర్మాలు, సంకీర్తనా జ్యోతి, కీర్తనాకౌముది, అన్నమయ్య అమృత వాణి మొదలైన గ్రంథాలను నేను రచించడం జరిగింది. ఇంకా ఎందరో అన్నమాచార్య సంకీర్తనలపై పరిశోధనా గ్రంథాలను రచించి ఉండవచ్చు

## అన్నమయ్య సంకీర్తనల్లో వచ్చిన ఎం.ఫిల్. పరిశోధనలు

పరిశోధనాంశం, పరిశోధకుడు, పర్యవేక్షకులు! సం॥ వి వి

అన్నమాచార్య బాలకృష్ణ
సంకీర్తలు ఎం. శ్రీహరి కె. సర్వోత్తమరావు 1981 శ్రీవేం.వి వి

అన్నమాచార్యుల స్త్రీ
సంబంధిత పాటలు ఎన్. సుగుణ కె గోపాలకృష్ణ 1984 ఉ.వి వి

అన్నమయ్య సంకీర్తనల్లో
కవిసమయాలు జి. ఉమాదేవి కె సర్వోత్తమరావు 1986 శ్రీవేం.వి.వి

తాళ్ళపాక కవుల సంకీర్తనల్లో
గ్రామీణ వృత్తులు ఎ. వెంకటప్పయ్య సి రమణయ్య 1995 పొ శ్రీతె.వి వి

అన్నమయ్య ఆధ్యాత్మిక సంకీర్తనల్లో
ఆత్మనివేదన వి. విజయవల్లి పి. లీలావతి 1998 పొ శ్రీ తె.వి,వి

అన్నమయ్య ఆధ్యాత్మిక సంకీర్తనలు
ఒక పరిశీలన కె. అబ్బులు సి. రమణయ్య 1994 పొ.శ్రీ.తె వి.వి

అన్నమయ్య సంవాద సంకీర్తనలు ఒకపరిశీలను
యల్.వి.యన్-యస్. మహలక్ష్మి పి. లీలావతి 1993 పొ శ్రీ తె.వి వి

అన్నమాచార్యుల ఆధ్యాత్మిక సంకీర్తనల్లో
తాత్విక గేయాలు డి. పద్మావతి పి లీలావతి 1994 పొ శ్రీ తె వి.వి

అన్నమయ్య సంకీర్తనల్లో సామెతలు
సమన్వయం ఆర్. వి, శివప్రసాద్ పి. లీలావతి 1994 పొ శ్రీ తె.వి.వి

## అన్నమయ్య సంకీర్తనలు విశ్లేషణ

అన్నమయ్య శ్రీవేంకటేశ్వరస్వామివారి అనుగ్రహంతో స్వామి వారి నందకావతారంలో అవతరించి శ్రీవేంకశ్వర ముద్రాంకితమునే 32 వేల సంకీర్తనలను రచించాడు వీటిని ఆధ్యాత్మ సంకీర్తనలు, శృంగార సంకీర్త నలు అని అన్నమయ్య విభజించి రచించాడు. ప్రస్తుతం ఇవి పదిహేను వేలు వరకు లభిస్తున్నాయి. ఆధ్యాత్మిక సంకీర్తనలు సుమారు 2 వేలు శృంగార సంకిర్తనలు సుమారు 13 వేలు ఉన్నాయి వీటిని తిరుమల తిరుపతి దేవస్థానంవారు ముద్రించారు

ఆధ్యాత్మిక సంకీర్తనల్లో హరిభక్తి ప్రబోధం, జ్ఞానప్రబోధం, మానవత్వ ప్రబోధం దురాచార ఖండన, హరిఅవతార వర్ణనలు, ఆత్మప్రబోధం అన్నమయ్య వినయశీలం, మొదలైన అంశాలు వ్యక్తమవుతాయి. శృంగార సంకీర్తనల్లో మధురభక్తి ప్రతిపాదించబడింది ఈ శృంగార సంకీర్తనల్లో నాయికా నాయకులు అలమేల్మంగా శ్రీవేంకటేశ్వరులు. అన్నమయ్య

శృంగార సంకీర్తనల్లో ప్రేయసీప్రియ సౌందర్యవర్ణన, ప్రేయసీప్రియుల ప్రేమవర్ణన, విరహవేదన, ప్రణయకలహం, చెలికత్తెల సందేశం, సుప్రసిద్ధ జానపద బాణీలు మొదలైన అంశాలు వ్యక్తమవుతాయి.

తల్లి దండ్రీ నీతఁడే తగజుట్టు మీతఁడే
ఎల్లగాఁ బుట్టించి పెంచే యేలికితఁడే
చల్లగా శ్రీవేంకటేశు శరణంటి మిదేమేము
కొల్లగా మీరెల్లా మమ్ముగురిగా వర్ధిల్లరో॥

అన్నమాచార్యుల వారి కుటుంబం అంతా శ్రీవేంకటేశ్వరుని గురిగా పెట్టుకొని విరాజిల్లారు. ఆ విషయాన్ని అన్నమయ్య విచారిస్తున్న సంసారులకు తెలియజేసాడు. భవరోగ వైద్యుడైన శ్రీహరి పాదాలను సేవించి ఈ భూమిపై ఉత్పన్నమవుతున్న రోగాలన్నింటిని పోగొట్టుకోమని, పది దిక్కులూ నిండిఉన్న అద్రైవాన్ని నమ్ముకొని కీర్తించి ఆదైవాన్నే దిక్కుగా కలిగి బ్రతకండి అని, తల్లి దండ్రి, బంధు, అందరినీ పుట్టించి పోషించే ప్రభువు ఇతడేనని, తమలాగ శ్రీవేంకటేశ్వరుని శరణావేడి అదైవాన్నే గురిగ పెట్టుకొని వృద్ధిచెందమని అన్నమయ్య హరిభక్తిని ప్రబోధించాడు.

"వైద్యో నారాయణో హరి :" అనే ఆర్యోక్తి లోక ప్రసిద్ధమయింది. ఆరోగ్య ప్రదాత అలున వైద్యుని భూలోక నారాయణునిగా చెబుతుంటారు. శారీరక మానసిక రోగాలను వైద్యులు పోగొట్టగలరు కానీ భవబంధాలనే రోగాలను భగవంతుడొక్కడే పోగొట్టగలడు. అందువల్ల శ్రీహరిని భవరోగ వైద్యుడు అని పేర్కొనడం విశేషంగా చెప్పవచ్చు. మానవులు అశాశ్వతమైన ఐహికవాంఛల కోసమే తన సమయాన్ని, శక్తినంతా ధారపోస్తూంటారు కష్టాలు సమస్యలు ఎదురైనప్పుడు ఎంతో దు:ఖిస్తుంటారు, అలాంటి వారి నుద్దేశించి అన్నమయ్య—

ఓ మానవులారా! మీరు తినే రకరకాల రుచులమీద ఆసక్తిని వదులుకోండి ఈశరీరం, ఈసంపద అశాశ్వతమయింది కాలమంతా ఆహార ఐశ్వర్యాది సంపాదనకోసమే వ్యర్థమైపోతుంది. మీ మనస్సుల్లో మాయా

మర్మాలను పోగొట్టుకోండి. కోరికల్ని తృణీకరించండి. కాలం మిమ్మల్ని భ్రమింపచేస్తుంది. కాబట్టి శ్రీహరిని ప్రేమతో స్తుతించండి. అప్పుడే నిరంతరం మీకు శుభాలు జరుగుతాయి. అని ప్రబోధం చేసాడు.

అలరినుతించరో హరిని
యలయించి మిము భ్రమియించని కాలము

## అన్నమయ్య ఆధ్యాత్మ సంకీర్తనల్లో హరిభక్తి ప్రబోధం :

అన్నమయ్య సంకీర్తనలన్నీ హరిభక్తిని నిరూపించేవే అయిన కొన్ని సంకీర్తనల్లో ప్రత్యక్షంగా హరిభక్తిని బోధిస్తున్నట్లు కనిపిస్తుంది. అలాంటి సంకీర్తనల్ని ఇక్కడ పేర్కొని వివరించడం జరుగుతుంది.

సంసారులు ఎన్నోరకాల బాధలు పడుతుంటారు. సంపదవుంటే సంతానం లేక, సంతానంవుంటే సంపదలేక, అన్నీవుంటే ఆరోగ్యం లేక ఆరోగ్యంవుంటే సంతృప్తి లేక, రకరకాల కోరికలు తీరక, సమైక్యత, సద్భావన, సదవగాహన లేక దిగులు చెందుతూ వుంటారు. ఎన్నోరకాల సమస్యలతో దుష్టభయాలతో ఆందోళన చెందుతుంటారు. అన్నమయ్య ఇలాంటి సంసారులను గమనించి వారికి ధైర్యం. ఓదార్పు చెబుతూ ఎన్నోరకాల సంకీర్తనలు రచించారు

ఉన్న విచారములేల వోహో సంసారులార
యిన్నిటికిఁ దేడే రక్షయిదే మీకు మనరో॥

భవరోగ వైద్యుని పాదములు సేవించి
భువిరోగములఁ బాసి పొదలరో
తవిలి పదిదిక్కులు తానైన వాని
గావిసి పొగడి దిక్కు కలిగి బ్రదుకరో॥

సేయరో మనుజులార చింత హరినికనైన
రోయరో మీ భుజియింబో రుచులమీద
కెయ మస్థిరము యీ కలిమబ్రధువము చాలా
బోయఁ బోయెందుకు గాక పోయఁ గాలము॥

మెచ్చరో మనుజులార మీరే హరికథలు
పుచ్చరో మీ మదిలోని పొరలెల్లాను
కొచ్చరో మనుజులార కోరికలెల్లను మీకు
ఒచ్చిన శుభములు యిది యెల్లకాలము॥ (1-338)

అన్నమయ్య శ్రీహరిని అవతారరూపుడైన శ్రీవేంకటేశ్వరుని ప్రియమైన మందుగా అభివర్ణించాడు. అలాంటి మందును గతయుగాల్లో ప్రహ్లాదుడు, నారదుడు, జనక మహారాజు, ఇతర చక్రవర్తులు, బ్రహ్మ మొదలైన మన పూర్వులు. ఆచార్యులు కొన్నారని ఆ మందు ఎంతో చలనైనదని, రుచికరమైందని, నిశ్చలమయిందని, భవరోగాల్ని వదలించుతుందని ఆయువును పెంచుతుందని, సమస్తలోకాల్లో నిండివుందని, ముల్లోకాలకు తెలిసేలా శ్రీవేంకటాచలంపై ధ్వజం ఎత్తి కోనేరు దగ్గర వుందని, ఉండటానికి, జీవించడానికి ఇది ఒక్కటే మందు అని లోకానికి ప్రబోధించాడు. రోగాలను, భవరోగాలను పోగొట్టుకోవడానికే గాక ప్రాణంతో ఉండటానికి, సుఖంగా జీవించడానికి, జీవితం సుఖంగా సాగించడానికి కూడా శ్రీవేంకటేశ్వరుడనే మందు ఒక్కటే మందు గతియని అన్నమయ్య మానవ జాతికి చాటిచెప్పాడు. అతని హరిభక్తి ప్రబోధానికి ప్రబల నిదర్శనం.

## శంకరాభరణం

కొనరో కొనరో మీరు కూరిమి మందు
వునికి మనికి కెల్ల నొక్కటే మందు॥

ధ్రువుడు కొనిన మందు తొల్లియుఁ బ్రహ్లాదుడు
చవిగా కొనిన మందు చల్లని మందు
భవరోగములు పొరగ పెద్దలు మున్ను
జవకట్టి కొనిన నిచ్చలమైన మందు॥

నిలిచి నారదుడు కొనిన మందు జనకుడు
గెలుపుతో కొని బ్రతికిన మందు
మొలచి నాలుగు యుగముల రాజులు ఘనులు
కలకాలము గొని కడగన్న మందు॥

అజునకు పరమాయువై యొసగిన మందు
నిజమై లోకములెల్ల నిండిన మందు
త్రిజగములు వెలగ తిరువేంకటాద్రిపై
ధ్వజమెత్తి కోనేటి దరినున్న మందు (1–237)

భగవంతుని నమ్మిన వారు దిగులుపడనవసరం లేదని, చింతించనవసరము లేదని, శ్రీహరే అన్నివిషయాల్లోను రక్షిస్తాడని అన్నమయ్య ప్రబోధించాడు.

'దేవుడు గలవారికి దిగులు చింతయు లేదు
శ్రీవిభుడే అన్నిటా రక్షించు గనక'

చాలా మంది వ్యర్థమైన లౌకిక విషయాలనే మాట్లాడుతూ దైవనామాన్ని పలకడం మరిచిపోతుంటారు. అలాంటివాళ్ళను ఉద్దేశించి అన్నమయ్య–

'నాలుకకు మంచి హరినామ మొకటుండగా
గాలిబోయేటి పూరగాథలేల' అని ప్రబోధించాడు.

ఇలాగే భక్తి ప్రబోధానికి సంబంధించిన సుభాషితాలు అన్నమయ్య సంకీర్తనల్లో చాలా కనిపిస్తాయి.

'అంతరంగములో నున్న హరియే గతిగాక
చింతించి మొక్కితే తానే చేకొని రక్షించును'

'హరి పుట్టించిన దేహి హరిని కొలువక
నరులం గొలుచుట అన్యాయమయ్యా'

'హరియె పరతత్త్వమత డొక్కడే గతి
ధరలో దేవత లెందరైనా కలుగనీ'

## 1.4. అన్నమయ్య ఆధ్యాత్మ సంకీర్తనల్లో జ్ఞాన ప్రబోధం

ఏదిమంచి, ఏదిచెడు? ఏదిశాశ్వతం? ఏది అశాశ్వతం అనే విచక్షణ కలిగి ఉండటమే జ్ఞానం. కామ క్రోధ లోభ మోహ మదమాత్సరాలనే అరిషడ్వర్గాల్ని తొలగించి, మనసును నిర్మలంగా, నిశ్చలంగా వుంచికొని

సత్కార్యాలుచేసి జీవన్ముక్తులు కావడం జ్ఞానానికి నిదర్శనం. అన్నమయ్య సంకీర్తనల్లో ఈవిధమైన జ్ఞాన ప్రబోధానికి సంబంధించిన సంకీర్తనలు చాలా కనిపిస్తాయి.

జ్ఞానికానిదే మనిషిగా పుట్టినందుకు ఫలితం లేదని, దయగలుగ శరీరం దాల్చినందుకు ఫలితం లేదని, ధర్మంచేయనిదే ధనికుడైనందుకు ఫలితం లేదని, శాంత గుణం లేనిదే చదువుకున్నందుకు ఫలితం లేదని ప్రియ వాక్కులు మాట్లాడనిదే పెదవి విప్పినందుకు ఫలితం లేదని అన్నమయ్య సున్నితంగా ప్రశ్నిస్తూ ప్రబోధించాడు.

మనుజుడై ఫలమేది మఱిజ్ఞాని యౌదాకా
తనువెత్తి ఫలమేది దయగలుగు దాకా॥

ధనికుడై ఫలమేది ధర్మము సేయుదాకా
చదివియు ఫలమేది శాంతము కలుగుదాక॥

పెదవెత్తి ఫలమేది ప్రియమాడుదాకను
మదిగల్గి ఫలమేది మాధవుని దలచుదాక॥

కోపాన్ని వదిలేస్తేనే కోటిజపాలు చేయడంవంటిదని ఇతరుల్ని పీడించే పాపపుపనులు చేయకపోవడమే గొప్ప తపస్సు చెయడం వంటిదని పరస్త్రీలను తాకకుండా ఉండటమే అనేక పుణ్యకార్యాలు చేయడం వంటి దని, మౌనంగా ఉండటమే సన్యాసం స్వీకరించడం వంటిదని, అనేక సుఖదుఃఖాలను వదలి వుండటమే మోక్షం అబ్బినట్లుఅని చంచలగుణాన్ని వదులుకొని నిశ్చలంగా ఉంటటమే యోగమచే అన్నమయ్య జ్ఞానప్రబోధం చేసాడు.

కోపము మానితేనే కోటిజపాలు సేయుట
పాపము సేయకుంటేనే బలుతపము॥

పరకాంత నంటకుంటే బలుపుణ్యాలు సేయుట
సరిమౌనాన నుండుటే సన్యాసము చేకొనుట॥

పలుసుఖదుఃఖముల బాసి వుండుటే మోక్షము
అలి చంచలము మానుటది యోగము॥

కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలనే అంతశ్శత్రువులు బాహ్య శత్రువులకన్నా బలీయమైనవి. వీటికి లోబడిన మానవుడు పతనమై పోతాడు. అందువల్ల మానవుని వాటి బారినుంచి కాపాడటానికి వాటిని హేయమైన పదార్థాలుగా జుగుప్సాత్మకంగా అన్నమయ్య వర్ణించాడు.

మాలతనము వంటిది మతి తగులు కామము
అలరు మొట్టు వంటిది అంటు క్రోధము॥

కేలినొడిగించు నెంగిలి వంటిది లోభము
చుట్టి మద్యము వంటిది చొక్కించు మోహము॥
వట్టి మాంసము వంటిది వయో మదము
పుట్టిన భ్రమవంటిది పొడిగిన మచ్చరము॥ (2-221)

ఇతరుల్ని వేధించడం వల్ల, దురాశల్ని పెంచుకోవడం వల్ల చేయకూడని పనులు చేయడంవల్ల అనేక కష్టనష్టాలకు, బాధలకు గురికావలసివస్తుంది. అందువల్ల ముందే తెలుసుకొని జాగ్రత్త వహించాలని అన్నమయ్య జ్ఞాన ప్రబోధం చేసాడు. నిప్పును పట్టుకుంటే కాలకుండా ఉండదు. పరస్త్రీ వ్యామోహం వేధించకుండా వుండదు. విషాన్ని మింగితే తలకెక్కకుండా వుండదు. వారకాంతల వలపు భ్రమింపచేయకుండా ఉండదు. కాబట్టి యోగి అయినా, బ్రహ్మ అయినా ముందే తెలుసుకొని జాగ్రత్తవహించాలని అన్నమయ్య హెచ్చరిక చేసాడు.

మొదలే తెలియువలె మోసపోక మానవలె
పదిలపు యోగికైనా బ్రహ్మకైనాను॥

చిచ్చు కాగలించుకొంటే చిమిడించకుండునా
గచ్చు పరస్త్రీల పొందు కాచకుండునా
తచ్చి విషము మింగితే తలకెక్కకుండునా (3-273)

మానవుడు శరీరం కలిగినందుకు ఇతరులకు హానిచేసే పాపకృత్యాలే చేస్తు న్నాడు కానీ పుణ్యకార్యాలు చేయడం లేదని, మనసు కలిగినందుకు చెడు ఆలోచనలే చేస్తూంటాడని, నిశ్చలమైన జ్ఞానాన్ని పొందడంలేదని, చదువు

కున్నందుకు సందేహించడమే ఫలితమవుతుందని, నిర్మలమైన జ్ఞానం లేక పోతోందని ఇదంతా తెలుసుకొని శ్రీ వేంకటేశ్వరుని సేవిస్తే జీవితం చక్క బడుతుందని, పునర్జన్మ వుండదని అన్నమయ్య జ్ఞాన ప్రబోధం చేసాడు.

తనువు గల ఫలము పాతకము సేయనె కాని
అనుగైన పుణ్యంబు అదియింత లేదు
మనసుగల ఫలము దుర్మతి బొందనే కాని
ఘనమనో జ్ఞాన సంగతి కొంత లేదు॥

చదువు గలిగిన ఫలము సంశయంచే కాని
పదమల జ్ఞాన నిశ్చయ మింత లేదు
యిది యెరిగి తిరు వేంటేశ్వరుని గొలిచినను
బ్రదుకు గలుగును భవము ప్రాణులకు లేదు (1-340)

మానవుడు సాటిమానవుడి పట్ల కులమత వర్గా భేదాలు చూపించడం అజ్ఞానమని, భగవంతుడు సృష్టించిన పృథ్వీ ఎప్ తేజోవాయు వాకాశాలకు సమస్త జీవరాశుల పట్ల హీనాధిక బేధాలు లేవని, ఆహర నిద్రాభయాదుల్లో సమస్త జీవరాశులూ సమానమేనని, అందరికీ శ్రీహరే అంతరాత్మ అని ఈవిధమైన జ్ఞానాన్ని మానవుడు కలిగి వుండాలని అన్నమయ్య ప్రబోధించాడు.

తందనాన ఆహి తందనాన పురె
తందనాన భళా తందనాన॥

బ్రహ్మమొక్కటె పరబ్రహ్మమొకటె పర
బ్రహ్మమొకటే పరబ్రహ్మ మొకటె॥

కందువగు హీనాధికము లిందులేవు
అందరికీ శ్రీహరే అంతరాత్మ,
ఇందులో జంతుకుల మింతా ఒకటే
అంతరికీ శ్రీహరే అంతరాత్మ॥

నిండార రాజు నిద్రించు నిద్రయు నొకటే
అండనే బంటు నిద్ర అదియు నొకటే
మెండైన బ్రాహ్మణుడు మెట్టు భూమి యొకటే
చండాలు డుండేటి సరిభూమి యొకటే॥

అనుగు దేవతలకును అల కామసుఖ మొకటే
ఘనకీట పశువులకు కామసుఖ మొకటే
దినమహోరాత్రములు తెగిధనాఢ్యున నొకటే
వొనర నిరుపేదకును ఒక్కటే అవియు॥

కడగి యేనుగు మీద కాయు యెండొకటే
పుడమి శునకము మీద పొలయు నెండొకటే
కడు పుణ్యులకు పాప కర్ములను సరిగావ
జడియు శ్రీ వేంకటేశ్వరు నామ మొకటే

## 1.5. అధ్యాత్మ సంకీర్తనల్లో మానవత్వ ప్రబోధం

మానవులుగా పుట్టిన వారు మానవులుగా, దైవాంశ సంభూతులుగా ప్రవర్తించాలి కానీ జంతువుల్లాగా, రాక్షసుల్లాగా ప్రవర్తించకూడదు. ఎదుటి వారిని మనసా వాచా కర్మణా నొప్పించకుండా, అపకారం చేయకుండా దయకలిగి వుండాలని, పరోపకారం చేయాలని తెలియ జేస్తూ అన్నమయ్య మానవత్వానికి సంబంధించిన అనేక సంకీర్తనలు రచించాడు.

కొంతమంది జన్మతః విషపూరితమైన స్వభావం కలిగివుంటారు వారు సాటి మనుషుల్ని మాటలతో, చేష్టలతో బాధపెడుతుంటారు. అలాగే ఇతరుల మేలును, అభివృద్ధిని చూసి సహించలేరు. అన్నమయ్య అలాంటి దుష్టుల్ని గమనించి వారికి ఈ శరీరం, ఈ బ్రతుకు ఎందుకు? ఇతరులకు చేసే ఉపకారమంతా ఎప్పుడూ తనకే చెందుతుందని చదివి చెప్పని చదువెందుకు? ఈ కడుపెంత? తాను తినే ఆహారమెంత? ఈ మాత్రం కోసం చేయకూడని రకరకాల పనులుచేసి కష్టాలుపాలు కాపడంఎందుకు? అని అన్నమయ్య ఎంతో ఆవేదనతో ప్రశ్నిస్తూ మానవత్వాన్ని ప్రబోధించాడు.

కడు పెంత తా గుడుచు కడుపెంత దీనికై
పడనిపాట్ల నెల్ల పడి పొరల నేలా?
పరుల మనసునకు ఆపదలు కలుగక జేయు
పరితాప కరమైన బ్రదుకేలా?

పొరిది నితరుల మేలు చూచి సైపగలేక
తిరుగు చుండేటి కష్టదేహ మిది యేలా

"అష్టాదశ పురాణేషు వ్యాసేన కథితం ద్వయం
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్"

అనే శ్లోకం ప్రసిద్ధమయింది. అష్టాదశ పురాణాల్లో పుణ్యాత్ములు పరోపకారం చేస్తారు, పాపాత్ములు పరుల్ని పీడిస్తారు. అనే రెండు అంశాలు వ్యాసునిచే చెప్పబడ్డాయి. అన్నమయ్యకూడా తన సంకీర్తనల్లో ఈ విషయాన్ని పేర్కొన్నారు. అన్నమయ్య తాను ఘనమైన శాస్త్రాలను తరచి చూసానని చెబుతూ అందులో పరుల్ని పీడించడం కన్నా పాపం ఏదీలేదని పరోపకారం కన్నా పుణ్యం లేదని, ప్రశాంతంగా ఉండటంకన్నా స్వధర్మం ఎక్కడా లేదనే అంశాలు వున్నాయని, ఇంతకన్నా మించి ఏమీ లేదని అన్నమయ్య పేర్కొన్నాడు.

కంటినిదే యర్థము ఘనశాస్త్రములు దవ్వి
నంటున నిందు కంటెను నాణె మెందూ లేదు॥

పిరపీడ సేయుకంటె పాపము మరెందు లేదు
పరోపకారము కంటే బహు పుణ్యములేదు
నిరతశాంతము కంటే నిజధర్మ మెందు లేదు
హరిదాసు డౌకంటే నటగతి లేదు॥ (1-443)

పరులను పీడించి బ్రతికే బ్రతుకు కన్నా, పరులకు ఉపకారాలు చేయడం వల్ల వచ్చే కష్టాలే మేలని అన్నమయ్య మానవత్వాన్ని ప్రబోధించాడు.

"పరపీడ గావించి బ్రతుకు బ్రతుకుట కంటె
పరహితము చేయు నాపదలె మేలు"

## 1.6. సమాజంలోని దురాచారాలను ఖండించండి

సమాజంలో చెలరేగే కుల భేదాలను, దేవతలకు జంతుబలులివ్వడం, అగ్నిగుండాలు తొక్కడం, పితృదేవతలకు పిండాలు పెట్టడం మొదలైన దురాచారాల్ని అన్నమయ్య ఖండించాడు. మానవుడికి హరిభక్తి ముఖ్య మని దురాచారాలు వ్యర్థమని అన్నమయ్య తెలిపాడు.

'హరిభక్తి కలిగితే అన్నియు ముఖ్యముగాక
విరహాచారము లెల్ల వృథా వృథా' (2-62)

దురాచారాల్ని పాటించే మూర్ఖుడికి ఎన్ని మంచి విషయాలు చెప్పినా ఎక్క వని, విధించబడిన కర్మల్ని వదలి వేసిన మనిషికి సదాచారాలు జరగవని అన్నమయ్య తెలిపాడు.

సతత దురాచార జడునకు పుణ్యసం
గతి తలపోసిన కలిగీనా
విహిత కర్మములు విడిచిన వానికి
సహజాచారము జరిగీనా (1-347)

ఎంతో ధనాన్ని ఖర్చుపెట్టి మానవుడు చనిపోయిన మానవులకు పరలోకక్రి యలు చేస్తున్నారని, అలాచేయడం వల్ల పరలోకంలో వారు సంతృప్తి చెందు తారని భావిస్తారని, రాళ్ళు, చెట్లు, పశుపక్ష్యాదులకు ఎవరు చేస్తున్నారు ? అని అన్నమయ్య సహేతుకంగా సమాజాన్ని ప్రశ్నించారు.

నరులకు నరులే పరలోక క్రియలు
సిరిమోహాచారాల చేతురుకాక
తరుపాషాణ పశుతతుల కెవ్వరు సేసే
రరయగ భ్రమగాక అవి పస్తులున్నవా (2-126)

భగవంతుని తెలుసుకునే దారిని గ్రహించి సేవిస్తే చాలని, నీవారమని దైవా నికి అంకితమైతే చాలని, జీవాల్ని చంపి, వాటి తలల్ని, కాళ్ళను, గుండెను

నైవేద్యంగా ఇవ్వవలసిన పని లేదనీ, అగ్నిగుండాలు తొక్కవలసిన పనిలేదని అన్నమయ్య సాత్త్విక భక్తిని ప్రబోధించాడు.

మొక్కరో మీరు మోసపోక మీకు
దిక్కుదైన ఆదిదేవునికి॥

మారుచేతు లీయవద్దు మారుగాళ్లీయవద్దు
బీరాన గుండెలు కోసి పెట్టవద్దు
గోరపడి చిచ్చులోన గుండాలు చొరవద్దు
ఊరకే నీవారమని వున్నచాలు॥

సిడిదల లియ్యవద్దు జీవాల చంపవద్దు
బడిబడి పగ్గాల పారవద్దు
సిడిమీద చిత్తరపు చిమ్ములు చిమ్మగవద్దు
కడనుండి దాగిగన్నచాలు॥

సాంఘిక దురాచారాల్లో కులభేదాలను పాటించడం కూడా ఒకటి మానవ జాతిలో రకరకాల జాతులుండటం వ్యర్థమని, జాతి భేదాలు శరీర గుణాలని, జాతిశరీరం తోనే నశించి పోతుందని, ఆత్మకు ఆది అంతం లేదని, నిర్మలమయిందని, దోషం లేదని అన్నమయ్య తెలియ జేసాడు.

విజాతులన్నియు వృథా వృథా
అజామిళాదుల కదియె జాతి (2-383)

జాతిభేదములు శరీర గుణములు
జాతి శరీరము తోడనే చెడు
ఆతుమ పరిశుద్ధం బెప్పుడును
ఆది నిర్దోషం బనాది॥

"ఎక్కువ కులజుడైన హీనకులజుడైన
నిక్కమెరిగిన మహా నిత్యుడే ఘనుడు"
"ఏ కులజుడేమి ఎవ్వడైన నేమి
ఆకడ నాతడే హరి నెరిగినవాడు"

# 1.7. వర్ణనలు

అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తనల్లో శ్రీహరి భక్తి వాత్సల్యానికి, శ్రీహరి అవతార మూర్తులకు సంబంధించిన అనేక సంకీర్తనలు వ్యక్తమవు తాయి. అన్నమయ్య తెలుగుభాషలోనే కాక సంస్కృత భాషలో కూడా అనేక సంకీర్తనలు రచించాడు. అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరునిపై తన కున్న భక్తిని స్తుతి రూపంగానేకాక దివ్యమైన వర్ణనాత్మకంగా కూడా చాలా సంకీర్తనలు రచించాడు.

భూమిదేవి యొక్క ఘనమైన వక్షస్థల శైలాన్నికౌగిలించుకోవడం వల్ల వెలువడిన పరిమళ భరితమైన స్వేదజలంచేత మిక్కిలి ఆనందించు వానికి, పద్మవాసిని అయిన లక్ష్మీదేవి యొక్క సరసమైన ప్రణామాలందు కుంటున్న చరణాలు కల్గినవానికి, దేవతాధిపుని (దేవేంద్రుని) కిరీటంలోని దివ్యమైన రత్నకాంతులచేత సంభావించబడిన నిర్మలమైన పాదపద్మాలు కలవానికి, మోక్షకాంతకు కాంతుడైన వానికి, సకలాత్మునికి, నారాయణు నికి, అత్యంతానంద భరితునకు, సర్వేశ్వరునికి, శ్రీ వేంకటాచల శ్రీనివాసు నికి నమస్కారం అంటూ అన్నమయ్య సంకీర్తన రచించాడు.

నమో నారాయణాయ
నమధి కానందాయ సర్వేశ్వరాయ॥

ధరణీ సతీ ఘన స్తన శైల పరిరంభ
పరిమళ శ్రమజల ప్రమదాయ
సరసిజ నివాసిని సరస ప్రణామయుత
చరణాయతే నమో సకలాత్మకాయ॥

దేవతాధిప మకుట దివ్యరత్నాంశు సం
భావితామల పాద పంకజాయ
కైవల్య కామినీ కాంతయుతే
నమో శ్రీవేంకటాచల శ్రీనివాసాయ

అన్నమయ్య వాత్సల్య భక్తిపూరితమైన అనేక సంకీర్తనలను వర్ణనాత్మ కంగా రచించాడు. తమను కాపాడే చిన్నికృష్ణుడు ముద్దులొలికే యశోద

ముంగిట్లోని ముత్యమని, అనేక మహిమలు కలిగిన దేవకీ కుమారుడని, గోపికల అరచేతిలోని మాణిక్యమని, పంతగించుకునే దుష్టుడైన కంసుని పాలిట వజ్రమని, మూడులోకాలకు గరుడపచ్చ పూసఅని, రతికేళిలో రుక్మిణీదేవి మోవికి పగడమని, గోవర్ధన పర్వతపు గోమేధికమని, శంఖ చక్రాల సందుల్లో వైఢూర్యమని, కాళింగుని తలలపై అడుగిడిన పుష్యరాగ మని, శ్రీ వేంకటాద్రిమీద ఇంద్రనీలమని, పాలసముద్రంలో వదలని దివ్య రత్నమని, పద్మనాభుడైన ఆ శ్రీహరిని చిన్నికృష్ణుడై బాలుడులా తిరుగు తున్నాడని అన్నమయ్య వాత్సల్యపూరితమైన హృదయంతో వర్ణించాడు.

## కురంజి

ముద్దుగారే యశోద ముంగిట ముత్యము వీడు
తిద్దరాని మహిమల దేవకీ సుతుడు॥

అంతనింత గొల్లెతల అరచేతి మాణికము
పంతమాడే కంసుని పాలి వజ్రము
కాంతుల మూడు లోకాల గరుడపచ్చపూస
చెంతల మాలోనున్న చిన్నికృష్ణుడు॥

రతికేళి రుక్మిణికి రంగుమోవి పగడము
మితి గోవర్ధనపు గోమేధికము
సతమై శంఖచక్రాల సందుల వైఢూర్యము
గతియై మమ్ముగాచేటి కమలాక్షుడు॥

కాళింగుని తలలపై కప్పిన పుష్యరాగము
యేలేటి శ్రీ వేంకటాద్రి యింద్రనీలము
పాల జలనిధిలోన పాయని దివ్యరత్నము
బాలుని వలె తిరిగీ పద్మనాభుడు॥

అన్నమయ్య శ్రీహరి దశావతారాల్ని పొదుపుకతల రూపంలో అచ్చతెనుగు భాషలో ఎంతో రమ్యంగా వర్ణించాడు. రెక్కలు ఎడబాసి ఉండవు కాని

పైకి పోలేదు అని మీనావతారాన్ని, కిందపడతాడు కాని సేవకుడు కాదని వరాహావతారాన్ని, దాగుకుంటాడు కాని దొంగకాదు అని కూర్మావతారాన్ని పొడవైన గోళ్ళు పెంచుతాడు కాని విటుడు కాదని నరసింహావతారాన్ని, ఎంతో పొట్టివాడు కానీ ఆకాశమంత పొడవైన వాడని వామనావతారాన్ని, జగడాల స్వభావం కాని తాపసి వేషమని పరశురామావతారాన్ని, మగువ కోసం పోరాడుతాడు కానీ విరక్తుడని శ్రీరామావతారాన్ని, అతను చేసేది పొలం పనులు కానీ ఎంతో తెల్లగా ఉంటాడని బలరామావతారమని (హలాయుధుడు), స్త్రీలను వలపిస్తాడు కానీ మాయకు అంటడని బుద్ధావతారాన్ని (పురాణాల్లోన్ని బుద్ధుడు త్రిపురాసుల భార్యల్ని మానభంగాలు చేసిన తర్వాత శివుడికి త్రిపురాసురుల్ని సంహరించడానికి వీలయిందని చెబుతారు.) గుర్రాన్ని తోలుతాడు కాని రౌతుగాదని కల్కి అవతారాన్ని అన్నమయ్య వరుసగా దశావతారాల్ని సూచించి ఈదశావతారాల్ని తాల్చిన పరమపురుషుడు. నేడు శ్రీవేంకటాచలంపై తిరుగుతున్నాడని అన్నమయ్య తెలిపాడు.

## రామక్రియ

ఎవ్వడో కాని యెరగ రాదు కడు
దవ్వులనే వుండు తలపులో నుండు॥

ఎడయవు తనరెక్క లెగసిపోలేడు
కడుదాగు కాని దొంగయు కాడు
వడికింద పడును సేవకుడును కాడు
వెడగు గోళ్ళు పెంచు విటుడును కాడు॥

మిగులా పొట్టివాడు మింటికిని పొడవు
జగడాలు తపసి వేషములును
మగువకై పోరాడు మరి విరక్తుడును
తగుకాపు పనులు నెంతయు తెల్లదనము॥

తరుణుల వలపించు తగిలిపై కొనడు
తురగము దోలు రౌతును కాడు

తిరువెంకటాద్రిపై తిరుగునెప్పుడును
పరమమూర్తియై పరగునీఘనుడు (1-74)

## 1.8. ఆత్మప్రబోధం

జీవితానుభవం, బుద్ధి పరిపక్వం కలిగిన మానవుడు ముందుగా తనకుతాను ప్రబోధం గావించుకొని పరిశుద్ధుడవుతాడు. తాను వాటిని ఆచరించి తర్వాత ఇతరులకు చెబుతాడు ఈవిధమైన ఆత్మప్రబోధాత్మకమైనవి అన్నమయ్య సంకీర్తనల్లో చాలా కనిపిస్తాయి. రకరకాల చోట్లకు పారిపోవద్దని, పట్టుదల వీడివద్దని, అలా పారిపోతే నీవే కష్టాలకు గురిఅవుతావని, శివుని వైరి అయిన మన్మధునికి పట్టుపడవద్దని, ఈవయసు ప్రాయాలు కావడికుండలని. మంచిచెడులు ఎప్పుడూ ఒకేరకంగా ఉండవని, తీయని మాటల్ని చెవులతో వినకుండా వుండమని, కీర్తిని వదలవద్దని, శ్రీహరి అయిన శ్రీవేంకటేశ్వరుని వదలకుండా తలవమని అన్నమయ్య మనస్సును రకరకాల అశాశ్వతమైన విషయాలపై పోనివ్వకుండా శ్రీవేంకటేశ్వరుని స్మరించుకుంటూ జాగ్రత్తగా ఉంచుకోమని అన్నమయ్య తనకుతాను ఆత్మప్రబోధం చేసుకుంటూ తద్వారా లోకానికి ప్రబోధించాడు.

పారకుమీ వో మనసా పంతము విడువకుమీ మనసా
పారిన నీవే బడగయ్యేదవు చేరువనాడే చెప్పవెమనసా
చింతించకుమీ శివునివైరిచే చిక్కువడకుమీ వోమనసా
కంతువారకము వయసుప్రాయములు కావడికుండలు వోమనసా

వన్నెలమాటలు చెవుల బెట్టక వాసి విడువకుమీ వోమనసా
వెన్నుని వేంకటగిరిపతి తలచుము వేపారకుమీ వోమనసా॥ (1-188)

అన్నమయ్య "మనసు"ను సంబోధిస్తూనే కాక జీవుని సంబోధిస్తూ కూడా సంకీర్తనలు రచించాడు. బాధపెట్టే కామక్రోధ లోభమోహాదులనే అంతశ్శత్రువుల్ని విజృంభించనివ్వకుండా అడ్డుపడాలని, పంచేంద్రియాల్ని లోపలికి పిలిచి సేవ చేయించుకోమని గుర్రాల్లా పరుగులు తీసే కోరికల్ని లాగిపట్టుకోమని, అశాశ్వతమైన క్షణిక సుఖాల్నిచ్చే భోగాలను పరమాత్మకు

వదిలిపెట్టి సేవించమని, సర్వకర్త అయిన శ్రీవేంకటేశ్వరునే ఆనందంగా మనసులో భావించి దర్శించవచ్చు కదా అని అన్నమయ్య జీవునికి ప్రబోధిస్తూ తద్వారా లోకానికి ప్రబోధించాడు.

వెలిబడ్డ యింద్రియాల వెలయలోనికి పిల్చి
కొలువులు సేయించు కొనరాదా
కలచెడి లోలోని కామాది శత్రువుల
వెళకనీక అడ్డుపెట్టించరాదా జీవుడ॥

అట్టె పరువు దోలిన ఆసలనే గుఱ్ఱముల
గట్టిగ లోలాయమున కట్టుకోరాదా
ఒట్టి యెదుట సాజులై వుండిన. భోగములను
ముట్టి యంతర్యామి కిచ్చి మొక్కరాదా జీవుడ॥

ఇంపుల శ్రీవేంకటేశుడితడే సర్వకర్త
సొంపుగ భావించి చక్క చూడరాదా జీవుడ॥

నియమంగా పాడేవాడను. నాదోషాల్ని లెక్కించకు మాధవా! నేను నీ దాసుడను నీవు శ్రీవేంకటేశుడివయ్యా అని తన వినయశీలాన్ని స్వామివారికి విన్నవించుకున్నాడు.

వేమన్న

చెప్పుమని రామచంద్రుడు
చెప్పించిన పలుకు మీద చెప్పెదనేనెప్పుడు
ఇహపర సాధన మిప్పుణ్య చరిత్ర
తప్పులేంచకుడు బుధుల్

అని పలికినట్లుగా—

పోతన

పలికెడిది భాగవతమట
పలికించెడి విభుడు రామభద్రుండట
నేపలికిన భవహర మగునట
పలికెద వేరొండు గాథ పలుకగనేలా

అని తెలిపినట్లుగా అన్నమయ్యకూడా శ్రీవేంకటేశ్వరుడే తనచే రకరకాల సంకీర్తనల్ని రచింపచేసాడని. తాను స్వతంత్రంగా చెప్పలేదని తెలిపాడు.

## గుండక్రియం

దాఁచుకో నీ పాదాలకు తగనే చేసిన పూజలివి
పూఁచి నీ కీరితిరూప పుష్పము లివిమయ్యా॥

ఒక్క సంకీర్తనే చాలు వొద్దికైమమ్ము రక్షించగ
తక్కినవి భండారాన్న దాఁచి వుండనీ
వెక్కసమగు నీనామము వెల సులభము ఫలమధికము
దిక్కై నన్నే లితివిక నవి తీరని నా ధనమయ్యా॥

నా నాలికపై నుండి నానా సంకీర్తనలు
పూని నాచేనిన్ను పొగడించితివి
వేనామాల వెన్నుడా వినుతించ నెంతవాడ
కానిమ్మని నాకీపుణ్యము గట్టిత వింతేమయా॥

ఈ మాట గర్వముకాదు నీమహిమే కొనియాడితిగాని
చేముంచి నా స్వాతంత్ర్యము చెప్పినవాడను గాను
నేమాన పాడేవాడను నేరములెంచకుమీ
శ్రీమాధవ నే నీదాసుడ శ్రీవేంకటేశుడవయా॥ (2-3?8)

మహనీయులు తాము అపరాధాలు చెయ్యకపోయినా, ఘనకార్యాలు చేసి లోకానికి మేలుచేసినా తాము అల్పులమని దోషులని దైవానికి విన్నవించుకుంటారు. అది వారి వినమ్రతకు నిదర్శనం. అన్నమయ్యకూడా శ్రీవేంకటేశ్వరుని నీవు పురుషోత్తముడివి నేను పురుషుల్లో అధముడను మేము చేసినవి లెక్కలేనన్ని అపరాధాలు. నీది అపారమైన దయ. నిన్ను తెలుసుకోలేని నీచగుణం నాది. నన్ను వదలకుండా ఉండే గుణంనీది ఎప్పుడు యాచించడమే నా పని అన్నివిధాలా రక్షించడమే నీపని, నిన్ను

ఎప్పుడూ దూషించడమే నాపని, నేరమంతా నాది. నేర్పంతా నీది. నేను అజ్ఞానిని నీవు జ్ఞానివి. ఈవిధంగా నన్ను ఏలుతున్నావు నీ ప్రతాపం ఈ భూమిపై అంతటా నిండింది. అని తన వినయశీలాన్ని స్వామివారికి వ్యక్తం చేసుకున్నాడు.

## 1.9. అన్నమయ్య వినయ శీలం

అన్నమయ్య శ్రీవేంకటేశ్వర వరప్రసాది అయినా స్వామివారిపై వేలాది సంకీర్తనలు రచించి తాను ధన్యత గాంచి లోకాన్ని తరింపచేస్తున్నాడు నేనుఅనే భావన ఏమాత్రంలేని వినయశీలి. దృఢసంకల్పుడు. అన్నమయ్య వినయశీలాన్ని వ్యక్తంచేసే సంకర్తనలు అనేకం వున్నాయి.

అన్నమయ్య ఆ జన్మాంతం శ్రీవేంకటేశ్వరుని త్రికరణశుద్ధిగా ధ్యానించి సేవించాడు. తానురచించిన 32 వేల సంకీర్తనల్ని శ్రీవేంకటేశ్వరునికి అంకితంచేసాడు. ఆ సందర్భంగా అన్నమయ్య స్వామివారితో ఈ సంకీర్తనల్ని నీ పాదాలదగ్గర దాచుకో, ఇవి చేసిన పూజలు, నీకీర్తిరూప పుష్పాలు. వీటిలో ఒక్క సంకీర్తనచాలు మమ్మల్ని రక్షించడానికి. తక్కిన వన్నీ భాండాగారంలో దాగివుండని. మహోన్నతమైన నీ నామం వెల సులభమయింది. ఫలితం చాలాగొప్పది. నాకు దిక్కుగాఉండి నన్ను కాపాడావు. నా నాలుకపై నుండి రకరకాల సంకీర్తనల్ని ప్రయుత్నించి నాచేత నిన్ను పొగిడించుకున్నావు. సహస్రనామాలు కల్గిన ఓ విష్ణుమూర్తీ నిన్ను పొగడడానికి నేనెంతవాడను యోగ్యుడనని ఎంతో ప్రీతితో నాకీ పుణ్యాన్ని సమకూర్చావు, ఈమాట గర్వంగా పలకడంలేదు. నీ మహిమనే కొనియాడాను.. దీన్ని స్వతంత్రంగా చెప్పలేదు.

### శుద్ధవసంతం

పురుషోత్తముడవు నీవు పురుషాధముడ నేను
ధరలో నాయందు మంచితనమేది॥

అనంతాపరాధములు అటునేను సేసేవి
అనంతమయిన దయ అడినీది

నిను నెఱగ కుండేటి నీచు గుణము నాది
నను నెడయకుండే గుణము నీది॥

సకల యాచకమే సరుసనాకు పని
సకల రక్షకత్వము పరి నీపని
ప్రకటించి నిన్నుదూరే పలుకే నాకెప్పుడూను
వెకలినైనను గాచే విధము నిది॥

నేరమంతయును నాది నేరు పింతయును నీది
సారెకు నజ్ఞాని నేను జ్ఞానివి నీవు
ఈరీతి శ్రీవేంకటేశ యిట్టే నన్ను నేలితివి
ధారుణిలో నిండెను ప్రతాపము నీది (2-53)

# 1.10. అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో ప్రేయసీప్రియ సౌందర్య వర్ణన

అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో నాయికా నాయకులు, సతీపతులు, ప్రేయసీ ప్రియులు జగన్మాతా పితరులైన, జగద్రక్షకులైన అలమేల్మంగా శ్రీనివాసులు. వీరి సౌందర్యవర్ణనకు సంబంధించిన సంకీర్తనలు అనేకంవున్నాయి ప్రియుడైన వేంకటేశ్వరుని కోసం ఎదురచూస్తున్న ప్రేయసి తన సఖితో నన్ను ఏలుతున్నవాడు ఎందుకు రావడంలేదో అని విచారిస్తుంది. తన ప్రియుడు ఎలాంటివాడో తెలియచేస్తూ పచ్చని చిలుకల తేరుమీద వుంటూ, చెఱకు విల్లుగా కల్గిన మన్మథునికి తండ్రి అని, పచ్చని కాంతులు వదలని బంగారు వస్త్రాన్ని కట్టుకునే అందమైనవాడని, హంసపై తిరిగే సరస్వతిదేవి నాథుడైన బ్రహ్మకు తండ్రి అని, తెల్లని పరుపులాగా ఉండి ఆదిశేషునిపై పవళించే తెల్లని కన్నుల తెలివైనవాడని, కొండను విల్లుగా చేసుకున్న శివుని అధీనం చేసుకున్న యువతి అయిన గంగాదేవికి తండ్రి అని, కొండలనెత్తిన కొండలరాయుడని వివరించి చెబుతుంది.

ఈ సంకీర్తనల్లో అన్నమయ్య స్వామివారిని పచ్చని చాయలు పాయని బంగారు పచ్చడము కట్టిన బాగైనవాడని, తెల్లని కన్నుల తెలివైన వాడని స్వామివారిని సౌందర్యాన్ని వర్ణించాడు.

ఏలరాడమ్మ యింతిరో వా
డేల రాడమ్మ వన్నెలినవాడు॥

పచ్చని పులుగుల బండిమీదనుండు
పచ్చవింటి పిన్నబాలుని తండ్రి
పచ్చని చాయల పాయని బంగారు
పచ్చడము గట్టిన బాగైనవాడు॥

తెల్లని పులుగుపై తిరుగ మరగినట్టి
తెల్లని సతిపాలి దేవర తండ్రి
తెల్లని పరపుపై తేలిపొరల వెట్టు
తెల్లని కన్నుల తెలివైన వాడు॥

కొండవింటి వాని గుత్తగొనిన యట్టి
కొండుక పాయపు కూతురు తండ్రి
కొండల రాయుడు కోనేటి తిమ్మయ్య
కొండ తలనెత్తి గుఱుతైన వాడు॥ (12-235)

అన్నమయ్య దివ్యనాయిక అయిన పద్మావతీ సౌందర్యం జ్యోతిష శాస్త్రంలోని పన్నెండు రాశులకు నెలవయిందని, ఆమె విల్లువంటి కనుబొమలు ధనురాశి అని, చేపలవంటి కన్నులు మీనరాశి అని, కుంభాలవంటి స్తనాలు కుంభరాశి అని, సింహము వంటి నడుము సింహరాశి అని, మకర ముద్ర కల్గిన పైటచెరగు మకరరాశి అని, బంగారుతో తులతూగే శరీరం తులారాశి అని, మదవతిగా ఒప్పుటచే వృషభరాశి అని, గోప్యపుమాటలు కర్కాటకరాశి అని, లేతచిగురాకువంటి పెదవి మేషరాశి అని, తనప్రియుడైన శ్రీనివాసుని కలసినందుకు మిథునరాశి అని రమణీయంగా వర్ణించి తన శాస్త్రవైదుష్యాన్ని, వర్ణనాచాతుర్యాన్ని వ్యక్తంచేసాడు.

## శుద్ధరామక్రియ

ఇన్నిరాశుల యునికి యింతి చెలువపు రాశి
కన్నె నీ రాశి కూటమి గలిగిన రాశి॥

కలికి బొమవిండ్లుగల కాంతకును ధనురాశి
మొలయు మీనాక్షికిని మీనరాశి
కులుకు కుచ కుంభముల కొమ్మకును కుంభరాశి
చెలగు హరిమధ్యకును సింహరాశి॥

చిన్ని మకరాంకపు పయ్యెద చేడెకు మకరరాశి
కన్నె పాయపు సతికి కన్నెరాశి
వన్నెమై పైడితుల తూగు వనితకు తులారాశి
తిన్నని వాడిగోళ్ళ సతికి వృశ్చికరాశి॥

ఆముకొను నొరపుల మేరయు నతివకు వృషభరాశి
గామిడి గుట్టుమాటల సతి కర్కాటకరాశి
కోమలపు చిగురు మావి కోమలికి మేషరాశి
ప్రేమ వేంకటపతి కలిసెప్రియ మిథునరాశి॥ (12 143)

అన్నమయ్య దివ్యదంపతులైన లక్ష్మీనారాయణులకు ఈడు జోడూ బాగా కుదిరిందని, మాటలతో వారి సౌందర్యాన్ని పొగడటానికి వీలు కాదని తెలుపుతూ అమ్మవారి శరీరంలోని ఏ యే అంగాలవల్ల ఏ యే చర్యల వల్ల స్వామివారికి ఏ యే పేర్లు వచ్చాయో రమ్యంగా వర్ణించాడు.

నిన్నువలచిన దేవి చంద్రముఖి కాబట్టి నిన్ను రామచంద్రుడన వచ్చు. ఆమె నల్లని చూపులు కలిగింది కాబట్టి నిన్ను కృష్ణుడు అనవచ్చు ఆమె వామలోచన (అందమైన కన్నులు కలది) కాబట్టి వామను డనవచ్చు ఆమె సింహమధ్య కాబట్టి నరసింహుడనవచ్చు ఆమె శ్రీదేవి కాబట్టి నిన్ను శ్రీవరుడనవచ్చు ఆమె అహిరోమాళి (పామువంటి పొడవైన నల్లననూగారు) కాబట్టి నిన్ను శేషాద్రి శ్రీవేంకటేశ్వరుడు (ఆదిశేషుడు వేంకటాచలంగా వెలశాడు ఆ కొండపై శ్రీవేంకటేశ్వరుడు వెలసాడు) అనవచ్చు అని అన్నమయ్య మనోహరంగా వర్ణించాడు

ఈకెకు నీకుదగు నీడు జోడులు
వాకుచ్చి మిమ్ము పొగడ వసమా యొరులకు॥

జట్టిగొన్న నీదేవులు చంద్రముఖి గనక
అట్టెనిన్ను రామచంద్రుడనదగున
చుట్టమై కృష్ణవర్ణపు చూపుల యాపెగనక
చుట్టుకొని నిన్ను కృష్ణుడనదగును॥

చందమైన వామలోచన యాపెయౌగనక
అందరు నిన్ను వామనుడనదగును
చెంది యాకె యప్పటిని సింహమధ్య గనక
అందినిన్ను నరసింహుడని పిల్వదగును॥

చెలువమైన యాపె శ్రీదేవి యగు గనక
అల శ్రీవత్సుడవని యాడదగును
అలమేల్మంగ మహిరోమాళి గలదిగాన
యిల శేషాద్రి శ్రీవేంకటేశుడనదగును (30-552)

## 1.11. ప్రేయసీ ప్రియుల ప్రేమ వర్ణన

ప్రేయసీప్రియులకు ఒకరిమీద ఒకరికున్న అవ్యాజప్రేమను తెలిపే అన్నమయ్య సంకీర్తనలు అనేకం కనిపిస్తాయి. వైష్ణవ సంప్రదాయంలో 'పుమాన్ విష్ణురితి ఖ్యాతః స్త్రీప్రాయం ఇతరం జగత్' శ్రీహరి ఒక్కడే పురుషుడు తక్కిన జీవజాల మంతా కూడా స్త్రీప్రాయమేనని భావిస్తారు. భగవంతుని భర్తగా, ప్రియుడుగా భావించి ఆరాధించి అతనిలో లీనం కావడమే ప్రేమభక్తి, మధురభక్తి, శృంగారభక్తి అవుతుంది. మీరా మొల్ల, రాధ, గోదాదేవి మొదలైనవారు ప్రేయసీప్రియ భావనతో భగవంతుని అర్చించి తరించారు. అన్నమయ్యకూడా ప్రేయసీప్రియ భావనతో శ్రీవేంకటేశ్వరుని కీర్తించి తరించిన సంకీర్తనలు అనేకం వున్నాయి.

నాయిక తన నాయకుని కలయికకోసం ఎన్నివిధాలుగా పరితపించి ఎదురుచూసిందో ఆ భావాలన్నింటిని నాయకుడు రాగానే వ్యక్తం చేస్తుంది.

నిన్ను కలవాలనే ఆశతో మేడపైకెక్కి నీకోసం చూసాను. నీవు లేకపోయే సరికి విచారం కలిగి నిట్టూర్పు విడిచాను. వేంకటేశా! ఇంతవరకూ ఎక్కడ ఉన్నావు నీవు దప్పికతో వున్నావని నీకు కర్పూరం ఇచ్చాను. అధికమైన నీ విరహంతో దాన్ని నిప్పు అనుకొని భ్రమపడ్డాను. నిండుగా పుష్పించిన చెట్టుపై గండుకోయిలకూస్తే అదినిండైన నీస్వరం అనుకొని దగ్గరకు రమ్మని పిలిచాను. పట్టుచీర కొంగుజారి గుట్టుగా నేనుంటే ఊరకే ఎందుకునవ్వుతావు నీవు సమర్ధుడవు మేము నీఅంతవాడం కాము అని అతని సరసాన్ని. గొప్ప తనాన్ని కీర్తిస్తుంది తన ప్రియునిపై ఉన్న అనన్యప్రేమను గూర్చి తెలియ జేస్తూ నీకోసం వలచిన వలపులు నా మనసులో పులకలు రేగాయి. దీన్ని మాటల్లో చెప్పలేను. ఇది లోకానికంతా తెలిసిందే నా యౌవ్వనాన్ని నీకే అర్పించాను. నీవు నన్ను వదలకుండా మా యింట్లోనే వుండు. ప్రతిసారి నీవు చేసిన ప్రమాణ వాక్కులనే నమ్మి వున్నాను. అలముకున్న చీకట్లు మాయమయ్యేలా నాపై నీకరుణను కురిపించరా అని అపారమైన ప్రేమను వ్యక్తంచేస్తుంది.

## దేసాళం

మేడలెక్కి నిన్నుజూచి కూడేననె యాసతోడ
వాడుదేరి వుస్సురందురా వేంకటేశ
యాడనుంటి విందాకాను రా॥

దప్పిగొంటి వనినీకు కప్పురముపారమిచ్చి
ముప్పిరి నీ విరహానను వేంకటేశ
నిప్పనుచు భ్రమసితిరా॥

నిండపూచిన మానిపై గండు కోవిల కూయగా
నిండిన నీ యెలుగంటాను వెంకటేశ
అండకు నిన్ను రమ్మంటిరా॥

పట్టుచీర కొంగుజారి గుట్టుతో నేనుండగా
వట్టి నవ్వు లేల నవ్వేవు వెంకటేశా
దిట్టవు నీ యంతవారమా॥

నీకు వలచిన వలపులు పులకలొత్తె నాకుదిని
వాకు ననే చెప్పజాలరా వేంకటేశ
లోకమెల్ల నెరిగినదే॥

పాయము నీకొక్కనికే చాయగా మీదెత్తితిని
యీా మెడ కైవాలకుండను వేంకటేశ
మా యింటనే పాయకుండరా॥

ముమ్మాటికీ నీబాసలే నమ్మివున్న దాననేను
కుమ్మరించరా నీ కరుణ వేంకటేశ
చిమ్ము చీకటెల్ల పాయను (13-223)

ప్రేయసి నిండు మనస్సు కలిగిన తన నాయకుడైన హరినివదలి ఇంకనిలువలేనని, విరహబాధతో తమ్ముల్ని అన్నల్ని, అక్కల్ని, తల్లుల్ని ఇంకా ఇరుగు పొరుగువారిని అందరిని పిలచి పద్మనేత్రుడైన హరిని వదలి నిటూర్పుచెందుతూ ఉండలేను. అందమైన హరిని స్మరించుకుంటున్న నేను కన్నీరు ఆపుకోలేక పోతున్నాను. అనుకూలమైన శ్రీవేంకటేశ్వరుని వదలి స్త్రీగా ఇంక జన్మించలేను అని నాయకునిపై తనకున్న ప్రేమను వ్యక్తంచేసుకొంటుంది.

## కాంభోది

తమ్ములాల అన్నలాల తల్లులాలనే
నెమ్మనపు హరి బాసి నిలువలేని కన్ను॥

కొమ్మలాల మరుకోట కొమ్మలాల వో
యమ్మలాల తొలరె నాయకక్కలాల
తమ్మిరేకు కన్నుల యాతని బాసినే
నుమ్మల సొమ్ముల చేత నుండలేనికను॥

చెలులాల కలికి తొయ్యలు లాలవో
యెల జవ్వనముల మోహినులాల

చెలువంపు హరి తలచిన నాకు నే
నులుకు కన్నీరాపకుండా లేనిక ను॥

బోటులాల జవ్వనపు మేటులాలవో
గాటపు తురుముల చీకటులాల
వాటమైన శ్రీవేంకటేశ్వరు బాసినే
నాటదాననై జన్మ మందలేనిక ను॥ (12-99)

## 1. 12. సుప్రసిద్ధ జానపద బాణీలు

**అన్నమయ్య** హరిభక్తిని, జ్ఞానాన్ని జానపదులకు కూడా సులభంగా తెలియజేయడం కోసం వారు పాడుకొనే అనేకరకాల జానపద గేయరీతుల్లో సంకీర్తనలు రచించాడు. మేలుకొలుపు, సువ్వి, అల్లోనేరేళ్ళు గొబ్బిపాటలు జాజర పాటలు, సోదిపాటలు, తాత్త్వికగేయాలు, తందాన, దశావతార, ఏల, కోలాట, చందమామ, శోభన, హారతి, నివాళి, ధవళ, ఉయ్యాల, లాలి, జోల, మంగళగీతాలు, బాలక్రీడా సంకీర్తనలు, దివ్యనామ సంకీర్తనలు, వృత్తి సంకీర్తనలు, వృత్తి ఉత్సవ కీర్తనలు, వైవాహిక గీతాలు మొదలైన సంకీర్తనలు అనేకం కనిపిస్తాయి.

**అన్నమయ్య** బాలబాలికలు ఆడుకునే పాటలరీతిలో కూడా కొన్ని సంకీర్తనలు రచించాడు బాలలు కోతికొమ్మంచ్చు లాటలాడేటప్పుడు ఒక బాలుడు చెట్టుపైకెక్కి గుబురుగానున్న కొమ్మల ఆకుల మధ్య దాగుకుంటాడు. అప్పుడు ఆబాలుని తక్కిన బాలులు కనుక్కొని వాలి బాలుడు కొంచెం కనిపించగానే అదిగో బాలుడు, అగ్గొగ్గో, గూగూకు అని వేగంగా ఉచ్చరించేటప్పుడు ఇది కూగూగుగా స్థిరపడింది. ఈపదాన్ని ఆవృత్తిపదంగా తీసుకొని అన్నమయ్య ఒక జానపద బాణీ రచించాడు. చిన్నికృష్ణుని అన్నమయ్య గురుతెరిగిన దొంగ అని గుడిలోనే దాగివుంటాడని, గోపికలు కొలనుదగ్గర జలకాలాడుతుంటే వారి వస్త్రాలను దొంగిలించాడని, ఉట్లమీద పాలను ఆరగించిన మితిమీరిన దొంగ అని, కోవిదుడైన దొంగ అని అన్నమయ్య జానపద బాణీల్లో వర్ణించాడు.

శంకరాభరణం

గురుతెరిగిన దొంగ కూగూగు పిడె
గురిలోనే దాగిని కూగూగు॥

నెలతల దోచీ నీళ్ళాడగానే
కొలని దరిని దొంగ కూగూగు
బలువైన వుట్ల పాలారగించీని
కొలది మీరిన దొంగ కూగూగు॥

చల్లత మ్మగ చనుకట్టు వెడకీసి
గొల్లెతలను దొంగ కూగూగు
ఇల్లిల్లు దప్పక యిందరి పాలిండ్లు
కొల్లలాడిన దొంగ కూగూగు॥

తావుకొన్న దొంగ తగిలి పట్టుడిదె
గోవులలో దొంగ కూగూగు
శ్రీవేంకటగిరి చెలువుందో యేమొ
కోవిదుడగు దొంగ కూగూగు॥

## 1.13. అన్నమయ్య సంకీర్తనల్లో సాహిత్యంపై వెలువడిన సుప్రసిద్ధ సాహితీ మూర్తుల ప్రశంసలు

అన్నమయ్య సంకీర్తనలు మానవ జీవితాన్ని చరితార్థం చేసుకోవడానికి ఉపయోగపడే సాధనాలు. అలాంటి సంకీర్తనలు మహనీయులచే వేనోళ్ళ కీర్తించబడ్డాయి అన్నమయ్య సంకీర్తనల్ని పరిష్కరించిన సంగీత సాహిత్యకళానిధి శ్రీ రాళ్ళపల్లి అనంతశర్మగారు "అదొక సారస్వత క్షీరసాగరం. కావ్య మూలధర్మమైన భావార్జన లోశైలితో భావవైవిధ్యంలో, రాశిలో అన్నమాచార్య రచనను మించినది ఆంధ్రవాఙ్మయంలో ఇంకొకటి లేదు. నగుబాట్లు పాలైన ద్విపద, పదకవితలను ఉద్ధరించి ఉన్నతస్థాయిని కలిగించిన ప్రతిష్ఠ అన్నమాచార్యునిదే" అని ప్రశంసించారు.

అన్నమయ్య సంకీర్తనలకు విశ్వవిద్యాలయ స్థాయిలో పాఠ్యాంశ బోధన, పరిశోధన అవకాశాన్ని కలిగించిన ఆనాటి శ్రీవేంకటేశ్వ విశ్వవిద్యాలయం, తెలుగు అధ్యయన శాఖాధ్యక్షులు ప్రిన్సిపాల్. వైస్‌చాన్సలర్ ప్రఖ్యాత భాషా శాస్త్రవేత్త అయిన ఆచార్య జి. యన్. రెడ్డిగారు అచ్చమైన దేశీయమైన సంగీత సాహితం భాషా సంపన్నమైన అన్నమయ్య వాఙ్మయం తెలుగు సాహిత్యంలో, అద్వితీయ భారతీయ సాహిత్యంలో అపురూపం ప్రపంచ సాహిత్యంలో అత్యద్భుతం. బహుముఖ ప్రజ్వలమై బహువిధ కాంతుల్ని నవనవోన్మేషంగా ప్రసరించే అన్నమయ్య కృతులు పరిశోధకుల పాలిట బంగారు గనులు" అని పేర్కొన్నారు.

ప్రఖ్యాత సాహితీవేత్త శ్రీ ఆరుద్రగారు మనకున్నవి సప్తసాగరాలే అయినా అన్నమయ్య సాహిత్యం అష్టమ సముద్రం. అందులో ఈదులాడ గలగడం అదృష్టం. అన్నమయ్య తమిళ భాషలోని మధుర భక్తినంతా అనుభవించి తత్తుల్యమైన గేయాలను తెలుగులో వ్రాయాలనుకొని ప్రపంచంలోని ఏ మొదటిరకం కవిత్వానికీ తీసిపోని రచనలు చేసారు. తమిళంలో కవిత్వంఅంటే పాటలే వాటికి సాహిత్య గౌరవంవుంది. అన్నమయ్య సంకీర్తనలను ఉత్తమ సాహిత్యం అనకపోతే అననివాళ్ళదే లోపం అని పలికారు.

జ్ఞానపీఠ్ అవార్డ్ గ్రహీత, పద్మభూషణ్ డా॥ సి. నారాయణరెడ్డిగారు ప్రజలకు సన్నిహితంగా వెళ్ళి ప్రజల భాషలో పదాలు రాసిన అన్నమయ్య పదిహేనవ శతాబ్దంలోనే గొప్ప ప్రజాకవి అయ్యారు. జీవద్భాషలో కవిత చెప్పడం అయినా తెలుగువారికి నేర్పాడేమో! ఆనాడు నన్నయ్య, ఆ తర్వాత అన్నమయ్య సాహిత్యరంగంలో విప్లవకారులు, ఆ తర్వాత దేశభాషవైపు దృష్టిసారించిన నన్నయ్యను, అన్నమయ్యను తెలుగుజాతి మరువబోదు.

అన్నమయ్య కీర్తనలన్నీ రమణీయ కవితాధారలే. నర్సరీరైమ్స్ మన సంస్కృతి కాదు, అన్నమయ్య కృతులే మన సంస్కృతి అని అభినందించారు

సరస్వతీ పుత్ర శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యుల గారు తెలుగు పదాలను జోడించడంలో తిక్కన్నకు కుడిచేయి అన్నమయ్య భావనా ప్రపంచంలో విశృంఖలాలుగా తిరిగాడు. అన్నమాచార్యులను తిక్కన్న తీరి

పారికూడా చూడలేము. అతని చేతిలో భాష మైనంవలె వంగును. ఆ కవి ఒక్కొక్క భావం ఒక్కొక్క నందనవనం అన్నమయ్యలో కవిత్వాన్ని వెతకడం సముద్రానికి ఏతవెత్తడం. అది సర్వాంగీణమైన చక్కెరబొమ్మ ఎక్కడ తీపిగా నుండదు, అని తెలిపాడు.

ప్రఖ్యాత సాహితీవేత్త ఆచార్య జి వి సుబ్రహ్మణ్యంగారు—
మల్లెపూల కంటె మెత్తనైన మాటలు, మకరందం కంటే మధురమైన భావనం, నవనీతం కంటే మృదువైన అభివ్యక్తి, అమృతం కంటె రుచి అయిన భావనాను రక్తి అన్నమయ్య సంకీర్తనల్లో అమృతవర్షిణిగా జాలువారుతుంటాయి అని ప్రశంసించారు.

సుప్రసిద్ధ సాహితీవేత్త ఆచార్య కె. సర్వోత్తమరావుగారు—
అన్నమయ్య సాహిత్యం పరిచయ్యం లేని వాడు అజ్ఞాని. తాళపాక సాహిత్యాన్ని తలవనివాడు అపరిశోధకుడు. పదకవితా సౌందర్యానికి ముగ్ధుడు కానివాడు, పరమ మూర్ఖుడు, అరసికుడు, అని తెలిపారు,

## 1. 14. అన్నమయ్య ఇతర రచనలు

తాళ్ళపాక అన్నమాచార్యులు సంస్కృతాంధ్ర భాషల్లో సంకీర్తనలు రచించడమేకాక ఇతర ప్రక్రియా కావ్యాలనుకూడా రచించిన ప్రతిభాశాలి, అన్నమయ్య సంస్కృతంలో వేంకటాద్రి మహత్యం, సంస్కృత సంకీర్తన లక్షణం, ద్విపదరామాయణం, శృంగార మంజరి. పన్నెండు శతకాలు రచించి శ్రీవేంకటేశ్వరునికి అంకితమిచ్చాడు వీటిలో నేడు ఒక్క శతకం శృంగార మంజరి, 15వేల శృంగార అధ్యాత్మ సంకీర్తనలు మాత్రం లభిస్తున్నాయి. ఈ విధంగా అన్నమయ్య తాను జీవించిన 95 సంవత్సరాల కాలన్ని స్వామి సేవలో, సాహిత్య సేవలో సద్వినియోగం చేసుకున్నాడు. తనతర్వాతి కుటుంబస్థులకు, ఇతర వాగ్గేయకారులకు ఈలోకానికి ఆదర్శ మూర్తి అయ్యాడు కలియుగాంతం వరకు ఎల్లప్పుడూ ఆరాధించబడుతూనే వుంటాడు.

# సింహావలోకనం

ఈ విధంగా అన్నమయ్య సంకీర్తనల్లో సాహితీ విశేషాలు అనే వ్యాసంలో అన్నమాచార్య సంకీర్తనలపై వెలువడిన వివిధ పరిశోధనలు, అన్నమయ్య సంకీర్తనలు విశ్లేషణ, అన్నమయ్య ఆధ్యాత్మ సంకీర్తనల్లో హరిభక్తి ప్రబోధం, జ్ఞానప్రబోధం, మానవత్వ ప్రబోధం, దురాచారాల్ని ఖండించడం, వర్ణనలు, ఆత్మప్రబోధం, అన్నమయ్య వినయశీలం, అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో ప్రేయసీప్రియ సౌందర్యవర్ణన ప్రేయసీప్రియుల ప్రేమవర్ణన, సుప్రసిద్ధ జానపద బాణీలు, అన్నమయ్య సంకీర్తనా సాహిత్యంపై వెలువడిన సుప్రసిద్ధ సాహితీమూర్తుల ప్రశంసలు అన్నమయ్య ఇతర రచనలు మొదలైనవి వివరించడం జరిగింది.

పునశ్చరణ తరగతులు

12-2-2000

పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

బొమ్మూరు.

# అన్నమయ్య సంకీర్తనల్లో చారిత్రకాంశాలు

అన్నమాచార్యులు రాయలసీమలోని కడప జిల్లా, రాజంపేట తాలూకా లోని తాళ్ళపాక అనే గ్రామంలో 1408 సం॥లో లక్కమాంబ, నారాయణసూరి అనే దంపతులకు జన్మించారు. శ్రీవేంకటేశ్వర వరప్రసాది అయిన అన్నమయ్య 32 వేల శృంగార, అధ్యాత్మ సంకీర్తనల్ని రచించి ఈలోకానికి అందించారు. ఇతని జీవితకాలం 1408–1503 తిరుమల తిరుపతి దేవస్థానంవారి కృషివల్ల, శ్రద్ధాసక్తులవల్ల అన్నమయ్య సంకీర్తనలు నేడు సుమారు 15 వేలు వరకు లభించాయి. భక్తి, జ్ఞాన, వైరాగ్య విలసితమైన అన్నమయ్య సంకీర్తనలు నేడు విశ్వమంతటా వ్యాపిస్తున్నాయి. మానవాళికి ఆనందాన్ని, ఆదర్శాన్ని, జీవన్ముక్తిని ప్రసాదిస్తూ అలరిస్తున్నాయి

అన్నమయ్య సంకీర్తనల్ని పరిశీలించేసరికి ఎన్నో అంశాలు వ్యక్తమవుతూవుంటాయి. ఎన్నో చారిత్రక సత్యాలుకూడా తెలుస్తుంటాయి. అన్నమయ్య మనుమడు తాళపాక చిన్నన్న అన్నమాచార్య జీవిత చరిత్రను ద్విపదలో రచించారు దీన్నిబట్టి కూడా అన్నమయ్య కాలంనాటి చారిత్రక సంఘటనలు తెలుస్తాయి. అన్నమయ్య సంకీర్తనల ప్రసిద్ధిని గూర్చి ఆనాటి కడప మండలాధిపతి అయిన సాళువ నరసింగరాయులు అన్నమయ్యను. తన ఆస్థానానికి పిలిపించి ఒకకీర్తన పాడమనికోరారు. అప్పుడు అన్నమయ్య పద్మావతి వేంకటేశ్వరుల ప్రణయ వర్ణనకు సంబంధించిన.

"ఏమొకొ చిగురుటధరమున యెడనెడ కస్తూరి నిండెను
భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదుగదా" అనే కీర్తనను విని

కవులుకూడా వర్ణించలేవని సాళువనరసింగరాయలు ప్రశంసించినట్లు అన్నమాచార్య చరిత్రవల్ల తెలుస్తుంది.

"తవిలి యెన్నినఁ గాళిదాసాదులైన
కవులందుఁ దక్కిన కవులందు నిట్టి
కవితయు నిట్టి శృంగార భావంబు
వివరింపఁ గంటిమే వింటిమే మున్ను (పుట. 34)

అన్నమయ్య సాళువనరసింగరాయల కోరికను తిరస్కరించిన విషయం—

"హరిముకుందునిఁ గొనియాడు నాజిహ్వ
నినుఁ గొనియాడగ నేరదెంత్తైన" (పుట 37)

అనే ద్విపద పంక్తుల్ని బట్టి తెలుస్తుంది. సాళువనరసింగరాయలు అన్నమయ్యకు "మూరు రాయరగండ" అనే సంకెల బిగించి చెఱసాలలో పెట్టిన విషయం—

"... ... ...మూరు రాయరగండ
సంకెలనిడి మొగసాలలో నిడుడు" (పుట 37)

అనే పంక్తుల్ని బట్టి తెలుస్తుంది. అన్నమయ్య శ్రీవేంకటేశ్వరుని ప్రార్థించి సంకెలనుంచి విముక్తుడైన విషయం...

'సంకెల నిడు వేళఁ జంపెడు వేళ
నంకిలి ఋణదాత లాఁగెడు వేళ
వదలక గతిగాని
వనమాలి యతడే నావగపెల్ల నుడుపు (పుట 38)

అనే పంక్తుల్ని బట్టి తెలుస్తుంది రాజాశ్రయంలో బ్రతకడం, రాజుల్ని సేవించడం ఎంతబాధాకరమో—

'నరుల బొగడు జీవనముకన్నా చెట్టుగనో
మృగముగనో పుట్టుటమేలు'

'తావులేలే రాజులకు దయకొంత పుట్టదాయు
కావరమే ఘనమాయి'

'అడవిలో మృగజాతియైన కావచ్చుకాక
విడనితరుల కొలువగ వచ్చునా'

అనే సంకీర్తనల్ని బట్టి తెలుస్తుంది. ఒకసారి ఇంట్లోగానీ, లేక ప్రయాణ సమయాల్లోగానీ పూజా విగ్రహాలు కనబడనప్పుడు అన్నమయ్య ఎంతో దుఃఖించినట్లు—

అనే సంకీర్తనను పాడివినిపించాడు. సాళువనరసింగరాయలు ఆ పాట విని పరవశుడై తనమీద కూడా ఇలాంటి కీర్తన వ్రాయమని కోరినప్పుడు అన్నమయ్య—

"నరహరి కీర్తన నానిన జిహ్వ
ఒరుల నుతింపగ నోపదుజిహ్వా" అంటూ తననాలుక

శ్రీహరినే కీర్తిస్తుంది కానీ ఇతరులను కీర్తించదు అని నిరాకరించారు. అప్పుడు రాజు కోపోద్రిక్తుడై అన్నమయ్యకు "మూరురాయడగండ" అనే సంకెలను బిగించినప్పుడు అన్నమయ్య—

ఆఁకటివేళల నలపైన వేళను
తేఁకువ హరినామమె దిక్కుమరిలేదు

సంకెల బెట్టినవేళ చంపబిలిచిన వేళ
అంకిలిగానప్పుల వారాగినవేళ
వేంకటేశు నామమె విడిపించ గతికాక

మంకుబుద్ధి పొరలిన మరిలేదు తెఱగు

'నీదాసుల భంగములు నీవు చూతురా
యెదరి చూచేవు నీకు నెచ్చరించవలెనా' అనే సంకీర్తనల్ని స్వామివారిపై పాడి బంధవిముక్తుడయ్యాడు. ఈ సంఘటన ఈసంకీర్తనల ద్వారానే కాక అన్నమాచార్య జీవితచరిత్ర ద్వారాకూడా తెలుస్తుంది.

'చెలులార వేంకట శిఖరి నాయకుని
కలికికిఁ గడగంటఁ గనుపట్టు నెఱుపు
చెలువ మేగతి నుంజెప్పరే' యనిన

'నలువునఁ బ్రాణేశు నాటిన చూపు
నిలువునఁ బెఱుక నూనిన శోణితంబు
తలపోయఁ గాదుగదా' (పుట. 36)

అనేభావంతో కూడిన సంకీర్తనే 'ఏమొకొ చిగురుటధరమున' అనే సంకీర్తన, శ్రీవేంకటేశ్వరుని కలసిన పద్మావతి అధరాలపై అంటుకున్న కస్తూరి దృశ్యం ప్రియుడికి ప్రియురాలు వ్రాసిన లేఖలాగా ఉందని, ఆమె కన్నుల తుదలు ఎర్రగా ఉండటానికి కారణం స్వామివారిపై గుచ్చుకున్న ఆమె చూపుల బాణాల్ని వెనుకకు లాగుకునేటప్పుడు రక్తంచింది. అక్కడ అంటుకున్నదని అందువల్ల ఆమె కన్నులు ఎరుపెక్కిందని అన్నమయ్య వర్ణించిన విధం కాళిదాసాది కవుల్లోకూడా కనిపించదని రాయలు మెచ్చు కున్నారు. అలాగే పూజ విగ్రహాలు పోయినట్లు

"నీవు నా సొమ్మువు నేను నీ సొమ్ము
యీవల నీవెపుడు మాయింట నుండఁ దగవా'

అనే సంకీర్తనను బట్టి తెలుస్తుంది పూజా విగ్రహాలు ఎలాగో తిరిగిలభించి న్నపుడు అన్నమయ్య ఎంతో సంబరపడినట్లు–

'కంటిమి నేఁడిదెగరుడా చలపతి
యింటి వేలుపగు నీశ్వరుఁడితఁడు' అనే సంకీర్తనను బట్టి

తెలుస్తుంది. 1472–74 సం॥ మధ్య అన్నమయ్య జీవితకాలంలో ఒకసారి పెద్ద కరువు కాటకాలు సంభవించి ప్రజలు దుర్భర జీవితాన్ని గడిపినట్లు-

'కడునజ్ఞానపు కరువు కాలమిదె
వెడలదొబ్బి మా వెరపు దీర్పవే' అనే సంకీర్తనను బట్టి

తెలుస్తుంది ఆకరవు కాటకాల ప్రభావం 1474 మన్మథనామ సం॥లోకూడా కనిపించడం, ప్రజల కష్టనష్టాలకు గురికావడం మొదలైన చారిత్రకసత్యాలు

చింతల చిగురులె చిచ్చులట
యింతటితో నింక నేలాగే

చక్కని మన్మథ సంవత్సరమున
చుక్కల రాజే సూరియుడై
యెక్కువ శాత్రుల నెండగాయునట
యెక్కడి దింక బ్రతుకే లాగే'

ఎంతో ఆహ్లాదకరంగా వుండే మన్మథనామ సంవత్సరంలో చింతల చిగురులే చిచ్చులుగా మారాయని, చంద్రుడే సూర్యుడై రాత్రుల్లో ఎంత కాస్తున్నాడని, ఇంక బ్రతకడం ఎలాగా? అని ప్రజలు భయాందోళనలు చెందినట్లు ఈ సంకీర్తనను బట్టి తెలుస్తుంది. ఈ విధంగా సారస్వత క్షీర సాగరంగా (రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ), అష్టమ సముద్రంగా (ఆరుద్ర) అన్నమయ్య కృతే మనసంస్కృతిగా (డా॥ సి. నారాయణరెడ్డి), ప్రపంచ సాహిత్యంలో అత్యద్భుతంగా (ఆచార్య జి యన్. రెడ్డి) ఇంకా ఎన్నో విధాలుగా పండితుల చేత, జనావళిచేత ప్రశంసలందుకొంటున్న అన్నమయ్య సంకీర్తనల్ని నిశితంగా పరిశీలించే కొలది ఎన్నో చారిత్రక సత్యాలు వ్యక్తమవుతాయి

తెలుగు భాషా సాహిత్యాల్లో చారిత్రకాంశాలు

యు.జి.సి. జాతీయ సదస్సు

ఆంధ్ర విశ్వవిద్యాలయం తెలుగు శాఖ

విశాఖపట్టణం

తేదీ : 30-7-2001

## 1. 1. పెదతిరుమలయ్య, చినతిరుమలయ్య సంకీర్తనల్లో భావనా చాతుర్యం

పదకవితా పితామహుడైన అన్నమాచార్యుల అడుగుజాడల్లో ఆయన కొడుకు పెదతిరుమలయ్య, ఆయన మనుమడు చినతిరుమాలా చార్యులు కూడా పయనించి శ్రీవేంకటేశ్వర స్వామివారిపై సంకీర్తనలు రచించారు. వారి సంకీర్తనల్లో కూడా ఎన్నో సాహిత్య విశేషాలున్నాయి. వారి సంకీర్తనల్లోని భావనాచాతుర్యం మనోజ్ఞంగా ఉంటుంది.

## 1. 1. పెదతిరుమలయ్య, చినతిరుమలయ్య సంకీర్తనలపై వెలువడిన పరిశోధనాంశాలు

అన్నమయ్య సంకీర్తనలపై వివిధ విశ్వవిద్యాలయాల్లో వివిధ అంశాలపై పరిశోధన జరిగినట్లే పెదతిరుమలయ్య, చినతిరుమలయ్య సంకీర్తనలపై కూడా పరిశోధనలు జరిగాయి.

# పెదతిరుమలయ్య, చినతిరుమలయ్య సంకీర్తనలపై వెలువడిన పరిశోధనాంశాలు

అంశం : పరిశోధకుడు పర్యవేక్షకులు సం॥ వి.వి

పెదతిరుమలయ్య కృతులు

సవిమర్శక పరిశీలన — ఓరుగంటి సీతారావమ్మ — జి.రెడ్డి చెన్నారెడ్డి
1979 శ్రీవేం.వి.వి

తాళపాక పెదతిరుమలాచార్యుడు

నీతిసీసశతకం - ఒకపారిశీలన టి.జె ఆర్. సంపత్‌కుమార్ - సి. రమణయ్య
పొ.శ్రీతె.వివి

తాళ్ళపాక పెదతిరుమాలాచార్యుల కృతులు

వై సూర్యకాంతం - కె సర్వోత్తమరావు 1983 శ్రీవేం.వి.వి.

పెదతిరుమలయ్య, చినతిరుమలయ్య సంకీర్తనల్లో జానపద సంస్కృతి

సి హెచ్. రాజేశ్వరి, పి. లీలావతి 1998 పొ.శ్రీతె.వి.వి

పెదతిరుమలయ్య శృంగార అధ్యాత్మ సంకీర్తనలు సుమారు 1007 వరకు లభించాయి. చినతిరుమలయ శృంగార ఆధ్యాత్మ పంకీర్తనలు సుమారు 179 వరకు లభించాయి అన్నమయ్య సంకీర్తనలు కన్నా పెద తిరుమలయ్య, చినతిరుమలయ్య సంకీర్తనలు సంఖ్యలో తక్కువ కావడం వల్ల వీరి సంకీర్తనలపై పరిశోధనలు కూడా తక్కువగా వెలువడ్డాయి.

## 1.2. పెద తిరుమలయ్య, చిన తిరుమలయ్య పరిచయం

### సంకీర్తనా రచన — ఇతర రచనలు

పెదతిరుమలయ్య అన్నమయ్యకు, అక్కలమ్మకు కలిగిన కుమారుడు, ఇతని కాలం 1458 నుంచి 1554 వరకు పెదతిరుమలయ్య తన తండ్రి అజ్ఞానుసారం సంకీర్తనా రచన చేపట్టాడు. వేంకటేశ అనె ముద్రతో శ్రీవేంకటేశ్వర స్వామివారిపై శృంగార, అధ్యాత్మ సంకీర్తనలు రచించాడు. తిరుమల తిరుపతి దేవస్థానంవారి కృషివల్ల పెదతిరుమలయ్య శృంగార అధ్యాత్మ సంకీర్తనలు ప్రస్తుతం 1007 వరకూ లభిస్తున్నాయి.

పెదతిరుమలయ్య సంకీర్తనలే కాక వేంకటేశ్వర వచనాలు, వేంకటేశ్వరోదాహరణం, వేంకటేశ్వర ప్రభాతస్తవం, (ద్విపద), శృంగార దండకం, శృంగార వృత్త శతకం, నీతిశస శతకం, చక్రవాళ మంజరి, సుదర్శన రగడ, భగవద్గీత తెలుగు వచనం, రేఫఱకార నిర్ణయం (లక్షణ గ్రంథం) మొదలైన గ్రంథాల్ని రచించాడు. ఈ గ్రంథాల్ని తిరుమల తిరుపతి దేవస్థానం వారు ముద్రించారు. పెదతిరుమలయ్య ఈ గ్రంథాలే కాక ఆంధ్ర వేదాంతం, ద్విపద హరివంశ, సంకీర్తన లక్షణ వ్యాఖ్య మొదలైన గ్రంథాలు కూడా రచించినట్లు తెలుస్తుంది. కానీ ఈ గ్రంథాలు నేడు లభించడం లేదు.

ఈ విధంగా అనేక ప్రక్రియల్లో కావ్యాలు, గ్రంథాలు రచించిన శ్రీవేంకటేశ్వర పరమభక్తుడైన పెదతిరుమలయ్యకు శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్య, శ్రీ రామానుజ సిద్ధాంత స్థాపనాచార్య వేదాంతాచార్య కవితార్కిక కేసరి, శరణాగత వజ్రపంజర మొదలైన బిరుదులున్నాయి. తెనాలి రామకృష్ణుడు తాళ్ళపాక కవులపై చెప్పిన

చిన్నన్న ద్విపద కెఱగును
పన్నుగ పెద తిరుమలయ్య పదమున కెరగున్
మిన్నంది మొరసె నరసింగన్న కవిత్వము
పద్య గద్య కవిత్వ శ్రేణిన్

అనే పద్యంలో పదరచనకు పెదతిరుమలయ్యను పేర్కొనడం విశేషం. చినతిరుమలయ్య పెదతిరుమలయ్యకు జన్మించిన పెద్దకుమారుడు చినతిరుమలయ్య కూడా తన తాత, తండ్రి నడచిన వేంకటేశ్వర భక్తి మార్గంలో నడచి శ్రీవేంకటనాథ ముద్రతో శృంగార అధ్యాత్మ సంకీర్తనలు రచించాడు. తిరుమల తిరుపతి దేవస్థానంవారి కృషివల్ల నేడు 179 సంకీర్తనలు లభిస్తున్నాయి. చినతిరుమలయ్య సంకీర్తనలే కాకుండా తెలుగు సంకీర్తన లక్షణం, అష్టభాషా దండకం, అనే గ్రంథాలు రచించాడు. సంస్కృతం, ప్రాకృతం, పైశాచీ, ప్రాచీ, శౌరసేనీ, అవంతి, మాగధీ, సార్వదేశీ అనే అష్టభాషల్లో అష్టభాషా దండకాన్ని రచించి అష్టభాషా చక్రవర్తి అనే బిరుదు గాంచాడు చినతిరుమలయ్య 1562 వరకు జీవించాడని ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారు తమ సిద్ధాంత గ్రంథంలో పేర్కొన్నారు.

## 1.2. పెదతిరుమలయ్య, చినతిరుమలయ్య సంకీర్తనల్లో అన్నమయ్య ప్రశంస

తాళ్ళపాక కవులు వ్యక్తిగతంగా, కుటుంబ పరంగా, శ్రీవేంకటేశ్వర భక్తిపరంగా, సాహితీ రచనల పరంగా పరస్పరం అన్యోన్యంగా, ఆదర్శం, గౌరవంగా, జీవితం గడిపి లోకానికి ఆదర్శ కవి కుటుంబస్థులయ్యారు.

అన్నమయ్య కొడుకు పెదతిరుమలయ్య, అన్నమయ్య మనుమడు చినతిరుమలయ్య తన సంకీర్తనల్లో అన్నమయ్యను తమ సర్వస్వంగా భావించారు. అన్నమయ్య సంకీర్తనలను ఎంతో ఆప్యాయంగా దివ్యంగా కీర్తించారు.

పెదతిరుమలయ్య తన తండ్రి అన్నమయ్య సంకీర్తనల మహిమాతిశయాలను గూర్చి దేవతలకు, మానవులకు వినేకొలదీ ఆశ్చర్యకరంగా వుంటాయి చక్కెర రుచిచూపిస్తాయి. పరిమళపు చెట్టై సువాసనల్ని వెదజల్లుతాయి. అద్భుతమైన అతని వాక్కులు వజ్రాలై మెరుస్తాయి మరకలేని సచ్ఛమైన అద్దాలై మా నిలువు నీడలు చూపుతాయి. (ఆత్మసాక్షాత్కారం కలిగిస్తాయనే అర్థంకావచ్చు) పన్నీరై తనువుపై పూస్తాయి. కర్పూరమై చల్లదనం కలిగిస్తాయి. మేలైన ముత్యాలై శరీరం నిండుతాయి. అంగరక్షకులై మా వెంటను తిరుగుతాయి ఉపసిషత్తులై నిరంతరం దర్శనమిస్తాయి పుట్టుకతోనే గురువులై బోధిస్తాయి శాశ్వతమైన వరాలిచ్చే శ్రీవేంకటేశ్వరుని సులభంగా మెప్పిస్తాయి. అని స్తుతించిన పితృభక్తి పరాయణుడు పెదతిరుమలయ్య.

సురులకు నరులకు సారిది వినవిన
నరుదు తాళ్ళపాక అన్నమయ్య పదములు

చక్కెరై చవిచూపీ జాలై తావిచల్లీ
నక్కజపు మాతు వజ్రాలై మెరిసీని
పన్నీరై పైపూసీ కప్పంబై చలువరేచీ
వెన్ను బలములై మా వెంట తిరిగీని
పుట్టుతోనే గురువులై బోధించీని॥

చినతిరుమలయ్య తన సంకీర్తనల్లో తనతాత అన్నమయ్య అందరికీ తండ్రిఅయిన శ్రీవేంకటేశ్వరుని వరప్రసాదిఅని, శ్రీహరిని తనమనస్సులో నిలిపిన వాడని, సనక సనందనాది ఋషులంతటి వాడని, శ్రీహరిపై గొప్ప ధ్వజాలుగా అనేక సంకీర్తనలు రచించిన వాడనీ, విందు భోజనంలాగ తన మనస్సుకు అహ్లాదంగా శ్రీవేంకటేశ్వరుని తనకు తెలియజేసిన వాడనీ

అప్పని వరప్రసాది అన్నమయ్య
అప్పనము మాకే కలదన్నమయ్య॥

అంతటికీ నేలికైన అదినారాయణు తన
యంతరంగాన నిలిపీ నన్నమయ్యా

సంతసానం చెలువొందె ననక సనందనాదు
లంతటివాడు తాళ్ళపాకన్నమయ్యా॥

బిరుదు టెక్కెములుగా పెక్కు సంకీర్తనలు
హరిమీద విన్నవించె నన్నమయ్యా

వివివి గలిగినట్టి వేదముల యర్థమెల్లా
ఆరసి తెలిపినాడు అన్నమయ్య॥

అందమైన రామానుచార్య మతమున
అందుకొని నిలిచినాడన్నమయ్యా
విందువలె మాకును శ్రీవేంకటనాథునిచ్చె
అందరిలో తాళ్ళపాకన్నమయ్యా॥ 16-23)

అన్నమయ్య తనకు దేవుడని, శ్రీహరిని తెలుసుకునే మార్గం చెప్పాడని, గురువు అని, బుద్ధిహీనుడైన తనకు బ్రహ్మోపదేశం చేసి చెడిపోకుండా కాపాడిన పరమ బంధువని, తనకు తల్లిగా, తోడునీడగా ఉండి చిల్లరమాయల్లో పడకుండా కాపాడినవాడని, దాతగా ఉండి శ్రీవేంకటేశ్వరుని తన తలపుల్లో నిలిపాడని, ఏవైపు చూచినా తనకు ఏడుగడ అన్నమయ్యే అని తనకు అన్నమయ్యమీదున్న గౌరవాభిమానాలను వ్యక్తం చేసాడు

తాళ్ళపాకన్నమాచార్య దైవమవు నీవుమాకు
వేళమె శ్రీహరిగనే వెరదాన తిచ్చితివి॥

గురుడవు నీవెసుమ్మీ కుమతినైన నాకు
సరవి బ్రహ్మోపదేశము సేసితి
పరమ బంధుడవైనా పరికింప నీవెసుమ్మీ
వరుసనే చెడకుండా వహించుకొంటివి॥

తల్లివైన నీవె సుమ్మీ తగిన విషయాలలో
పల్లదాన బడకుండా బ్రతికించిపి
అల్లుకొని తోడునీడవైన నీవెసుమ్మీ
చిల్లర మాయలోన చెడకుండా చేసితి॥

దాతవు నీవేసుమ్మీ తగు శ్రీవేంకటనాథుఁ
నాతలఁపులో నిలిపి నమ్మ జేసితి
యేతల జూచిన నాకు నేడుగడయూ నీవె
అతల నీతల నన్ను నాడుకొని కాచితి॥ (16-33)

అన్నమయ్య తనకు గొప్ప హితోపదేశకుడని, పరమదయాళువని పచ్చి తామసులైన తమను శుద్ధ సాత్వికులుగా చేసాడని. తమ కులంలో ఎప్పుడూలేని వైష్ణవమతాన్ని అనుగ్రహించాడని, ఎన్నో పాపకృత్యాలు చేసిన తమను పుణ్యమూర్తులుగా మార్చాడని, ఏజన్మలోనూ దొరకని సంకీర్తనా పద్ధతిని ఉపదేశించాడని, అజ్ఞానులైన తమను వివేకవంతులుగా చెసి కష్టాలన్నీ పొగొట్టాడనీ, ఎప్పుడూ చూడని శ్రీవేంకటనాథుని ఎడబాటు లేకుండా తమకు ఇచ్చాడని అదిఎంతో చిత్రమని, చోద్యమని, అరుదు అని తన ఆశ్చర్యాన్ని వ్యక్తం చేసాడు.

ఎట్టి హితోపదేశకుడెటువంటి దయాళువు
అట్టెతాళ్ళపాకన్నమాచార్యులు॥

పచ్చి తామసుల మమ్ము పరమ సాత్వికులుగా
ఇచ్చటనె నేసినాడు యెంత చిత్రము
యిచ్చగించి మాకులాన నెన్నడు లేని వైష్ణవ
మచ్చముగా కృపసేసె నన్నమాచార్యుడు॥

ముదిరిన పాప కర్మములు సేసినట్టి మమ్ము
యెదుట పుణ్యుల చేసెనెంత సోద్యము
కదిసి యే జన్మాన కానని సంకీర్తనము
అదన నుపదేశించె నన్నమాచార్యుడు॥

గడుసు దనపు మమ్ము కడువివేకులచేసి
ఇడుమలెల్లా పాపె నే మరుదు
నడుమనె యెన్నడు గానని శ్రీవేంకటనాథు
నడియాలముగ నిచ్చె నన్నమాచార్యుడు॥ (16-52)

ఈ సంకీర్తనల వల్ల చిన్నతిరుమలయ్య చిత్తశుద్ధి, కృతజ్ఞత, వినమ్రత, ఔదార్యం మొదలైన సమున్నత గుణాలు వ్యక్తమవుతాయి. చిన తిరుమలయ్య తన తెలుగు సంకీర్తనలక్షణ గ్రంథంలో అన్నమయ్య సంకీర్తనలు వేదాలని, పౌరాణిక వాదాలని, శ్రేష్ఠమైన కవిత్వమని, సరస్వతి వీణానాదాలని, సుజనులకు ఆహ్లాదం కలిగించేవి అని అనేక విధాలుగా ప్రస్తుతించాడు.

వేదంబులు పౌరాణిక
వాదంబులు వర కవిత్వ వాణీవీణా
నాదంబులు కృత సుజనా
హ్లాదంబులు తాళ్ళపాక యన్నయ పదములు

## 1.4. పెదతిరుమలయ్య, చినతిరుమలయ్య ఆధ్యాత్మ సంకీర్తనల్లో భావనా చాతుర్యం

ఈ వాగ్గేయకారుల అధ్యాత్మ సంకీర్తనల్లో కూడా శ్రీవేంకటేశ్వరుని శ్రీహరి అవతార రూప గుణ మహత్త్వాలను, భక్తి, జ్ఞాన తాత్త్వికాంశాలను భావనా చాతుర్యంతో వర్ణించే అనేకరకాల సంకీర్తనలు కనిపిస్తాయి. మంచి జన్మమనే సంసార వృక్షానికి బాగా అలొ చిసే శ్రీహరి ఫలమని, కర్మ మనే మత్త గజానికి మావటీడని, శరీరమనే స్వచ్ఛమైన రాజ్యానికి పట్టాభి షిక్తుడైన రాజుఅని, మనస్సు అనే చంద్రోదయానికి ఉప్పొంగే అనందమని జీవుడనే మేడలో అంతర్యామి అని శ్రీహరిని అద్భుత శక్తితో పెదతిరుమ లయ్య వర్ణించాడు.

భోగము నాయందు నీకు భోగివి నీవు
శ్రీగురుడ విన్నపాను చిత్తగించు నన్నను॥

చక్కని జన్మపు సంసార వృక్షమునకు
పక్కన ఫలము నీవు భావించగా
మక్కువ కర్మమనేటి మత్తగజమునకును
యెక్కువ మావటీడవు యెంచగ నీవు॥

నెట్టన దేహమనేటి నిర్మల రాజ్యమునకు
పట్టమేలు చుండిన భూపతివి నీవే
డిట్టయిన మనసనేటి తేజి గుఱ్ఱమునకు
వొట్టిన రేవంతుడవు వుపమింపనీవు॥

సంతసమైన భక్తి చంద్రోదయమునకు
దంతుల చెలగు సముద్రమవు నీవు
చెంతల శ్రీ వేంకటేశ జీవుడనే మేడలోన
అంతర్యామివి నీవు అంకెల చూడగను॥ (21-137)

శ్రీపతి దాసులు తెలుసుకోవలసిన అంశాలకు పెదతిరుమలయ్య కొన్ని దృష్టాంతాలను భావనాశక్తితో వర్ణించాడు. బంగారానికి పుట్ట పెట్టితే ప్రకాశించినట్లుగా హరిభక్తి చేత మలినం నశించి జీవాత్ముడు గొప్పవాడై వెలుగొందుతాడని, మాణిక్యానికి సానపెట్టితే ప్రకాశించినట్లు ఆచార్యుని బోధలవల్ల శిష్యుడు పుణ్యాత్ముడవుతాడని, మురికి కప్పిన అద్దాన్ని తోమితే ప్రపంచమంతా అందులో స్పష్టంగా ప్రకాశించినట్లు హరిభక్తుడు శ్రీ వేంకటేశ్వరుని సేవిస్తే కృతకృత్యుడవుతాడని, ధర్మ చిత్తుడవుతాడని పెదతిరుమలయ్య పేర్కొన్నాడు

దృష్టాంతమిది దప్పదు తెలుసుకోవలె గాని
సృష్టికి మూలమైన శ్రీపతి దాసులకు॥

పుట్టము పెట్టిన పైడి పొందుగా నెత్తుతరిగి
తటుకున వన్నెకెక్కి నటువలెనే
చిటుకన హరిభక్తి చేత మలినము మాని
మట్టున జీవాత్ముడు ఘనుడై వెలయును॥

అరయ చిట్టము గట్టినటువంటి మాణికము
సారసాన పట్టితే నుజ్వల మైనట్లు
బోరున నాచార్యుని బోధచేత నిశ్చలుడై
ధారుణిలో శిష్యుడు సంతత పుణ్యుడౌను॥

అట్టె మాగుడు కప్పిన యుద్ధము తోమితేను
గటిగా విశ్వమెల్లా ప్రకాశించి నట్లు
గుట్టున శ్రీ వేంకటేశు కొలిచి కృతకృత్యుడై
దట్టపు హరిభక్తుడు ధర్మచిత్తుడౌను॥

చాలామంది తమలోని దైవాన్ని చూడలేక ఎం తో ప్రయాసపడి సుదూర క్షేత్రాలకు వెళ్ళి రకరకాల కష్టాలు పడుతుంటారు. అదంతా అవసరం లేదని, తరించే మార్గం తనలోనే వుందని సులభోపాయాలను భావనా చాతుర్యంతో వర్ణించి చెప్పాడు. మనస్సు అనే పెద్ద విల్లుతో మాయ అనే లక్ష్యంపై జ్ఞానం అనే బాణం వేస్తే పూర్వజన్మ దుష్కర్మ లన్నీ వేళ్ళతో సహా కూలిపోయి సమస్తం తనకు గోచరిస్తుంది. మంత్రార్థం అనే మందరగిరిచే పట్టుదలతో సంసారం అనే సముద్రాన్ని పట్టుదలతో మథిస్తే హరిభక్తి అనే అమృతం పుట్టితే జననమరణాలు నశించిపోతాయి. జీవుడనే పాదులో చాలాకాలంగా మొలిచిన శ్రీ వేంకటనాథుడనే ఔషధ వృక్షంలో దయ అనే పండు పండితే కామితార్థాలు తన కైవశమవుతాయని, ఇహపర సౌఖ్యాలు చేకూరుతాయని, ప్రతిభా పాండిత్య స్ఫోరకంగా చిన తిరుమలయ్య తెలిపాడు.

దవ్వుల తెరువు మరేటికి తడబాటులు మరియేటికి
యెవ్వరు దలచిన నిదియె యిహ పరముల నొసగు॥

మనసని యెడు పెనువింటను మాయాలక్ష్యము పైని
పనివడి జ్ఞానం బనియెడి బాణం వేసినను
వెనకటి దుష్కర్మంబులు వేళ్ళతోడ పెకలిన
తన యంతనె సకలంబును తప్పక కాననగు॥

మలయుచు మంత్రార్థం బను మందరగిరి చేతను
చలమున సంసారం బను జలనిధి దచ్చినను
అలవత హరిభక్తి యనేడి యమృతము వొడమినను
పొలసెటి చావును పుట్టుగు పొడిమక బదుకనగున్॥

జీవుడని యెడి పాదున చిరకాలంబును మొలచిన
శ్రీ వేంకట నాథుండను సిద్ధౌషధ తరువు
భావింపగ తనకృప యను పండూ పండినను
కావలసిన యర్థము తనకైవస మగు కానా॥ (16-38)

చిన తిరుమలయ్య సృష్టి సహజగుణాల్ని, మానవ మనస్తత్వ నైజాలను, సకల వస్తువులను నిశితంగా పరిశీలించాడు. భావనాచాతుర్యంతో మనో గతిని వర్ణించాడు. తాను, తన శరీరం, తనవారు ఎక్కడ! వీరిని వదలి వుండలేనసె మనసు ఎక్కడ! అని తాత్త్విక చింత చేసాడు. చెట్టుపై నోరూరించే కాయలు, పండ్లు పక్వం తప్పితే ముందు కోరుకున్నవారి ఆశలు ఎక్కడుంటాయో! స్త్రీలను ప్రేమించి పులకించిన పురుషులు ఆ స్త్రీలు ముసలివారైతే ముందు వెనక తెలియనివారి వ్యామోహం ఎక్కడుం టుందో! కొత్త మెరుగులచే ఆకర్షణీయమైన వస్త్రాలు పాతబడితే ముందు అనురక్తితో అవి కావాలని కోరుకున్నవారి భ్రమలు ఎక్కడుంటాయో!

యౌవ్వనంలో కొప్పును తీర్చిదిద్దిన సింగారాలు ఆ కొప్పు పత్తి లాగా తెల్లబడితే ఆ అనురక్తి ఏమవుతుందో! పరిమళాలతో మత్తుగొల్పె పువ్వులు వాడిన తర్వాత వాటిలోని పరిమళం ఎక్కడికి పోతుందో: అని చినతిరుమలయ్య తన అద్భుత భావనాశక్తితో మనస్సు గతిని గూర్చి తెలిపాడు.

తానేడ వారేడ తనువేడ మరి తక్కిన వెల్లానేడ
మానతె ననుచు తరితీపు సేసే మనసేడ నుండునో॥

కడుదవ మానిపై నోరూరించెడి కాయలు బండ్లు పక్వము
దప్పిన
అందమగు మున్ను గోరినట్టి వారి యాసలెందుండునో
పొందున వలచి పులకించినట్టి పురుషులు సతులట్టె ముదిసితె
ముందర వెనక నెరగనియ్యాని మోహమెందుండునో॥
(16-50)

చిన తిరుమలయ్య శ్రీ వేంకటనాథునితో ప్రత్యక్షంగా తన భక్తిని, తన తాత అన్నమయ్య తనకు చేసిన ఉపదేశాన్ని భావనాచాతుర్యంతో విన్నవించు చున్నాడు. భగవంతుడు కలిగివుంటే అన్నీ కలిగివున్నట్టేనని తనకు ఆచార్యుడు తెలిపాడని కాబట్టి ఏలోకంలో ఉన్నా వదలని సొమ్ము. ఎక్కడికీ పోని ధనం, తరగని ధాన్యం, ప్రభువు, నిందలేని తోడు-నీడ, ఇల్లు వాకిళ్ళు, ఎప్పుడూ దొరకని హితుడు, ఎప్పుడూ పండినట్టే వుండే నిత్యమైన పంట, తనను రక్షించే వేంకటనాథుడని తాళ్ళపాక అన్నమయ్యగారే తనకు తెలిపాడని స్వామివారికి విన్నవించుచున్నాడు.

నీవు కలిగిన చాలు నిక్కము అన్నిగలవు
ఆవల మాయాచార్యుం డానతిచ్చెనయ్యా॥

ఏలోకమున నున్న యెడయని సొమ్ము నీవె
తాలిమి యెందు బోని ధనము నీవె
కాలము కడా తరగని ధాన్యము నీవని
ఆలించి మాగురుడిట్టె ఆనతిచ్చెనయ్యా॥

ఎందెందు తిరిగిన యేలికవు నీవె
నిందలేని యట్టి తోడు నీడవు నీవె
ముందు వెనకల నిల్లు ముంగిలియు నీవెయని
అందము దేశికుడె ఆనతిచ్చెనయ్యా॥

ఎన్నడు కలగనట్టి హితుడవు నీవె
పన్నినట్టె వుండె నిచ్చపంటానీవె
నన్నుగాచె శ్రీ వేంకటనాథుడవని తాళ్ళపా
కన్నమయ్యం గారే నాకు నానతిచ్చిరయ్యా॥ (16-46)

## 1.5. పెద తిరుమలయ్య, చిన తిరుమలయ్య శృంగార సంకీర్తనల్లో నాయికా నాయక వర్ణనలు భావనా చాతుర్యం :

అన్నమయ్య సంకీర్తనల్లో వలె పెదతిరుమలయ్య, చిన తిరుమలయ్య సంకీర్తనల్లో నాయికా నాయకులు పద్మావతీ శ్రీనివాసులే. వీరి సౌందర్యానికి, ప్రణయానికి, విరహవేదనకు సంబంధించిన భావనాచాతుర్యంతో కూడిన సంకీర్తనలు చాలావున్నాయి. పెదతిరుమలయ్య అన్నమయ్యవలె శ్రీ వేంకటేశ్వరునితో లక్ష్మీదేవి ఆత్మీయంగా సంభాషిస్తున్నట్లు సంకీర్తనలు రచించాడు. స్వామివారికి నీపై ఎంతో ప్రేమ ఉండబట్టి తటాలున నిన్ను వక్షస్థలంలో ధరించాడు. నీ నడకలు గజగమనాలని భావించి ఆ అనుబంధంతో ఇష్టపడి గజరాజును మకరిబారినుంచి రక్షించాడు. నీ కటిస్థలం చక్రంలా గుండ్రంగా ఉందని అతను చక్రాన్ని చేతిలో నిలుపుతున్నాడు నీ స్థానం నీరజమని భావించి అతను నీరజనాభుడయ్యాడు. నీ కంఠం శంఖాన్ని పోలిందని శంఖాన్ని చేతిలో ధరించాడు. నీ కేశాలు నలుపని తాను నీలవర్ణుడయ్యాడు. నీవు గిరికుచవని నిన్ను కౌగలించుకొని శ్రీ వేంకటగిరిపతి అయ్యాడు.

అని పెదతిరుమలయ్య స్వామివారు అమ్మవారిని వక్షస్థలంలో ధరించడానికి, గజరాజును రక్షించడానికి, చక్రపాణి కావడానికి, పద్మనాభుడు కావడానికి, శంఖపాణి కావడానికి, నీలవర్ణుడు కావడానికి, వేంకటగిరిపతి కావడానికి హేతువల్ని తన భావనాచాతుర్యంతో వర్ణించాడు.

### సాళంగనాట

ఎటువంటి మోహమో యింతినీపై నతనికి
తటుకున నురమున ధరియించె నిన్నును॥

కామిని నీ నడపులు గజగమనములని
కామించి నీపతి కరిఁ గాచెను

కోమలపు నీ పిరుదు చక్రభావమని
నేమమై చక్రము చేత నిలిపినాడతడు॥

నెలత నీ నిలయము నీరజ మనుచు ప్రియు
మలరి జల జనాభుఁ డాయనతఁడు
కలిగి నీ గళము శంఖము పోలుసని తా
తలచి పాంచజన్యధరుఁ డాయనతఁడు॥

నిరతి నలిమేల్మఁ గ నీకురులు నలుపని
అరుదార నీలవర్ణుఁడాయు నతడు
గిరి కుచవని నిన్ను కెరలి కౌగిటకూడె
పరగ శ్రీ వేంకటపతి యాయె నతఁడు॥ (23-1)

లక్ష్మీదేవిని కలిగి ఉండగా శ్రీహరికి సంపదలకేమి కొదువలేదని పెద తిరుమలయ్య అమ్మవారితో ప్రత్యక్షంగా ముచ్చటిస్తూ ఆమె శరీరసౌందర్యంలో ఒక్కొక్క భాగాన్ని ఒక్కొక్క గనితో అన్వయించి అద్భుత భావనాచాతుర్యంతో వర్ణించాడు ఆమె కొప్పు నీలమణులగని అని, సొగసైన సన్నని ఆమె శరీరం బంగారు అని, లేతవైన ఆమె కనుచూపులు ముత్యాలగని అని, ఆమె గోళ్ళు మాణిక్యాల గని, ఆమె వక్షస్థలం గొప్ప నిధి అని, ఆమె ఎర్రటి పెదవులు పగడాలని అని, శ్రీ వేంకటేశ్వరునితో ఇంపైన ఆమెకౌగిలి పొదరపంగని అని, ఇలాంటి ఆమెను పొందిన ఆ స్వామి భాగ్యమే భాగ్యం అని పెదతిరుమలయ్య రచించాడు.

## బౌళి

ఆది మ లక్ష్మి యతనికి కలుగగ
యీదెస సంపదలిక నేమి చెప్పేదమ్మా॥

నెలత నీ తురుమిది నిండు నీలపుగని
పలచని నీమేను పసిడిగని

మొలక నీ కనుచూపు ముత్యపు రాసులగని
యెలమి నీ పతికింక నేమి గడమమ్మా॥

వనిత నీ దంతములు వజ్రాల పుట్టుగని
ననుపు నీగోళ్ళు మాణిక్యపుగని
పెనపు నీ కుచములు పెన్నిధానములగని
యెనయు నీ పతి కింక నేమి భాగ్యమమ్మా॥

అతివ నీ కెమ్మోవి అదె పగడాల గని
రతి నీ కౌగిలి పెద్ద రసముగని
యితవైన శ్రీ వేంకటేశుడు నిన్ను కలసె
అతని రాజసమెల్లా నమరెకదమ్మా॥ (23.510)

చిన తిరుమలయ్య సంకీర్తనల్లో కూడా నాయికా నాయకులకు సంబంధించిన భావనాచాతుర్యంతో కూడిన సౌందర్య, ప్రణయ వర్ణనలు అనేకం కనిపిస్తాయి నాయిక తన నాయకుని సౌందర్యాన్ని, పరస చేష్టల్ని గూర్చి అతని చాకచక్యాన్ని గూర్చి తనచేతిలో ముచ్చటిస్తూ— అతను శ్రీకృష్ణుడు వలపుల కలగంప మన్మథునికే తండ్రి అలవాటు ప్రకారంగా ఎలాంటి స్త్రీనైనా 'వలపించుకొనేవాడని' వాసనపువ్వు. ఆతడు ఎవ్వరికీ భయపడకుండా సమాధానం చెబుతాడు. అతను ఊరులోని స్త్రీలకు విందు. ఎక్కడైనా సంబంధం పెట్టుకొని తనమేలు చూసుకునే విలాసాల మగతుమ్మెద. అందరితోను తగిన విధంగా విలాస చేష్టలు చేస్తాడు. అల్లారు ముద్దుల ప్రేమికుడు, ఎక్కడైనా అతిశయమైన ప్రీతి కలిగిస్తాడు. వనితల్ని మోహింపజేస్తాడు. అంతటి ఘనుడైన వాడు నన్ను కలిసాడు. అతని కేమిటే అని సగర్వంగా చెబుతున్నట్లు అన్నమయ్య వర్ణించాడు.

## శంకరాభరణం

**వలపుల కలగంప వానికేమి**
**వలరాజు కన్నతండ్రి వానికేమె॥**

వాడికగా తానే యెవ్వతెనైనా వలపించు
వాతని వాసన పువ్వు వానికేమి
వో డం డెందరికి నైనా వుత్తరువె దొప్పిని
వాడమగువల విందు వానికేమె॥

తగిలి యెక్కడనైనా తనమెలె చూచుకొను
వగల మగ తుమ్మిద వానికేమె
తగినట్టిందరి తోడ తరితీపులెనేను
వగకాడల్లాదు ముద్దు వానికేమె॥

యెనసి యెక్కడనైనా యిచ్చక మెనేసుకను
వనితల పెనుబాతి వానికేమె
ఘనుడు తానె శ్రీ వెంకటనాథుడు వచ్చి
వనజాక్షి సనుగూడె వానికేమె॥ (16-31)

చిన తిరుమలయ్య నాయికపై నాయకునికున్న ప్రేమను వివరిస్తూ— ప్రేమ సిద్ధించేలా మోహిస్తే ఏపని అయినా చేస్తారు లోకంలో ఎక్కడా సిగ్గూ ఎగ్గూ (నింద) గమనించరు. ఆ విధంగానే ఆమె చెబితే నీవు ఎలాంటి పని అయినా చేసావు. అని స్వామివారిని పరిహాసం చేసే కీర్తనలో స్వామివారి వెనకటి దశావతార కార్యాల్ని ధ్యానింప చేయడం ఎంతో హృద్యంగా ఉంది రాయలసీమలో కొసువానిపల్లెలో వెలిసిన శ్రీవేంకటనాథుని దర్శించినప్పుడు వ్రాసిన సంకీర్తన అని క్షేత్రముద్రనుబట్టి తెలుస్తుంది.

నాయిక చెబితే చాలు సముద్రాన్ని అయినా ఈదుతావు అనడంలో మీనావతారం, ఒద్దికగా కొండను మోయుమన్నా మోస్తావు అనడంతో కూర్మావతారం, భూమినంతా తవ్వమన్నా తవ్వుతావు అనడంలో వరాహావతారం, బహురూపాన వుండమన్నా ఉంటావు అనడంలో నరశింహావతారం, ఆమె చెబితే చాలు ఎంతైనా తగ్గమంటే తగ్గుతావు అనడంలో వామనావతారం, శత్రువుల్ని చంపమన్నా చంపుతాను అనడంలో పరశురామావతారం, తపస్సు చేయమన్నా చేస్తావు అనడంలో రామవతారం, అబద్ధాలాడమన్నా అడు

తాఫ్ఆసడలో బుద్ధావతారం(త్రిపురాసుర స్త్రీలపాతివ్రత్యాన్ని భంగంచేయడానికి వారికి మోహింపచేసే విషయంలో అబద్ధాలు చెబుతాడు) గుఱ్ఱంపై స్వారీ చేయమన్నా చేస్తాననడంలో కల్కి అవతారం ధ్వనిస్తాయి అలాంటి దశావతార మూర్తి అయిన స్వామి రక్షకుడై కలిసి వుండమన్నా తన ప్రేయసి కౌగిలిలో ఒదిగా వుంటాడన్ని చినతిరుమలయ్య భావనా చాతుర్యంతో వర్ణించాడు.

లోకంలో పురుషుడు తనకు ఏస్త్రీ అయినా బాగా ఇష్టమైతే ఆమె దగ్గరకు వెళ్ళి నీవు బావిలో దూకమన్నా దూకుతాను. మేడపైనుంచి దూకమన్నా దూకుతాను. నీవు విషమిచ్చినా తాగుతాను అని ఆమెను వశం చేసుకోవడానికి రకరకాల మాటలతో నమ్మకం కలిగించటానికి ప్రయత్నిస్తాడు. అలాంటి మనస్తత్వాన్ని స్వామికి ఆరోపించి అందులో దశావతారాల్ని నిక్షిప్తం చేయడం చిన తిరుమలయ్య భావనా శక్తికి నిదర్శనం.

## సామంతం

ఈడేర వలచితే యేపని సేయగరాదు
యెడనైనా యెగ్గు సిగ్గు లెంచేరా భూమిని॥

వనిత చెప్పితే చాలు వార్ధినైనా నీ దేవు
అనువుగా కొండ మోయుమన్నా మోచేవు
తనివొక భూమెల్లా తవ్వమన్నా తవ్వేవు
వొనర బహురూపాన నుండుమన్నా నుండేవు॥

ఇంతి చెప్పితే చాలు యెంతైనా కొంచె పడేవు
అంతలో పగల చంపుమన్నా చంపేవు
చెంతనాపె తపములు సేయుమన్నా సేసేవు
కాంత తన పనులను కావుమన్నా కాసేవు॥

## సింహావలోకనం

ఈ విధంగా ఈ వ్యాసంలో పెద తిరుమలయ్య, చినతిరుమలయ్య సంకీర్తనలపై వచ్చిన వివిధ పరిశోధనలు, పెదతిరుమలయ్య, చిన తిరుమలయ్య పరిచయం—సంకీర్తనా రచన, ఇతర రచనలు, పెదతిరుమలయ్య, చినతిరుమలయ్య సంకీర్తనల్లో అన్నమయ్య ప్రశంస, పెద తిరుమలయ్య, చినతిరుమలయ్య ఆధ్యాత్మ సంకీర్తనల్లో భావనాచాతుర్యం, పెద తిరుమలయ్య, చినతిరుమలయ్య శృంగార సంకీర్తనల్లో జానపద గేయ రీతులు మొదలైన అంశాల్ని గూర్చి పేర్కొనడం జరిగింది.

పునశ్చరణ తరగతులు

12-2-2002

పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

బొమ్మూరు.

# చినతిరుమలయ్య తెలుగు సంకీర్తన లక్షణం-పరిశీలన

## 1.1. ప్రస్తావన:

తెలుగు సాహిత్యారామంలో తాళ్ళపాక కవి కుటుంబం కల్పవృక్షం వంటిది. ఏకవి పండితకవి కుటుంబానికీ లేని ప్రత్యేకత, విశిష్టత తాళ్ళ పాక కవి కుటుంబానికి ఉంది. ఈ కుటుంబంలో అన్నమయ్య మొదలు వరుసగా నాలుగు తరాల వరకు అందరూ కవులే భక్తిజ్ఞాన సంపన్నులే. వైవిధ్య భరితమైన ఎన్నో సాహిత్య ప్రక్రియల్ని అందించినవారే అందరూ అన్నమయ్య అడుగుజాడల్లో శ్రీ వేంకటేశ్వర భక్తి మార్గంలో నడచి ఒక వైపు స్వామిసేవ, మరోవైపు సాహిత్యసేవ చేసి తరించినవారే. అన్నమయ్య తొలి సతీమణి తాళ్ళపాక తిమ్మక్క (తిరుమలాంబ) తొలి తెలుగు కవయిత్రి కావడం మరోవిశేషం. అందుకే ఎన్నో విశిష్ట లక్షణాలున్న తాళ్ళ పాక కవికుటుంబం సాహిత్యలోకానికి, భక్తజనావళికి ఆరాధ్యమయింది. ఆదర్శమయింది. తాళ్ళపాక కవుల కావ్యరత్నాలను వెలికితీసి ప్రకటించి లోకంలో విస్తృత వ్యాప్తంగావిస్తున్న తిరుమల తిరుపతి దేవస్థానం వారు, అన్నమాచార్య ప్రాజెక్ట్‌వారు శ్లాఘనీయులు, వందనీయులు.

తాళ్ళపాక అన్నమాచార్యులు సంస్కృత వేంకటాద్రి మహాత్మ్యం, శృంగార మంజరి, ద్విపద రామాయణం, పన్నెండు శతకాలు, 32 వేల శృంగార. అధ్యాత్మ సంకీర్తనలతోపాటు సంస్కృతంలో 'సంకీర్తన లక్షణం' అనే గ్రంథాన్నికూడా రచించాడు.

భరతాదులు గ్రంథంబుల
విరచించిన లక్షణములు వేంకటభూమీ
ధరవర కవితా పితామహుండేర్పరచన్ (సం ల 13)
"ధరలోఁ దాళపాక యన్నయ గురూత్తంసుండు సంకీర్తనా
పరిశుద్ధిన్ మునుజేయుఁ బూని తగనుత్పాదించెఁ దల్లక్షణం
బరుదై మించి సంస్కృతంబున" (15)

అనే పద్యాన్ని బట్టి భరతాదుల లక్షణాలకు లక్ష్యాలుగా చూపదగిన సంకీర్త

నలను అనేకంగా రచించిన అన్నమయ్య సంకీర్తనా పరిశుద్ధికోసం సంస్కృతంలో సంకీర్తన లక్షణ గ్రంథ రచించినట్లు తెలుస్తుంది.

పరమామ్నాయ సమానమై వెలయు మత్పైతామహగ్రంథమున్
వరచాటూక్తి మదీయ పుణ్యజనక వ్యాఖ్యాతమున్ వేడ్కదా
చరణాంభోరుహముల్ మదిందలంచి సచ్ఛాస్త్రజ్ఞులింపొందగా
వరుసంజెప్పెద పద్యరూపమునఁ దద్వ్యాఖ్యాను సారంబునన్ (17)

అనే పద్యంవల్ల మహోన్నతమైని వేదంతో సమానమైన తన తాతగారి సంస్కృత సంకీర్తన గ్రంథాన్ని, మనోహరమైన వాక్కులతో తనతండ్రి పెదతిరుమలయ్య రచించిన సంస్కృత వ్యాఖ్యను ఆధారంగా తాత తండ్రుల పాదపద్మాలను మనసులో తలచుకొని సచ్ఛాస్త్రజ్ఞులు సంతోషించే విధంగా వారి వ్యాఖ్యానుసారంతో, క్రమంగా "తండ్రియును మతంబున" (16) రచిస్తానని చినతిరుమలయ్య భక్తిశ్రద్ధలతో, వినయ విధేయతలతో విన్నవించుకున్నాడు. చినతిరుమలయ్య రచించిన తెలుగు సంకీర్తన లక్షణ గ్రంథంలో కందం, గీతం, సీసం మొదలైన వివిధ ఛందోరూపాలైన 71 పద్యాలున్నాయి. ఇందులోని విషయాన్ని—చినతిరుమలయ్య గావించిన అన్నమయ్య సంకీర్తనా సంస్తుతి, సంకీర్తనా శ్రుతిఫలితం, సంకీర్తనా గానఫలితం, అన్నమయ్య తెలిపిన పదసంప్రదాయాల, పదలక్షణం, భాషా నియమం, పదవైవిధ్యం, పల్లవి లక్షణం-వైవిధ్యం, పదవిశేషాలు మొదలైన విభాగాలుగా విభజించటం జరిగింది.

## 1.2. చిన తిరుమలయ్య గావించిన అన్నమయ్య సంకీర్తనా సంస్తుతి:

చినతిరుమలయ్యకు తనతాత అన్నమయ్య అన్నా, ఆతని సంకీర్తనలన్నా అపారమైన భక్తివిశ్వాసాలు, వినయ విధేయతలు వున్నాయి. తనకు అన్నమయ్య దైవమని, శ్రీహరిని కనుగొనే మార్గం చూపాడని, గురువుగా బ్రహ్మోపదేశం చేసాడని, పరమ బంధువుగా చెడిపోకుండా కాపాడు కున్నాడని, తల్లిగా చెడుమార్గంలో పడకుండా కాపాడుకున్నాడని, తోడు

నీడగా చిల్లరమాయల్లో పడకుండా చేశాడని, దాతగా శ్రీ వేంకటనాథుని మనసులో నిలిపి నమ్మేటట్లు చేసాడని, ఏడుగడగా వుండి అటు ఇటు తనను వెన్నంటుతూ అన్నివైపుల నుంచి రక్షించాడని తన ఆధ్యాత్మ సంకీర్తనల్లో పేర్కొనడం చినతిరుమలయ్య ఔదార్య గుణానికి, వినమ్రతకు తార్కాణం.

## లలిత

తాళ్ళపాకన్నమాచార్య దైవమవు నీవుమాకు
వేళమె శ్రీహరిఁగనే వెరవాన తిచ్చితివి॥

గురుఁడవు నీవేసుమ్మీ కుమతినైన నాకు
పరవి బ్రహ్మోపదేశము సేసితి
పరమ బంధుఁడవైనా పరికింప నీవెసుమ్మీ
వరుసనేఁ జెడకుండా వహించుకొంటివి॥

తల్లివైన నీవెసుమ్మీ తగిన విషయాలలో
పల్లదానఁ బడకుండా బ్రదికించితి
అల్లుకొని తోడునీడవైనా నీవెసుమ్మీ
చిల్లరమాయలలోనఁ జెడకుండాఁ జేసితివి॥

దాతవు నీవె సుమ్మీ తగు శ్రీ వేంకటనాథు
నా తలఁపులో నిలిపి నమ్మఁ జేసితి
యేతలఁ జూచినా నాకు నేడుగడయు నీవె
అతల నీతల నన్ను నాడుకొని కాచితివి॥ (16-39)

చినతిరుమలయ్య తన ఆధ్యాత్మ సంకీర్తనల్లో అన్నమయ్యను స్తుతించినట్లుగానే తన తెలుగు సంకీర్తన లక్షణ గ్రంథంలో కూడా అన్నమయ్యను శ్రీ వేంకటేశ్వర ప్రియుడుగా, పావన చరిత్రుడుగా, పూర్వపద కవిమణి తేజోవర హారమున నాయకమణిగా అభివర్ణించాడు. 1. అన్నమయ్య పదాలను శ్రేష్ఠమైన కవితాగుణ చాతుర్యంతో అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరునిపై ఇంపుగా చెప్పిన పదము (మోక్షపదం) తుదిపదమయిందని కీర్తించాడు.

"వరకవితా గుణ చతురత
లరుదారఁగఁ దాళ్ళపాక యన్నయధరలో
దిరువేంకటాద్రి పతపై
దొరకొని చెప్పఁగఁ బదము తుదిపదమయ్యెన్" (2)

ఇంకా— పావనములు, హరిభక్తి విభావనములు, సర్వమింత్ర పరమ రహస్యోద్భావనములు, గాయక నికరావనములు (3), రంజనములు, దుర్గుణగణ భంజనములు, విమల కమల భవజనక గుణాసంజనములు, సుజ్ఞాన ధనాంజనములు (4), సారంబులు, హరికరుణాసారంబులు, విబుధ నికర సంపూర్ణ సుధాహారంబులు, బహుదేశా విహారంబులు, 5) వేదంబులు, పౌరాణిక వాదంబులు, వరకవిత్వవాణీ వీణానాదంబులు, కృతసృజనాహ్లాదంబులు 6) లక్షణములు, పనకవితా రక్షణములు, వివిధ శుకనిరాజీ మద సమ్మోక్షణములు, వేంకటపతి వీక్షణములు 7) అంటూ అన్నమయ్య పదాలను చిన తిరుమలయ్య విశేషంగా స్తుతించాడు. నక్తంచరారి అయిన శ్రీహరి తన పరమ భక్తుడైన అన్నమయ్య ప్రియ వాకులతో రచించిన పదబంధ కవితలపై అనురక్తుడయ్యాడని, ఇతరుల వాక్కులపై విరక్తుడయ్యాడని తనతాతగారి పద విశిష్టతను పేర్కొన్నాడు.

నక్తంచరారి తనకును
భక్తుండైనట్టి తాళపాకన్నయ చా
టూక్తి పదబంధ కవితా
రక్తుండై యితర వాగ్విరక్తుండయ్యెన్ (11)

తాళ్ళపాక చిన్నన్న తనతాతగారైన అన్నమాచార్య చరిత్రద్విపదలో స్వామి వారు ఆనాటి కృష్ణమాచార్యుని వైరాగ్యవచనాలు విని విరక్తి కలిగి వుండే వాడని, అన్నమయ్య శృంగార సంకీర్తనలు విని నవయువకుడైనట్లు అన్న మయ్యతో పలికినట్లుగా అన్నమయ్య సంకీర్తనా ఘనతను వ్యక్తపరచాడు.

"ఆ కృష్ణమాచార్యు నధ్యాత్మ వినుతిరాక
కొన్నాళ్ళు విరక్తుండనైతి

జగతి నీ శృంగార సంకీర్తనల కగపడి
మంచి ప్రాయంపు వాడనైతి"

చిన తిరుమలయ్య తన తాతగారి సంకీర్తనలను ఇంకా శ్రుతులు, శాస్త్రాలు పురాణకథలు, సుజ్ఞాన సారంబులు, ఆతిలోకాగమవీథులు, వివిధ మంత్రార్థాలు, నీతులు, కృతులు, వేంకటశైల వల్లభరతిక్రీడారహస్యాలు, నుతులు అని బహువిధాలుగా ఉల్లేఖించి అన్నమయ్య వాక్కులు వినూత్న రీతుల్లో అలరారుతాయని తెలిపాడు.

వృ. శ్రుతులై శాస్త్రములై పురాణకథలై సుజ్ఞాన సారంబులై
యతిలోకా గమ వీథులై వివిద మంత్రార్థంబులై నీతులై
కృతులై వేంకటశైల వల్లభ రతిక్రీడా రహస్యంబులై
నుతులై తాళ్ళపాక యన్నయ వచోనూత్న క్రియల్
చెన్నగున్ (12)

## 1. 3. అన్నమయ్య సంకీర్తనా శ్రుతి, గానఫలితాలు:

భారత, భాగవతాది పవిత్ర గ్రంథాలకు శ్రుతఫలం చెప్పబడినట్లుగా చిన తిరుమలయ్య తన తాతగారి సంకీర్తనలు విన్నందువల్ల, పాడినందువల్ల ఎంతో ఫలితం వుంటుందని తెలిపాడు. అన్నమయ్య సంకీర్తనల్ని విన్నంతనే పాపసంఘాలు అణగిపోతాయని, అన్నమయ్య పదాలను పాడినవారిని వేంకటాధిపుడు ఏలుతాడని (8), మనసులో అన్నమయ్య సంకీర్తనలపై భక్తికలిగి పాడితే వైభవాత్మకమైన వివిధ సంపదలు సమకూరుతాయని, శ్రీ వేంకటేశ్వరుని పాదపద్మ దర్శనం కలుగుతుందని (9), సకల పాప కృత్యాలు చేసినవారైనా, వివిధ సందేహాలు కలిగినవారైనా శ్రీ వేంకటేశ్వరునిపై సంకీర్తనలు పాడితే సమస్త శంకలు తొలగిపోతాయని (10), అన్నమయ్య తెలియజెప్పిన పదలక్ష్య లక్షణాల లాగు (ఉచితం) తెలిసి పలుక నేర్చితే బాలుడుకూడా ప్రౌఢ (చతురుడు) అవుతాడని, అతని ప్రబంధం (సంగీతం) అమృతధారవలె సాగుతుందని (14) తెలిపాడు.

# 1.4. పద సంప్రదాయం

"మహనీయంబగు సంకీర్తన నామక పదసంప్రదాయం బెట్టి దనిన" అనే వాక్యాన్నిబట్టి తాళ్ళపాక కవులు సంకీర్తన, పదం అనే మాటల్ని ఒకదానికొకటి పర్యాయ పదాలుగా వాడినట్లు తెలుస్తుంది. అన్నమయ్యకు పూర్వం పదలక్షణాలు సంగీత రత్నాకరం (శార్ఙ్గదేవుడు) లోని ప్రబంధాధ్యాయంలోను, సంగీత చంద్రిక (మాధవభట్టు) లోని దేశైలలోను, సంగీత చూడామణి (ప్రతాపుడు) లోను, సంగీత సుధాకరం (హరిపాలదేవుడు) లోను, భరతుని నాట్యశాస్త్రంలోను చెప్పబడినట్లు సంకీర్తన లక్షణ గ్రంథంలో (18) పేర్కొనబడింది.

కృతి చెప్పితే అలంకారం, చమత్కారం కలిగివుండేలా కీర్తిస్తే ఆదికృతి అవుతుందని, అలా కాక అహంకారంతో కృతిచెప్పితే అది హస్యాస్పదమవుతుందని.

'కృతిచెప్పిన యాతఁడలం
తృతియుఁ జమత్కృతియుఁ గల్గఁ గీర్తించినచో
గృతియగునటు గాక యహం
కృతి గృతి సేయంగ మిగుల గేలింబడదే (20)

"సంప్రదాయంబు నెరుగని జడునికవిత" (21)ను నిరసించడం జరిగింది వరదానం వల్లకానీ, గురుముఖంగా కానీ తెలుసుకొన్న కవి పలుకులు పరమామృతం అవుతాయని అంటూ 'దురహంకృతి కవితను' (22) ఆపేక్షించడం జరిగింది. సంప్రదాయాను సారంగా, జ్ఞానవంతుడైన వాని సత్కవిత వెదమంత్రంతో సమానమని, అదే శ్రీ వేంకటేశ్వరుని చరణాలను కనుగొనడానికి, మనడానికి ఉపకరిస్తుందని,

'సంప్రదాయాగత జ్ఞాన సహితుడైన
మనుజు సత్కవితయు వేదమంత్ర సమము
అదియె చాలదె శ్రీ వేంకటాచలేశు,
చరణములు గనుమను పునశ్చరణమేల (20) అనే పద్యంలో

పేర్కొనడం జరిగింది ఇంకా పదాలు భావరసాలంకృతిశయ్యా రీతులలో తప్పులు లేకుండా, దైవిక మానుష రచనలుగా, పావన బంధాలుగా ఒప్పాలని (69), బూరుగు కాయ కోరికితే రసహీనమైన దూది (నీరసతూలంబు) నలుదిసలా నిండినట్లు 'నిస్సార పదబంధ కవితా పారీణుల పదం పస్యాస్పదం అవుతుందని (70), సభల్లో ఇతరుల గీతాల్ని చౌర్యం వేయడం, అన్నవిత్తాలకు ఆశపడటం, ఎవరైనా తప్పడు సాక్షికోరితే చెప్పడం ఇవితగని పనులుగా తెలపడం జరిగింది (71).

అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తనలు రెండవ సంపుటంలో కూడా ఈకవి నిరసన వ్యక్తం అవుతుంది.

ఒకసారి ఉపయోగించబడి వాడిపోయిన పుష్పం తిరిగి శిరోధార్యంకాదు. ఒకసారి తినిపారేసిన ఫల్లాకులో మళ్ళీ తినడం జరగదు. అలాగే ఒకరు చెప్పిన కావ్యాన్నే మరొకరు (తమదిగా) చెప్పితే అది శ్రీ హరికి సమ్మతం కాదు అని అన్నమయ్య తెలిపాడు. అలాంటి పని చేసే వారిని 'వెట్టులాల' అని సంబోధిస్తు, 'అలాంటి పని చేయడం కన్నా మెదవంచి తడికి అల్లుకో కూడదా' అని సున్నితంగా ఆక్షేపించాడు.

వెట్టులార మీకు వేడుక గలితేను
అట్టువంచి తడుకల్లంగ రాదా॥
ముడిచివేసిన పువ్వు ముడుప యోగ్యముకాదు
ఉడిచివేసిన ఫుల్లె కుడువగా రాదు
ఒకరొకరు చెప్పినది బ్రతిచెప్పఁ బోతేలు
అదరి శ్రీహరి కది అరుహము గాదు॥ (2-494)

## 1.5. పదలక్షణం:

పదం 'సుప్తిఙ్ఞంతం' అని అవయుపం, అవయువి అని, ఈ వివరాలన్ని పదకవితా మార్గ సార్వభౌముడు తెలిపాడని (24) చిన తిరుమలయ్య పేర్కొన్నాడు.

ఇందులో అవయవ పదం చతుష్పాదం అవుతుందని, దీన్నే వృత్తం, ధాతువు అవయవం అనే పేర్లతో కూడా వ్యవహరిస్తారని (25), శరీర ధారణకు వాత, పిత్త, కఫం కారణాలయ్యాయని, అందువల్ల వృత్తాలు పదశరీర సముద్భావానికి కారణాలయ్యాయని, అందువల్ల వృత్తాలకు ధాతు సంజ్ఞలేర్పడాయని ఈ విషయాల్ని అన్నమయ్య భరతాది మునుల సమ్మతితో (26), భరతశాస్త్ర పద్ధతిని పలికాడని (25) చిన తిరుమలయ్య తెలిపాడు.

## 1.6. భాషానియమం:

పదం సంస్కృతంలో గానీ, ప్రాకృతంలో గానీ లేక దేశభాషలో గానీ పొసంగ (ఇంపుగా) పరకాలని, పదానికి యతి ప్రాసాలు పద్యభంగిమలోనే చెల్లుతుందని, భరత, తత్తిళాది మునులు పేర్కొన్నట్లు [27] చిన తిరుమలయ్య వచించాడు. దేశైళి 'కర్ణాద్రవిళాంధ్ర లాట విలసద్గౌడాది' భాషల్లో కర్ణాపూర్ణ సుధా సమానవచులు కలిగిస్తుందని [28] పేర్కొన్నాడు పదాలు వర్ణవిషయాన్ని బట్టి శృంగారం, వైరాగ్యం అని రెండు విధాలని, శృంగార పదాల్లో పాత్రోచిత భాష అవసరమని [57], లక్షణ విరుద్ధమైన గ్రామ్యాలైనా పొంక [ఔచిత్యం] మెరిగి పలికితే చెల్లుబడి అవుతాయని,

'విదితార్థ గ్రామ్యోక్తులు
పదిలముగా బొంకమెరిగి పలుకగ జెల్లున్' [56]
'ఉల్లాస మనోజ్ఞబంధోక్తులు చవియై
చెల్లును గ్రామ్యములైనను' [57]

వైరాగ్యపదాలు మాత్రం అలాకాకుండా 'అగ్రామ్యరమ్య విష్ణుచరితో దార ములై' వుండాలని, వీటినే ఆధ్యాత్మ పదాలంటారని (60), ఇందులో జీవాత్మ పరమాత్మ వివేకజ్ఞానం, లోకధర్మాలు, వేద ధర్మాలు, హరి సంకీర్తనం వుంటాయని (61), లోక వ్యవహారం లోని నుడికారాలు పదాల్లో లేకుండా ఇరవుగా వుండదని, ఈనుడికార ప్రయోగాన్ని ఎవరైనా కాదంటే

ఆది పువ్వుల)అందం నశింపేలా నలిపి వాసన చూడటం లాగా వుంటుందని తెలిపాడు.

జగతి గల జెల్లు బళ్లె
నగినగి భాషింను నట్టీ నానుడి పలుకుల్
తగదన రహి చెడుఁ బువ్వుల
సొగసుడు గం బిసికి కంపు చూపిన భంగిన్ (59)

## 1.7. పదవైవిధ్యం:

పదాలు లక్షణ భేదాన్ని బట్టి వృత్త పదం, నిబంధపదం, చూర్ణ పదం అని మూడు రకాలు (29) వీటిలో వృత్త పదాలు భరతుడు వివరించినట్లు 26 ఛందః ప్రక్రియల నుండి రూపొందించబడిన పదాలే. వృత్తాలు బంగారానికి పరిమళం అబ్బినట్లు ఒప్పుతాయి. 'కుందనమునకుంబరిమళ మందిన క్రియ వృత్త పదముల ఒరుచునుండు న్' (30).

## 1.7 1. వృత్త పదం:

ఇది విషమం, సమం, అర్ధసమం అనిమూడు విధాలు.

### విషమం:

చరణాల్లోని నాలుగు పాదాలు నాలుగు రకాలుగా వుండటం విషమ వృత్తం అవుతుంది. 'విషమమనునది నాలుగు పాదములును వేఱేభంగిఁ జెల్లు' [31].

### సమం:

చరణాల్లోని నాలుగు పాదాలు ఒక్క చాలున ఉకడటం సమవృత్తం. 'నాలుగు పాదంబులు నొక చాలున నర్తించు నదియ సమవృత్తం' [32].

### అర్ధసమం:

చరణాల్లోని విషమపాదాలు ఒకరీతిగ, సమపాదాలు వేరొక రీతిగ వుండటం అర్ధసమం

## 1.7.2. నిబంధపదం:

నిబంధపదానికి యతి, ప్రాస, మాత్రా గణాలు, మార్గదేశి తాళాలు, ముద్రఅనేవి అంగాలు [34]

నాలుగు పాదాల్లోని ఆదిమధ్యాక్షరాలు సవర్ణాలుగా వుండటం యతి నియమం. పాదాల్లోని ద్వితీయ వర్ణం ఒక్కటే కావడం ప్రాసనియమం [35] మాత్ర ఒకటి అయితే లఘువు [ఏకమాత్ర]. మాత్రా ద్వయమైతే గురువు మాత్రాత్రయమైతే ప్లుతం, మాత్రార్థమైతే ధృతం అని భరతుని అభిప్రాయంగా చెప్పడం జరిగింది [36].

## 1.7.3. నిబంధపదం అవయవాలు:

నిబంధపదానికి ఉద్గ్రాహం, మేళాపం, ధ్రువం, అంతరి, ఆభోగం అనేవి అవయవాలు. ఆభోగంలో ముద్ర వుంటుంది [38]

## 1.7.4. నిబంధపదం పల్లవి

పదాల్లోని [చరణాల్లోని] అర్థం వదలకుండా అన్నిటికి ఏక వాక్యత చేయటానికి పొందికగా ప్రతిపదం [చరణం] చివర్లో భాసించేది పల్లవి.

పదముల యర్థముఁ బల్లవి
వదలక యన్నిటికి నేక వాక్యతఁ జేయన్
గుది గ్రుచ్చినట్లు తగులై
పదము తుదిన్ మఱియు మఱియుఁ బల్లవి యలరున్ [39]

'పదసమాన పాదయుగ్మము' కలది పల్లవి [40]. అందులో సగం అయితే శిఖాపాదం [40] అవుతుంది. అంటే ఏకపాదం కలది శిఖాపదం వీటిని లక్షణజ్ఞులైన మునులు పేర్కొన్నట్లు చెప్పబడినది. నిబంధపదం విషయంలో పల్లవి వుంటే శిఖాపదం వుండదని, శిఖాపదం వుంటే పల్లవి వుండదని ఈ విషయం సంగీతచూడామణిలో చెప్పబడినట్లు సంగీత చంద్రిక కర్త పలికాడని [41] ఉద్ఘాటించబడింది,

## 1.7.5. నిబంధపదం – ప్రయోగ సంప్రదాయ రీతులు

నిబంధపదం ప్రయోగ సంప్రదాయాన్ని బట్టి చతుర్ధాతుక, త్రిధాతుక, ద్విధాతుక, ఏకధాతుక అని నాలుగు రకాలు.

### చతుర్ధాతుక నిబంధపదం

ఇందులో ఉద్గ్రాహం, మేళాపం, ధ్రువం, ఆభోగంలో పల్లవి వుంటాయి. అభోగంలో ముద్ర వుంటుంది [42].

**త్రిధాతుక నిబంధ పదం :**

ఇందులో ఉద్గ్రాహం, ధ్రువం, ఆభోగం, పల్లవి వుంటాయి. [43]

**ద్విధాతుక నిబంధపదం :**

ఇందులో ఉద్గ్రాహం, ధ్రువం, పల్లవి వుంటాయి. ధ్రువంలోనే ముద్ర వుంటుంది (44).

**ఏకధాతుక నిబంధపదం :**

ఏకధాతుపదం "ఈ జగమునసెలేదు" అని, నాట్యశాలల్లో పాడబడే "మొగవరి" రచన ఇలాంటిదని, ఇందులో ఉద్గ్రాహం మాత్రమే పల్లవిని కూడా వుంటుందని (45) చెప్పబడింది.

## 1.8. పదవిశేషాలు

తెలుగు సంకీర్తన లక్షణంలో పదవిశేషాలు, వాటి లక్షణాలు కూడా చెప్పబడ్డాయి

**అష్టపది :**

జయదేవ కవివరేణ్యుని ఉన్నతమైన, సుందరమైన గీతగోవిందం లోని అష్టపదులవలె 8 పాదాలు, పల్లవి వుంటుంది. (46)

పదమాలిక :

అందమైన పల్లవి (రహిగలపల్లవి)ని కూర్చుకొని అర్థచాతుర్యంతో అనేక విధాలుగా ఈ పదమాలిక సీసమాలికగా అలరారుతుంది. (47)

శరభపద పాదం :

ఎనిమిది పాదాలతో వుండేవి శరభపాదం (48). ఇది జయదేవుని అష్టపదుల కన్నా భిన్నమయిందని ఆచార్య వేమూరి ఆనందమూర్తి గారు పేర్కొన్నారు.

ముక్తకం, కుళకం :

పద్యజాతి ముక్తకం, కుళకం అనే రూపాల్లో వున్నట్లే ముక్తకం వలె వ్యస్తమై దరువును, పదం వలె కుళకం ఒప్పుతుంది (46). వృత్తాలు నాలుగు పాదాలతోను, జాతులు రెండు పాదాలతోను వున్నట్లే పంకీర్తనల్లో దరువును, జక్కుల రేకులు, గొబ్బిళ్ళు, భాసుర వాక్యాలు, చందమామ పదాలు వ్యక్తమవుతాయి (50) పదాల్లో దరువు, వ్యాకం, అర్ధచంద్రిక, ఏల, గొబ్బిళ్ళు, చందమామ పదం అనేవి పాదయుగళంలో ఒప్పుతాయి (51) ఇందులో అర్ధచంద్రిక పదం ఉద్గ్రాహం, ధ్రువం ఆభోగం సగమై పలికి పల్లవి సంధించి తానప్రతాన కాంచితమవుతుంది (53).

భాసురవాక్యం :

ఇది తానాంచితమై, విలంబమానమై, తాళవిరహితమై పదార్థంతో కూడి (పదార్థంబుచెంది) ద్విచతుష్పదాకృతితో ఒప్పుతుందని అన్నమయ్య చెప్పాడని చిన తిరుమలయ్య పేర్కొన్నాడు (62).

దరువు :

ధ్రుత మధ్యమానములు, చిత్రవర్ణం, తాళం కలిగి ముందు పాడిన పదవాక్యాలతో పొసగి ద్విచతుష్పాదాకృతితో ఒప్పుతుంది (69).

చందమామ పదం :

దుర్భర విరహ వేదనతో నాయకుడుగానీ, కాంతగానీ, పాదపాదంలో

చంద్రుని పేర్కొని పాడగా ద్విచతుష్పాదాకృతితో ఒప్పుతుంది (64)

ఏలపదం :

నాయకాహ్వాన పూర్వకంగా, మ్లేచ్ఛపరిభాషతో రాగమిళితంగా, మహిత నాయక సంబుద్ధి మధ్యమవుతూ ఒప్పుతుంది (65).

నాయకాహ్వాన పూర్వమైన యమము గలిగి
మ్లేచ్ఛ పరిభాషఁ దగి రాగమిళితమైన
యేలపాట పదంబు నానిల వెలంగు
మహిత నాయక సంబుద్ధి మధ్యమగుచు'

యక్షగానపదం :

ఇది సముచితమైన అనేక విధతాళ సంగతులతో అలరారుతాయని హరికీర్తనాచార్యుడు అన్నమయ్య తెలిపాడని చెప్పబడింది (66).

## 1.9. చూర్ణపదం

పదాల్లో వృత్త, నిబంధ పదాల తర్వాత పేర్కొనవలసింది చూర్ణ పదం. దీన్నే అనుబంధ పదం అంటారు. ఇది నిర్యుక్తనామ భాసితమై తాళబంధ ఛందో విరహితంగా ఒప్పుతుంది. ఇది కృష్ణమాచార్యుని పరికల్పితపదం (54). ఈ చూర్ణపదమే ఛందోగణాల నియతిలేకుండా తాళ ప్రమాణంతో ఒప్పితే అది "తాళగంధి" అవుతుంది (55). నానావిధ దేశాల్లో, నానాకవి బుద్ధి వర్ణనారచనలచే మానిత తానక రాగంతో అలరే దేశిపదం దొరలకు మెచ్చిందని సంకీర్తన లక్షణం (68)లో చెప్పబడింది.

'నానావిధ దేశంబుల
నానాకవిబుద్ధి వర్ణనా రచనలచే
మానిత తానక రాగము
తో నలరున్ దేశిపదము దొరలకు మెచ్చౌ' (68)

ఈ విధంగా అన్నమయ్య సంస్కృతంలో రచించిన సంకీర్తన లక్షణ గ్రంథాన్ని చినతిరుమలయ్య తెలుగులో సులభశైలిలో రచించాడు. చిన తిరుమలయ్య తెలుగు సంకీర్తన లక్షణంలో అన్నమయ్య సంకీర్తనా

సంస్తుతి, అన్నమయ్య సంకీర్తనల శ్రుతిఫలితం, గానఫలితం, పదసంప్రదాయం, పదలక్షణం, భాషానియమం, పదవైవిధ్యం, వృత్తపదం, నిబంధపదం-అంగాలు, అవయవాలు, పల్లవి, నిబంధపదం-ప్రయోగ సంప్రదాయ రీతులు. పదవిశేషాలు-అష్టపది, పదమాలిక, శరభపదపాతం, ముక్తకం, కుళకం, వాక్యం, దరువు, చందమామ పదం, ఏలపదం, యక్షగాన పదం, చూర్ణపదం మొదలైనవి చెప్పబడ్డాయి ఈ అంశాలు, లక్షణాలు అన్నమయ్య, తదితర వాగ్గేయకారుల రచనల్లో చాలావరకు ప్రతిబింబిస్తాయి, సంకీర్తన లక్షణగ్రంథం పదకవిత్వానికి ప్రామాణికతను ఏర్పరచింది అన్నమయ్య సంస్కృతంలో రచించిన సంకీర్తన లక్షణ గ్రంథం, పెదతిరుమలయ్య రచించిన సంకీర్తన లక్షణ వ్యాఖ్య లభించ లేదు. చినతిరుమలయ్య రచించిన తెలుగు సంకీర్తన లక్షణగ్రంథమైనా లభించడం పదకవుల అదృష్టం. తాతగారి సంస్కృత సంకీర్తన లక్షణ గ్రంథాన్ని స్పష్టంగా, సరళంగా తెలుగులో రచించి సాహిత్యలోకానికి అందించిన చినతిరుమలయ్య చరితార్థుడు.

ఉపయుక్త గ్రంథాలు :

అధ్యాత్మ సంకీర్తనలు – సంపుటం – 16 – చిన్న తిరుమలాచార్యులు (చిన తిరుమలయ్య)
అధ్యాత్మ సంకీర్తనలు – సంపుటం – 2 –అన్నమాచార్యులు
అన్నమాచార్య చరిత్ర (ద్విపద) - తాళ్ళపాక చిన్నన్న
తాళ్ళపాక కవుల కృతులు - వివిధ సాహితీ ప్రక్రియలు - వేటూరి ఆనందమూర్తి
తెలుగు సంకీర్తన లక్షణం - చిన తిరుమలయ్య

సెమినార్ వ్యాసం 19-3-1999
తిరుమల తిరుపతి దేవస్థానములు

శ్రీమాన్ తాళ్ళపాక అన్నమాచార్యుల
496 వ వర్థంతి మహోత్సవాలు
14-3-1999 నుండి 20-3-1999
వరకు అన్నమాచార్య కళామందిరం, తిరుపతి

— —

# అనుబంధం - 1

హరి అవతారం, అప్పని వరప్రసాది అయిన తాళ్ళపాక అన్నమాచార్యులు శ్రీ వేంకటేశ్వర స్వామి వారి ముద్రతో ముప్పై రెండువేల శృంగార ఆధ్యాత్మ సంకీర్తనలను రచించి లోకానికి అందించారు. అన్నమయ్య సంకీర్తనలు ఇహ పరసాధనాలు. మానవ జన్మను సార్థకం చేసుకోవడానికి తోడ్పడే సద్గురువులు.

అన్నమయ్య సంకీర్తనలను ఇప్పటికి సుమారు నలభై సంవత్సరల క్రితమే తిరుమల తిరుపతి దేవస్థానంవారు తొలిసారి ముద్రిస్తున్న రోజులవి. అప్పుడు అక్కడ ప్రెస్‌లో పనిచేస్తున్న ఒకవ్యక్తి మాతాత నాన్నలకు వాటిలో కొన్ని తెచ్చిచ్చారు. మాతాత సహజ సంగీత సాహిత్య నాటక హరికథా చిత్రలేఖన శిల్పకళాకారుడు కావడంవల్ల అన్నమయ్య సంకీర్తనల్లోని సమస్త కళల సౌందర్యాన్ని, పరమార్థాన్ని సులభంగా గ్రహించారు అదివో అల్లదివో హరివాసము, బ్రహ్మకడిగిన పాదము, ఒకపరి ఒకపరి ఒయ్యారమై మొదలైన సంకీర్తనలకు తానే స్వయంగా సంగీతం కూర్చుకొని పాడుతుండేవారు

అలా మాతాత, నాన్న పాడే అన్నమయ్య సంకీర్తనలను ఊహ తెలిసీ తెలియని తెలియని బాల్యంనుంచే నేను వింటున్నాను. అదే నాకు భవిష్యత్ విద్యామందిర నిర్మాణానికి దివ్యమైన పునాది అయ్యింది.

తర్వాత 1979లో ఎం ఎ ద్వితీయ సంవత్సరంలో తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో అన్నమయ్య సంకీర్తనలను ప్రత్యేక అధ్యయనంగా చదివాను. ఆ రోజుల్లో నన్నయ, తిక్కన, శ్రీనాథుడువంటి పద్యకవులకు తప్ప పదకవులకు స్థానంలేదు అందువల్ల అన్నమయ్య సంకీర్తనలను ప్రత్యేక అంశంగా చదవడానికి విద్యార్థులు ముందుకు రాలేదు. అయినా నేను చదువుతానని ముందుకువచ్చాను. నేను చేరాక మరోఅమ్మాయి చేరింది. ఇద్దరేకదా అని ఆ అంశాన్ని తీసివేయకుండా నాలోని భక్తిని, సంగీత ప్రీతిని, శ్రద్ధను గ్రహించి మా గురువర్యులు ఆచార్య జి. యన్. రెడ్డిగారు నన్ను ఎంతో ప్రశంసించారు. అప్పుడు అన్న

మయ్య సంకీర్తనలు పన్నెండవ సంపుటంలోని సాహిత్యాంశాల్ని ఆచార్య కె. సర్వోత్తమరావుగారు, భాషావిషయాల్ని ఆచార్య కె. విశ్వనాథరెడ్డిగారు బోధించారు. అప్పుడు అన్నమయ్య సంకీర్తనల్లోని సాహితీ సౌరభాలు, సంగీత మధురిమలు నన్నెంతో ఆకర్షించాయి

1984లో తిరుమల తిరుపతి దేవస్థానంవారి అన్నమాచార్య స్కాలర్ షిప్‌తో ఆచార్య కె సర్వోత్తమరావుగారి పర్యవేక్షణలో పి హెచ్. డి. పూర్తి చేశాను. ఆ తర్వాతకూడా అన్నమయ్య సంకీర్తనల్ని వివిధ కోణాలనుంచి ఆలోచించి పరిశీలించి వ్యాసాలుగా, పుస్తకాలుగా వ్రాస్తున్నాను.

ఈ అనుభవంతో, అన్నమయ్య కారణంగానే విశ్వవిద్యాలయ స్థాయిలో ఉద్యోగం వచ్చిందనె ప్రగాఢ విశ్వాసంతో, కృతజ్ఞతతో అన్నమయ్యపై పాటలు వ్రాయాలనిపించింది. అలా అన్నమయ్య జీవితాన్ని, అన్నమయ్య సంకీర్తనల్లోని భక్తి, జ్ఞానం, సామాజిక ప్రబోధం, మానవత్వం స్వామివారికి సంబంధించిన వర్ణనలు, దేవస్థానం వారు చేస్తున్న విశేషవ్యాప్తి మొదలైన విషయాల్ని దృష్టిలో పెట్టుకొని నేను కొన్ని పాటలు రచించాను వాటికి నాకు నచ్చిన రాగాల్ని సమకూర్చి సభల్లో పాడుతున్నాను, సభలో విన్న సంగీత సాహిత్య విద్వాంసులు, గాయకులు ఎంతో ప్రశంసించి నన్ను ప్రోత్సహిస్తున్నారు. ఆ పాటలను ఈ అనుబంధంలో చేర్చితే శ్రద్ధకల్గిన ఎందరో పాఠకులు, గాయకులు చదువుకుని, పాడుకుని ఆనందిస్తారని, అందులోని విషయాల్ని తెలుసుకొని, ఇతరులకు తెలియజెప్పి, తాము ఆచరించి, ఇతరులను ఆచరింపజేస్తారనే ఆలోచన కల్గింది అందువల్ల ఇక్కడ ముద్రించడం జరిగింది.

ఆలాగే మానాన్న అప్పట్లో ఐదవ తరగతి వరకే చదువుతున్నాగానీ సహజసిద్ధంగా, వంశపారంపర్యంగా శ్రీహరి భక్తి, సంగీతం, సాహిత్యం అలవడటంవల్ల అన్నమయ్యపై భక్తితో కొన్ని పాటలు వ్రాసి నాకు చూపించారు. అవి ఎంతో వర్ణనాత్మకంగా, ఆత్మీయంగా ఉన్నాయి. నాకు చాల నచ్చాయి. అందువల్ల వాటినికూడా ఇక్కడ పొందుపరచడం జరిగింది. అన్నమయ్యపై వ్రాసిన ఈ పాటలవిలువ తెలిసినవారు, శ్రద్ధకల్గినవారు

వీటిని చదివినా, పాడినా, చెప్పుకున్నా ఇవి సార్థకంఅయినట్లే. అన్నమయ్య మనకోసం ముప్పైరెండువేల సంకీర్తనలు వ్రాస్తే, మనం అన్నమయ్యపై ముప్పైరెండు లక్షల పాటలు వ్రాసినా ఋణం తీరదు. ఆ బాధ్యత ఈ విశ్వజనులపై ముఖ్యంగా తెలుగు ప్రజలపై ఉంది.

పోటీగానో, పేరుకోసమో ఇతరుల గేయాల్లోని పదాలను స్వీకరించో, అర్థంకాని ఏవో శబ్దాలుకూర్చి యాంత్రికంగా వ్రాయడంవల్ల ప్రయోజనం ఉండదు. వాటిని ప్రజలూ మెచ్చరు, పరమాత్మ మెచ్చడని నా భావన. అన్నమయ్య సంకీర్తనలను చిత్తశుద్ధితో, నిశ్చల మనస్సుతో తరచిచూచి అందులోని అర్థాన్ని, పరమార్థాన్ని గ్రహించి వ్రాస్తే అవి కాలవాహినిలో కొట్టుకొని పోకుండా ఎదురీది నిలుస్తాయని నా విశ్వాసం.



# అన్నమాచార్య జీవిత గీతామృతం



వందకమే అవతరించె అన్నమయ్యగ
అందముగా హరిదయతో అవనిపైన॥

పదునాల్గువందల ఎనిమిదవ వత్సరము
వైశాఖ మాసము విశాఖా నక్షత్రము
క్రోధియందు భావించె క్రోధము పోవ
అన్నమయ్య జననము జనానందము॥

లక్కమాంబ నారాయణసూరి దంపతులకు వరముగ
ప్రభవించె తాళ్ళపాక పల్లెలోన
పూలజల్లు కురిసెను చల్లగాలి వీచెను
పల్లెపల్లె పులకించి పరవశించెను ॥

వేంకటపతి తలపుతోనె పెరిగెను ఆ భక్తుడు
ఆటలతో పాటలతో చిందులాడెను
పెద్దవారి పంపున కానకేగి కసవుకై
వ్రేలు తెగిన బాధతో విసుగుచెందెను ॥

వీరేమి బంధువులు వీరేమి చుట్టములు
నిజమైన బాంధవుడు ధరణీధరుడేనని
నిశ్చల మనసుతో నిర్ధారణ చేసుకొని
స్వామివారి సన్నిధికి సిద్ధమాయెను ॥

తిరుమల సోపానములు ఎక్కుచుండ అలసిపోయి
దివ్యమాత దయతలచి తినిపించెను ప్రసాదము
వెనువెంటనె శతకరత్న ముదయించెను గళమునుండి
మెల్లమెల్లగ చేరుకొనియె శేషశైలము ॥

స్వామి నీ దర్శించి కీర్తించి వివశమయ్యె
ఆనంద బాష్పాలతో అభిషేకము చేసెను
విష్ణుదీక్ష నొసగెను కృపతోడ ఘనవిష్ణువు
అన్నమాచార్యుడాయె అన్నమయ్య॥

తల్లిదండ్రులు వెదకి వెదకి తిరుమలగిరి చేరుకొనిరి
తమ తోడ రమ్మని వేడుకొనిరి పుత్రుని
పద్మనేత్రు వదలినేను రాలేను పొమ్మనెను
స్వామివారి అనతిలో సమ్మతించెను ॥

బంధుజనుల స్వప్నమున పరమాత్మయే కనిపించి
తమ కన్యల నిమ్మని ఆదేశమొసగెను
అక్కలమ్మ తిరుమలమ్మ ధర్మపత్నులాయెను
అన్నమయ్య సతులతోడ సంతసించెను ॥

పదకవితకు శ్రీ కారము చుట్టిన ఘనుడితడు
ప్రజలభాష బాణీలను స్వీకరించెను
మానవతా మకరందము క్రోలుమనియె మానవుని
భక్తియే ముక్తి అని ప్రబోధించెను ॥

కడపలోని టంగుటూరి సామంతరాజు
నరసింహరాయలు అన్నమయ్య సన్నిహితుడు
పెనుగొండ ప్రభువాయె అన్నమయ్య దీవెనతో
అందముగ ఆశ్రమము కల్పించెను ॥

నరసింగరాయలు తనమీద పాడమనెను
నరుని మీద నా నాలుక పాడదనియెను
సంకెల బిగియించెను అన్నమయ్యకు
కమలాక్షుని కరుణతోడ సంకెల తొలగె

అన్నమయ్య కీర్తనము అందరికి లభ్యము
వెలలేని తులలేని వైకుంఠవాసము
తామసమును పారద్రోలు రత్నదీపము
భాగవతుల రక్షించు వజ్రకవచము ॥

అహోబలము కేతెంచి శఠకోప స్వామిచెంత
సకల శాస్త్రాలను అభ్యసించె నయముగ
విట్టలుని భక్తుడు పురందర పదకవి
అన్నముని దర్శించి ధన్యుడాయెను ॥

వేంకటనాథుని తల్లిగ తండ్రిగ
గురువుగా దైవముగ సఖునిగాను
బ్రతుకుగా బంధువుగా పరమ ప్రియునిగా
శిశువుగా సర్వముగా భావించెను ॥

బోయగా భూతముగ పంతుగా దొంగగ
వెన్నెలగా మేఘముగ కులదైవముగ
ఔషధముగ మంత్రముగా చింతామణిగ
బహువిధముల వర్ణించె వనజనాభుని ॥

మత్స్య కూర్మ వరహాది అవతారమూర్తులను
మనసార కీర్తించి తరియించెను
కామధేను పారిజాత శాశ్వత నిధిగ
శ్రీపతిని విశ్వసించె చెలువుమీరగా ॥

స్త్రీపురుష భేదము జాతి తారతమ్యము
కామక్రోధాదులు వలదని బోధించెను
నాస్తికుల నలదీసెను దుర్మతులను నిరసించెను
లోక కల్యాణమునే కాంక్షించెను ॥

స్వామి దేవేరుల సౌందర్యలాహిరిని
సుమధుర భావాలతో గానము చేసె
రామానుజ మార్గమునే అనుసరించెను
విశిష్టాద్వైతమును వ్యాప్తి చేసెను ॥

శృంగార అధ్యాత్మ వేలాది కీర్తనలు
స్వామి పాదాలకే అంకీత మొసగె
మధురాతి మధురమ నీ మాధవుడే నుతియించె
నీమహిమేననే వినయశీలుడై ॥

సంకీర్తన లక్షణము శతక ద్వాదశము
వేంకటాద్రి మహాత్మ్యము ద్విపద రామాయణము
రమ్యముగ రచియించె బుధులు మెచ్చగ
మధువైరి ఘనతలన్ని దీప్తిగాంచగ ॥

తన సతిని ప్రోత్సహించె కావ్యము రచియింపగ
సుభద్రా కల్యాణము తిరుమలాంబ (తిమ్మక్క) రచియించె
తొలి తెలుగు కవయిత్రిగ ఖ్యాతిగాంచెను
అన్నమయ్య ఆదర్శము నాచరించెను ॥

తనపుత్ర పౌత్రులు తిరుమలయ్యలు
చిన్నన్న అందరూ అనుసరించె ఆతనిని
కమనీయ కావ్యాలు కీర్తనలు రచియించె
తారకలై భాసిల్లె తరతరాలుగ ॥

సాహితీ వనమున తాళ్ళపాక వంశము
పారిజాత పుష్పమై పరిమళించెను
వాడనీ వీడని నిత్యనూతనం
భక్తి దేశి కవితలకే ఆలవాలము

అన్నమయ్య మహిమలు వ్యాపించె మారుతమై
పుల్లజీడి పండ్లచెట్లు తియ్యగమారె
అన్నమయ్య వాక్కుతో సమకూరెను ధనము
పేద బ్రాహ్మణుని పెండ్లి వేగమె జరిగె॥

ఎన్నెన్నో వింతలను ఎన్నెన్నో మహిమలను
కాంచినారు ముదముతో జనులందరు
అన్న ముని గురువుగా దైవముగా కొలిచెను
ప్రేమ మీర ఆశీస్సుల నందుకొనెను॥

పదిహేను వందల మూడవ సంవత్సరము
బహుళ ద్వాదశినాడు దుందుభి మ్రోగె
అన్నమయ్య పయనించే పద్మనాభు చెంతకు
కీర్తనలె కలకాలము మనకు నిలిచెను ॥

శాపాలు సమసిపోవు పాపాలు పారిపోవు
భూతాలు వీడిపోవు భయము తొలగును
అన్నమయ్య చరితమూ సర్వపాపహరణము
సహన సౌభాగ్యము శాశ్వత సుఖము ॥

అన్నమయ్య కరుణతోనే ఈ గీతము వెలువడెను
పిన్నలారా పెద్దలార ఆలకించుడి
ధనబలము జనబలము చూడకుడు ఎన్నడును
అతిబలము అన్నిటికి అబ్జనాభుడే ॥

చిత్తశాంతి కోసము జనుల రక్తికోసము
రచియించితి ఈ గీతిని భక్తిమనసుతో
అన్నమయ్య పాదాలకే అంకితము ఈపదము
అన్నమయ్య జీవితమొక గీతామృతం ॥

ఓర్పులేని దుండగులు పరువు ప్రాణాలతో
చెలగాట మాడు వేళ రక్షగ నిలిచె
అన్నమయ్య ధ్యానమే ఆత్మబలము కలిగించె
శాంతి దాంతి కలిగించి ధైర్యమొసగెను ॥

తనవారు బాంధవులు ఇరుగు పొరుగు జనులంతా
రాబందులై వచ్చి వేధించిన వేళ
అన్నమయ్య ఒక్కడె ఆత్మబంధువై నిలిచె
స్వామివారి చలువతోనె తీరెను దుఃఖం ॥

అన్నమయ్య కీర్తనలు పితామహుడు పాడుచుంట
విన్నాను విమలమతితో బాల్యములోనె
ఆనాటి ప్రేరణే ఈనాటి తేజము
జీవితమె సార్థకమై రాజిల్లెను ॥



# అన్నమయ్య సంకీర్తన మహిమ

ప్రాతః స్మరణీయ అన్నమయ్యా
పరిపూర్ణ మనసుతో ప్రస్తుతింతునయ్యా ॥

పదకవితకు శ్రీకారము చుట్టినారు
ప్రజలనెల్ల పరవశము చేసినారు
భుక్తి ముక్తి మార్గాలను చూపినారు
స్వామి భక్తి సేవలోనే మురిసినారు ॥

వింత వింత పదములను అల్లినారు
స్వర మధురిమ నిండుగా నింపినారు
విష్ణుభక్తి శ్రేష్ఠమని చాటినారు
వేనోళ్ళ జనవినుతి గాంచినారు ॥

రాజునైన ఎదిరించిన ధీరులు మీరు
సంకెలనే ఛేదించిన భక్తులు మీరు
శరణార్థిని క్షమియించిన సౌమ్యులు మీరు
శ్రీపతిచే పుత్తకెక్కిన ఘనులు మీరు ॥

నీతి మమత సమతలను బోధించినారు
స్త్రీ ప్రగతి స్వేచ్ఛను కాంక్షించినారు
సంఘ దురాచారాలను ఖండించినారు
మీ మహోన్నత మార్గానికి కై మోడ్పులయ్యా ॥

సంకీర్తనలె భక్తులకు సిరిసంపదలు
ఏచోటా ఏనోటా మీ కీర్తనలే వినబడును
సకల సౌభాగ్యాలు వేగమె సిద్ధించును
తోడు నీడగా వుండి కాపాడును

# అన్నమయ్య సంకీర్తనా వైశిష్ట్యం

నందకాపతారమా - అన్నమాచార్య
వందనము మీకిదె - ఓ దివ్యతేజ ॥

ప్రజల నుద్ధరింప-పదము లల్లినారు
భక్తి జ్ఞానామృతము-పంచి పెట్టినారు ॥

ఆ బాల వృద్ధులదాకా-మీ కీర్తన వినగానే
ఆనందవాహినిలో హంసలై విహరింతురు ॥

వేలాది దేవతలున్నా-విష్ణువె ఘనమని
సత్య నిరూపణతో-తెలియ జెప్పినారు॥

కులభేదము వలదని-కపటబుద్ధి మానుమని
జంతుబలులు దోషమని-గళమెత్తి ఘోషించినారు ॥

స్త్రీలు మనుషులేనని-స్వేచ్ఛ కావాలని
ఆనాడె బోధించిన-పుణ్యమూర్తి మీరు ॥

ఒకవైపు స్వామి సేవ-ఒక వైపు సాహితి సేవ
చేసి చూపిన మహాఘనత-తాళ్ళపాక వంశానిదే॥

సత్వ గుణము నేర్పిన-సద్గురువు మీరు
ఏ జగములోను-సాటిలేరు మీకు ॥

అందాల అవతారమూర్తి - వేంకటాద్రి నాథునిచే
వినుతి గాంచినారు - విశ్వమెల్ల పులకించెను ॥



# అన్నమయ్య సంకీర్తనా గరిమ

అన్నమయ్య కీర్తన వినరా వీనులరా
అన్ని చింతలు హరియించి పోవగ ॥

కలియుగ దైవము కమలాకాంతుని
కమనీయముగ గానము చేసెను
ఇహపర సుఖముల నెసగి ప్రోచును
ఇలపై మమతల మల్లెలు విరియును ॥

కోరక మునుపే దయతో ఒసగును
తోడు నీడగా మనతో వచ్చును
ఆత్మబంధువై మదిలో మెలగును
మానవ ధర్మము మనిషికి నేర్పును ॥

ఏదీ లేదు ఇంతకు మిన్నగ
మహిమాన్వితము మధురామృతము
అంతటి స్వామికి ప్రియమాయెనుగ
ఎంతటి వారము పొగడగ మనము॥



(13)

# అన్నమయ్య సంకీర్తనా స్రవంతి

శోకానలము చల్లార్పుటకు
కీర్తన ఒక్కటి చాలదా...అన్నమయ్య కీర్తన చాలదా ॥

ఆవేదనము అనంతముగ
ఆక్రోశము అనురాగముగ
మారును కీర్తన విన్నంతనే
చేరును మెల్లన సౌభాగ్యమే ॥

పావన చరితము మాధవు మంత్రము
భవ బంధమును దూరము చేయును
తొలగును కర్మము వేగమే
నిలుచును మదిలో దైవమే ॥

శ్రీ చందనము సంకీర్తనము
సంతాపము సమసిపోవును
కలుగును మనసుకు శాంతము
సులభము మనిషికి మోక్షము ॥



# అన్నమయ్య సంకీర్తనా సౌరభం

అదే భాగ్యము అదే భవ్యము
కమలాక్షుని పాడిన కీర్తనము ॥

వేదార్థములను వివరించి-పురాణ భావము చొప్పించి
రామాయణమును పఠియించి-భాగవతమును భజియించి
ముద్దుముద్దుగ పదములల్లెను-తాళ్ళపాక అన్నముడు ॥

నారాయణుని నమ్మినవారికి-నయముగ మోక్షము వచ్చునని
భవబంధాలు అంటవని-భయ రోగాలు పోవునని
వింత వింతగా వీనుల విందుగా-వచియించెను
ఆ పుణ్యపురుషుడు ॥

సంసారములో సారము లేదని-చివరికి మిగులునని
చిన్మయ రూపుని స్మరియించి-సుఖముగ కాలము గడుపుమని
మెల్లమెల్లగా బోధించె-ఆ చల్లని పలుకుల పరమ భక్తుడు ॥



(15)

# అన్నమయ్య అనన్వయ భక్తి

ఏమని నుతియింతు హరి లీలలు
అన్నమయ్యకే తగును ఆ తలపులు ॥

మనల రక్షించు మాధవునితో
సరిరా రెవ్వ రనీ సత్యము తెలిపెను
పుత్తడి ఎక్కడ ఇత్తడి ఎక్కడ
పోలిక వలదని పలికెను ఇంపుగ ॥

రాముని కృష్ణుని నరసింహదేవుని
హనుమంతుని శ్రీరంగనాథుని
సుగ్రీవుని వేంకటపతిని
సుమధురముగ వర్ణన చేసెను॥

విష్ణువులోనె వెలసెను జగములని
శౌరి నామమె శుభదాయకమని
దామోదరుడె దివ్యౌషధమని
ఉల్లేఖించెను మది పులకించగ ॥



# అన్నమయ్య సంకీర్తనా ప్రబోధం

అన్నమయ్య కీర్తన అందరికీ తియ్యన
నల్లనయ్యకు మన్న నాయెరా ఓ నరుడా
అల్లసల్లన అలకించరా ॥

అచ్యుతుని దర్శించె అందమైన భావనతో
పదములన్నీ పొంగెపొరలెరా ఓ నరుడా
అన్నమయ్య గళము నందురా ॥

పల్లెపల్లెను సంచరించి పల్లవులను స్వీకరించి
బహు విధముల కీర్తించెరా ఓ నరుడా
జనుల మనసు చిందులాడెరా ॥

శ్రీపతియే సత్యమని, శ్రీహరియే సర్వమనీ
ఎలుగెత్తి చాటి చెప్పెరా ఓ నరుడా
విశ్వసించి మనసుకొనుమురా ॥

పీడించుట పాపమనీ దయచూపుట పుణ్యమనీ
లోకానికి ప్రబోధించెరా ఓ నరుడా
జీవహింస మాను మనియెరా ॥

భగవంతుని దృష్టిలో అందరూ సమమనీ
భక్తియే ముఖ్యమనియెరా ఓ నరుడా
జ్ఞానమె తేజమనియెరా ॥

కీర్తనల పుష్పాలతో కమలాపతి నర్చించి
స్వామిలోనె లీనమాయెరా ఓ నరుడా
అన్నమయ్య అమర తరువురా
అన్నమయ్య పరమ గురువురా ॥

## భాగ్యము నీవే

చేకొనుమా ఈ జ్యోతి-సంకీర్తనా జ్యోతి ॥

నను కాపాడే పతిత దళోకణ
అనుదిన ధ్యానము నీవేకావా ॥

వ్రతములు తపములు నేజేయలేదు
విధియే వ్రతముగ నే జేయుచుంటిని ॥

వెన్నెల పోలిన చల్లని నీదయ
నాపై కురిసిన చాలును దేవా ॥

శైశవాదిగ నీ శుభనామమే
దురితము బాపెను దశరథ రామా ॥

సత్కృతి చేయ చతురత నొసగుము
పీడని మమతవై మదిలో నుండుము ॥

నీ చరితములను గానము చేసిన
అన్నమయ్యవలె బ్రోవుము రామా ॥

భారము నీదె భాగ్యము నీదె
జీవన రథమును నడిపే స్వామీ ॥

(1996లో సంకీర్తనా జ్యోతి అనే గ్రంథాన్ని శ్రీరామునికి అంకితమిస్తూ రచించిన పాట)



# మధుధారలు

కీర్తనా కౌముదిని కైకొనుము దేవా
వెన్నెల చూపులు వెదజల్లరావా
బాధామయ జీవితమున నీవేకదా చంద్రుడవు
చైతన్యదీప్తులకు నీవేకదా సూర్యుడవు
దప్పిగొన్న జీవులకు నీవేకదా మేఘుడవు
నమ్మిన వారికి నీవేకదా నాథుడవు ॥
ఓర్వలేని మానవుల అబద్ధాల ప్రచారాలు
అణగిపోవు రీతిగ మహిమ చూపలేవా
రక్షణలో పోషణలో నీవేకదా సర్వము
అల్పులు చాటెదరు అసత్యాల వాక్కులు ॥
ఉపకారము పొందుచు అపకారము చేసే
దుష్టమానవులను దరి చేర్చకు
అపకారము చేయుచు ఉపకారమని పలికే
ధూర్తమానవులకు బుద్ధిగరపరావా॥
జగత్పతివి హరి నీవుండగా భయభ్రాంతులు కలుగవు
పలుగాకుల వేధింపులు చుట్టుముట్టవు
శమము దమము శౌర్యము సమకూరును
ఆత్మబలము సిద్ధించును అన్నిదిశలను ॥
అలసిన మనసుకు అన్నమయ్య కీర్తనలు
చంద్రుని కిరణాలై హాయి గొల్పును
మలయమారుతాలుగా తమపను లాలించును
మధురభక్తి వాహినతో ఓలలాడించును ॥
విశ్వజనుల జిహ్వలకు అన్నమయ్య కీర్తనలు
మధుధారల వోలె మురిపించును
ఇహపర సౌఖ్యాలను ప్రసాదించును
జన్మాంతర వేదనలు సమసిపోవును

(1999లో కీర్తనా కౌముది అనే గ్రంథాన్ని అన్నమయ్య వేంకటేశ్వర పాదారవిందాలకు అంకితమిస్తూ వ్రాసిన పాట)

# అన్నమయ్య సంకీర్తనా సురభి

అన్నమయ్య అని అంటే అన్నమివ్వకుండునా
అన్నయ్య అని అంటే రక్షించకుండునా

మనసుతో వాక్కుతో కర్మతో కవితతో
నీతితో ప్రీతితో రక్తితో భక్తితో
హరినే భజించినాడురా-జనులాలా
మన అన్నమార్య మనుసరించరా ॥

కామక్రోధాలను లోభమోహాలను
మదమాత్సర్యాలను వదలుమని పలికెను
కృషితో సాధించాలిరా-జనులాలా
పరమ సుఖము సమీపించురా ॥

వెలలేని కులలేని స్వామి అనే పండును
మనసున తలచిన మధువులూరు చుండునని
అనుభవమున తెలిపినాడురా-జనులారా
స్వామిమీద మనసు నిలుపురా ॥

ఐహిక బాంధవ్యులు శాశ్వతము కారని
వేంకటరాముడే స్థిరమైన దైవమని
ప్రేమతో వివరించినాడురా-జనులారా
అన్నమయ్య ఆప్తబంధురా ॥

కులభేదము దోషమని జంతుబలులు పాపమని
వేధించుట వలదని తుగువలూ మనుషులని
గళమెత్తి చాటినాడురా-జనులాలా
ఆదరించి ముదము చెందరా ॥

అన్నమయ్య కీర్తనలు అన్నిదిశలు ప్రవహించె
సకల జనులు రాగాబ్ధిలో ఓలలాడి తరియించె
అన్నమయ్య విశ్వగురువురా-జనులారా
తెలుగుతల్లి పులకించెనురా ఆ స్వామియే పరవశించెరా ॥

## శ్రీరస్తు – శుభమస్తు

అన్నమయ్యకు గాక
మోక్షమార్గము గలదా ధరణిలో
జీవరాశులకు
సర్వలోకాధిపా! నీపై సహృద
యము లేని వారలకు ॥
ప్రాణామృత సారము వల్లా
ప్రణవ సారము సప్తగిరుల
పై పారగా క్షీరామృతలోలుడౌ
ఈ స్వరమనోవిధమెరుగరు
వెంకటరమణా

శ్రీ పొన్నా వేంకటరాయులు
(రచయిత్రి తండ్రి)
10-11-2000

---

## ఓం

కనబడే దైవము సప్తగిరీశుడొకడు
ఊరకే భ్రమ చెందకు మనసా
భూమి ఆకాశ మధ్య అంతరంగమున
తిరుగాడుచు
శాంతమాది గుణభూషణుడు
దానవీరుడు సర్వము నిండినవాడు
మోక్షప్రదుడు అన్నమయ్య
మరువడు నీ నామములను

శ్రీ పొన్నా వేంకటరాయులు
10-11-2000

(21)

శ్రీనివాసాయనమః

పల్లవి : మాయన్న అన్నమయ్య మహరాజు కొడుకు
హరినామముతో పాట్టనింపుకొనువాడు ॥

అనుపల్లవి : హరిచేసిన పనులన్ని అవలీలగ ఎత్తిచూపినవాడు
మీనావతారము మొదలు కలికి అవతారము వరకు
రాత్రి పగలు లేక ధ్యానించినవాడు ॥

చరణం : హరినామమునే ధనముగా తలచి తరించినవాడు
ఐదువందల యాభైవత్సరములకు మునుపు
హరినామమనే పైరు పెట్టిపోయిన
అన్నమయ్యకు ఈనాటికీ ఆ హరే
సేవచేయుచున్నాడు

పరమ పురుషుడని నమ్మిన పొనకం గ్రామమున
వేంకటేశ్వరునే తలచు వేంకటరాయులను
బ్రోవసయ్యా

రచన : శ్రీ పొన్నా వేంకటరాయులు
9-2-1998



# అన్నమయ్య హరిభక్తి

మా అన్న అన్నమయ్య మహనీయుడు
హరినే చూచు కన్నులు కలవాడు॥

హరి ధ్యానమె తనకు ఆధారమైనవాడు
హరి నామముపైన కర్తానందము చెందువాడు
హరి ఒక్కడె తనకు ఆధారదైవమనువాడు
హరి విన్నపములే తననోట పలుకువాడు॥

హరినామముతో పొట్ట నింపుకొనువాడు
హరి దశ నామములపై మనసు నిలిపి ధ్యానించువాడు
హరి శ్రీ వేంకటేశ్వరుని నమ్మి కొలిచేవాడు
హరిహరి శ్రీనివాసుడని ధ్యానించువాడు॥

హరి శేషాద్రీశుడని పలు విధముల కొలిచేవాడు
హరి గరుడాద్రీశు పదములను కొలిచేవాడు
హరి సింహగిరి వెలసినవాడని నిండ కొలిచేవాడు
హరి శ్రీ పద్మావతి శ్రీ వేంకటపతిని నమ్మినవాడు



పొన్నా వేంకటరాయలు
18-5-1998

# అనుబంధం - 2

పూర్వజన్మల నుంచి అభివృద్ధి చేసుకొని వస్తున్న వారివారి సంస్కారాన్ని బట్టి, దైవానుగ్రహాన్ని బట్టీ, వంశ వారసత్వాన్నిబట్టి, స్వయంకృషి, భక్తిజ్ఞానాలను బట్టి వారి వారి మనస్సులు ఆయా అంశాలపై లగ్నమవుతుంటాయి. అలా అన్నమాచార్య సంకీర్తనలపైనా మనస్సు లగ్నమయింది. సంకీర్తనల్ని పాడాలనిపించినప్పుడు పాడుకోవడం, చదవాలనిపించినప్పుడు చదువుకోవడం, కొత్త అంశాల్ని కనుగొన్నప్పుడు వ్యాసాలుగా, పుస్తకాలుగా, ఉపన్యాసాలుగా వెలువరించడం నా కర్తవ్యాల్లో ముఖ్య కర్తవ్యమయింది.

ఇలా నా కర్తవ్యాన్ని, నా మాటను, నా పాటను, నా వ్రాతను, నా చేతను గుర్తించిన సాధారణ మనుషులు, అసాధారణ మనీషులు, కవులు, కవయిత్రులు, వైద్యనిపుణులు, భక్తులు, జ్ఞానులు, సాహితీమూర్తులు, సౌజన్య హృదయులు ఎందరెందరో ఫోన్లద్వారా, ఉత్తరాలద్వారా, మౌఖిక వాక్కులద్వారా అభినందనలు తెలియజేస్తూ నన్ను ప్రోత్సహిస్తుంటారు. వేలుగా, లక్షలుగా డబ్బు ఇచ్చినా లభించని ప్రేమాభిమానాలు, ప్రోత్సాహంతో కూడిన వారి వాక్యాలు చంద్రకిరణాల్లా నా మనస్సుకు ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. అనుభూతి బాష్పాల్ని కురిపిస్తాయి. అందుకే వారి వాక్యాలకు ఈ పుస్తకంలో శాశ్వతస్థానం ఇవ్వాలని ఈ అనుబంధంలో పొందుపరచడం జరిగింది. అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుల కృపాధారలు వారిపై నిరంతరం వర్షించాలని కోరుకోవడం తప్ప వారికి ఎలా ఋణం తీర్చుకోగలను!



శ్రీరస్తు

సౌజన్య సింధువు

డా. పొన్నా లీలావతిగారికి

## ప్రశంసా పద్య ప్రసూన మాలిక

మహిత పొన్నా కులాబ్ధి మహిమకరబింబ
మపయి పొల్చు లీలావతీ మానినీతి
లకమ! సంగీత శారద! లలిత సద్గు
ణాఢ్య! నీకు నా హార్ద్రాభినందనంబు
ఆంధ్ర సాహితీ నిర్ఝరోద్యాన సీమ
కావ్య పారిజాత సుమ సుగంధ మొసంగి
సహృదయ ఛ్ఛాత్ర సారంగ సంచయమును
దనియఁ జేసెడి చదువుల తల్లి వీవు.

శ్రీ మెండా చినసీతారామయ్య
రిటైర్డ్ ఆంధ్రోపన్యాసకులు
ఫోన్ నెం 417044
ధవళేశ్వరం, 18-12-2001
తూ॥గో॥జిల్లా

---

అమ్మా! లీలావతీ!

సహజంగా సభల్లో వాద్యసహకారం లేకుండా గాయనీ గాయకులు పాటలు పాడలేరు ఒకవేళ పాడినా శ్రోతలను మురిపించలేరు. అలాంటిది వాద్యసహకారం లేకపోయినా సంకీర్తనలు పాడి సభలను రంజింపచేస్తున్నా వంటే ఆశ్చర్యం వేస్తుంది! వాద్యాలన్నీ మింగేశావా ఏంటితల్లీ! నీ కంఠ మాధుర్యం వింటే అలా అనిపిస్తుందమ్మా.

—ఒక సాధారణ భక్తురాలు
27-12-2001, శ్రీకాకుళంజిల్లా
నరసన్నపేట.

లీలాపతిగారూ!

అన్నమయ్య అనగానే శ్రీ వేంకటేశ్వరుడు గుర్తుకొస్తాడు. లీలాపతి అనగానే అన్నమయ్య గుర్తుకొస్తాడు. అన్నమయ్య సంకీర్తనలతో మీరు తాదాత్మ్యం చెంది మాట్లాడుతుంటే, పాడుతుంటే శ్రోతలు తన్మయత్వం చెందుతారు. మీ కంఠస్వరం సుమధురం. మీ వినయం, మీ సౌజన్యం మీ కళకు, విద్యకు అదనపు శోభనిచ్చాయి. అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరులు మిమ్మల్ని సదా రక్షింతురుగాక!

—శ్రీ టి బాజ్జీ, M.Sc.,
—శ్రీ టి గోపాలకృష్ణ
శ్రీకాకుళం జిల్లా, నరసన్నపేట
27-12-2001

## అక్షరశిల్పం

తే. గీ లీల లీలలు జూడనే లీలపత్తు
మధుర కంఠమును వినగల మార్గమేది
అంధతయే వచ్చి నిలచి నాకడ్డుగాను
శారదాంబయె నాదిక్కు సాగగాను॥

తే. గీ పొన్న వృక్షంబు కృష్ణయ్యకున్న నీడ
గోపికావళి కోరిన గొప్పచెట్టు
పొట్టి శ్రీరాము సంస్థలో గట్టిదైన
యందలీలయె యం.ఫిల్. ను పండజేయ

తే. గీ శ్రీను పేరున్న విద్యార్థి సిరులునింద
ధీనిధిని యిచ్చి నిలచె సాధ్వీలలామ
సహన సహకార భావాల సంద్రమాయె
అక్షరాలలో యాశీస్సులందుకొనుమ

తే గీ. కవిని మాత్రమె నేగాను గాయకుండ
ధనికవర్గాల పేట నాధారికాదు
శారదాదేవి సేవయే శక్తినాకు
కవి నికేతను నాకున్న గల్పతరువు

తే, గీ. ఏప్రియులు పదునెమ నేనెడుగు దినము
అరువదాపైన మూడేండ్ల నావరించె
ప్రజల యభిమాన ధనమె నాపంటజేను
మరచిపోబోకు మీకవిన్ మదినిలీల

## అక్షరలీల

పాన్నాన్వయోద్భవీ! పుణ్యజీవివి నీవు
న్నాయకీరారంభ పటము లేనట్లు
లీలావతికి సాటిలేరెప్వరిచ్చోట
లాస్యపార్వతి నిన్ను లాలించిగాచుత
వరమిచ్చి బ్రోచుత! వాణినిన్నెప్పుడున్
తిరుమలేశుడె నిన్ను దిద్దె నీరీతి

1-1-2002

కవిమిత్ర శృంగారకవి రాధాకృష్ణ
కవి నికేతన్ స్థాపకులు, ప గో జిలా.
ఫోన్ : 08814-74051 నర్సాపురం-534 275



డా. ఆర్వీయస్ సుందరం
పిహెచ్.డి. డి.లిట్
తెలుగు శాఖ ఆచార్యులు
మైసూర్ విశ్వవిద్యాలయం
మానసగంగోత్రి, మైసూరు 570006

తేది : 2-3-2000

డా. లీలావతిగారికి అభినందనలు.

మీ సంగీత రూపకం అందింది, చాలా సంతోషం. మీరు కాలాన్ని సద్వినియోగం చేసుకుంటూ జీవితాన్ని అన్నమయ్య అధ్యయన సేవలో గడుపుతూ విశ్వవిద్యాలయ అధ్యాపకులకు ఆదర్శంగా ఉన్నారు. అన్నమయ్యది తిరుమలేశుని సేవ. మీది అన్నమయ సేవ. ఇద్దరి నిష్ఠా ప్రశంసారమేవా. అభినందనలతో

ఆర్వీయస్. సుందరం

---

సహృదయిని లీలావతికి అభినందనలు !

'అన్నమయ్య కవిత్వం అనే గడియారానికి లీలావతి లోలకం'
'చల్లదనం అన్నమయ్య కవిత్వానికి మూలకందం కాబట్టి మీమనస్సు ఎప్పుడు చల్లదనాన్నే కోరుతుంది ?

కవయిత్రి తిలకం
శ్రీమతి కొలకలూరి స్వరూపారాణి గారు
8-3-2002 తేదీన హైదరాబాద్‌లో అఖిలభారత
తెలుగు కవయిత్రుల సమావేశంలో కలసి
నప్పుడు వారి ముఖతః వెలువడిన చమత్కారాల
వాక్యాలు.

యానాం
20-3-2002

గౌరవ నీయులైన డా. పొన్నాలీలావతి గారికి నమస్తే.

మీరెంతో ఆప్యాయంగా ఇచ్చిన 'తాళ్ళపాక తన్మయత్వం' చదివాను. ఈ సంగీతం రూపకం నాలాంటి వాడికి చదవాడం కంటే వినడమే బాగుంటుంది గొంతులోని శ్రావ్యత కారణంగా అద్భుత మైన లయతో అర్ధం, భక్తి భావాలు మరింత శోభాయమానంగా వినిపిస్తాయి.

మొన్న తెలుగు పండుగ సందర్భంగా కాకినాడ మీరు పాడిన 'తెలుగు వాడవై వుండి తెలుగును మాట్లాడుటకు సిగ్గు పడే వేళలో తెలుగు సోదరా' అనే పాట బాగుంది.

మీరు 'తాళ్ళపాక తన్మయత్వం' అనే సంగీత రూపకాన్ని చిన్న పుస్తకంగా వెలువర్చడం వల్ల సంగీత నృత్య కళాకారులకు బాగా ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాను

శుభాకాంక్షలతో
దాట్ల దేవదానంరాజు
ఎం.ఎ., ఎం ఇడి.

4-381, జక్రియనగర్
యానాం - 533464, ఫోన్ : 0884 321096

.........

లీలావతి అన్నమయ్య సంకీర్తనలను అన్నమయ్య లాగా అంత బాగా పాడుతుంది.

ఆచార్య బి. అరుణాకుమారి
రిటైర్డ్ తెలుగు అధ్యాపకులు
ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్టణ

.........

లీలావతి గారు అపర అన్నమయ్యలా అనిపిస్తారు

డా. అద్దేపల్లి రామమోహనరావు
ప్రఖ్యాతసాహితీవేత్త,
బహు సాహితీ పురస్కారగ్రహీత
కాకినాడ.

... ... ...

లీలావతిగారు అన్నమయ్య సంకీర్తనల్లో లీనమై జీవిస్తున్నారు. వారు ఎదుర్కొనే ప్రతి సమస్యకు అన్నమయ్య సంకీర్తనల్లో పరిష్కారం వెతుక్కొని ధైర్యంగా ముందుకు సాగుతుంటారు.

శ్రీ సన్నిధానం నరసింహశర్మ
బహు పురస్కార గ్రహీత,
గౌతమి గ్రంథాలయం, రాజమండ్రి

... ... ...

డా. లీలావతగారి జన్మస్థలం 'పానకం' మధురం. ఆమె రూపం మధురం ఆమె మాట మధురం. ఆమె పాట మధురం. ఆమె హృదయం మధురం. అన్ని దైవానుగ్రహం వల్ల ఆమెకు సిద్ధించాయి.

డా. మీగడ రామలింగ స్వామి
తెలుగు అధ్యాపకులు
ప్రఖ్యాత నాటక కళాకోవిదులు
విశాఖపట్టణం

... ... ...

డా పి. లీలావతిగారు ఒక చేతితో పరిశోధన, మరో చేతితో సృజన అమోఘంగా నిర్వహిస్తున్న ఒక అపూర్వమైన రెండుకళల సమ్మేళనం. వ్రాయగల్గడమే కాదు చాలా కమనీయంగా పాడగల్గడం కూడా ఆపైన వారి ఇష్టదైవం ఏడుకొండలవాడు అనుగ్రహించిన ఒక విశేషవరం

[రాజమండ్రి ఆనంతకళాకేంద్రంలో 2000 సం॥ ద్విసహస్రాబ్ది మహోత్సవాల్లో భాగంలో జరిగిన కలిసమ్మేళన సభలో

'సహస్రాబ్ది దేవతకు స్వాగతాంజలి

అరుదిడుము కురిపించుము మోదావళి' అనే స్వీయగేయాలాపన చేసినప్పుడు మా తెలుగు విశ్వవిద్యాలయం సాహిత్య పీఠాధిపతి ప్రతిభావైజయంతిక పురస్కార గ్రహీత, సభాధ్యక్షులు ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు సభకు నన్ను గూర్చి పరిచయం చేస్తూ పలికిన అభినందన వాక్కులు]

శ్రీ ఎ జె. శేఖర్ ప్రసాద్, ఎం.ఎ పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్, ఎం. ఎ, (రూరల్ డెవలెప్‌మెంట్)
పి.బి సి ఆఫీసర్, ఆంధ్రాబ్యాంక్
30/159 తేది : 13-4-2002
రెవిన్యూ క్వార్టర్స్
నంద్యాల, కర్నూల్ జిల్లా
పిన్ కోడ్‌నంబర్ – 518501

......

గౌరవనీయురాలైన డా. పాన్నాలీలావతి గారికి అభినందనలు,

మీరు సహృదయంతో ఇచ్చిన అన్నమాచార్య పరిశోధన గ్రంథాలను, ఇతరమైన సృజనాత్మక కావ్యాలను చూచి ఎంతో సంతోషించాను మీ జీవితానుభవాలను, సాహితీ జ్ఞానాన్ని ఇలా కావ్యాలుగా రూపొందించడం అందరికీ సాధ్యమయ్యే పనికాదు. మీ కావ్యాలను చదివినవారికి తప్పకుండా చైతన్యం కలుగుతుంది.

"తాళ్ళపాక తన్మయత్వం" అనే సంగీతరూపకం పుస్తకం ఎంతో మంది కళాకారులకు ఉపయోగపడుతుంది ఇదివరకే ఈ సంగీతరూపకం విజయవాడ ఆకాశవాణి ద్వారా శ్రోతలకు పరిచయం కావడం, ఆ రూపకం నేడు ఈ చిన్నగ్రంథ రూపందాల్చి పాఠకులచే ప్రశంసలందుకోవడం

అభినందనీయం. మీ కష్టార్జితాన్ని ఇలా అన్నమయ్య గ్రంథముద్రణ కుపయోగించి సాహితీలోకానికందించడం మీ అంకితభావాన్ని తెలియ జేస్తుంది.

రాయలసీమలో పుట్టి పెరిగిన అన్నమయ్య రచించిన శ్రీ వేంకటే శ్వర సంకీర్తనలపై, అదే రాయలసీమలో పుట్టి పెరిగిన మీరు అన్ని కోణాల నుంచి అన్నమయ్య సంకీర్తనలను పరిశీలించి గ్రంథాలుగా ముద్రించి అందించడం విశేషం. ఇది మీరు నమ్ముకున్న అన్నమయ్య శ్రీ వేంకటే శ్వరుల కృపవల్లనే సాధ్యం.

తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఎం. ఎ పబ్లిక్ అడ్మి నిస్ట్రేషన్ చదివిన నేను అదే విశ్వవిద్యాలయంలో ఎం ఎ, తెలుగు చదివిన మిమ్మల్ని చూసి, మీ నిరంతర సాహితీ కృషిని గమనించి ఎంతో ఆనంది స్తున్నాను. మీ కృషి ఇలాగే కొనసాగాలని దైవాన్ని ప్రార్థిస్తున్నాను.

ఉగాది శుభాకాంక్షలతో

ఎ. జె. శేఖర్ ప్రసాద్

కోకిల పాడుతుంది. మాట్లాడదు. ఒకవేళ మాట్లాడితే ఎలా ఉంటుం దంటే డా లీలావతిగారు మాట్లాడుతున్నట్లుంటుంది. ఆమె కంఠస్వరం అంత తియ్యనైనది,

శ్రీ నిమ్మలపూడి వీరరాజు
శ్రీరామ భక్తగానసభ, రాజమండ్రి
ఏప్రిల్ 2001

---

సహజ సౌందర్యం ఉన్నవారికి ఆభరణాలు అవసరంలేనట్లుగా లీలావతి గానానికి వాద్యసహకారం లేంపోయినా పరవాలేదు. ఆమె తన సహజ కంఠగానమాధుర్యంతో సభను రంజింపజేయగలదు.

డా. బి. యన్ మూర్తి
శ్రీ గౌతమి విద్యాపీఠం
రాజమండ్రి
ఏప్రియల్ 2001

డా॥ కర్రి రామారెడ్డి
ప్రఖ్యాత మానసిక వైద్యనిపుణులు, రాజమండ్రి.

# అభినందన వాక్యాలు

డా. పొన్నా లీలావతిగారు ఇంత చిన్న వయసులో అన్నమయ్య సంకీర్తనలకు సంబంధించిన ఇన్ని గ్రంథాలు రచించి లోకానికి అందిస్తుండటం చూస్తుంటే ఎంతో ఆశ్చర్యం కలుగుతుంది. మనం వాగ్గేయకారుల్ని గూర్చి విన్నాం. కానీ వాగ్గేయకారిణిలను గూర్చి వినలేదు. డా. లీలావతి గారు వాగ్గేయకారిణి వారు స్వయంగా పాటలు వ్రాసి సంగీతం కూర్చుకొని మధురంగా ఆలపిస్తారు వారు వ్రాసి పాడిన "సకలకళా పురంధ్ర రాజమహేంద్రి" అనేపాట వింటుంటే ఆనాడు అరుద్రగారు వ్రాసిన వేదంలా ఘోషించే గోదావరి, అమర ధామంలా శోభిల్లే రాజమహేంద్రి" అనేపాట గుర్తుకొస్తుంది.

డా. లీలావతిగారు అన్నమయ్యపైకూడా ఎన్నో పాటలు వ్రాసి కోకిల లాగే పాడుతుంటారు. నేను డా. లీలావతిగారి అభిమానిని, ఎందుకంటే వారు ఎంతో కష్టపడి పరిశోధించి వ్రాస్తున్న అన్నమాచార్య పుస్తకాలను చదువుతుంటే అన్నమయ్య సంకీర్తనల్లో ఇన్ని అపూర్వమైన, అపురూపమైన సాహిత్యాంశాలున్నాయా అనే ఆశ్చర్యం కలుగుతుంది. అన్నమయ్యపై ఇంకా జిజ్ఞాస పెరుగుతుంది లీలావతిగారి గ్రంథాలను మళ్ళీ మళ్ళీ చదవాలనిపిస్తుంది.

ప్రఖ్యాత మానస వైద్యనిపుణులు, బహువిద్యా ప్రవీణులు, అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుల పరమభక్తులు, మానవసేవా తత్పరులు, వినయశీలి, మృదుహృదయులు డా, కర్రి రామారెడ్డిగారు ఆయా సాహిత్య సభలకు అధ్యక్షులుగా ఉన్నప్పుడు పలికిన ఈ అభినందన వాక్యాలు వారి సౌజన్యానికి నిలువుటద్దాలు ఇవి నా మనసుకు స్ఫూర్తి కిరణాలు. డా. రామారెడ్డిగారి హరిభక్తిని గూర్చి, వారి మహోన్నత గుణగణాలను చిత్తశుద్ధిని, మానవసేవాభిలాషను దాతృత్వాన్ని గూర్చి నేను కొత్తగా

రాజమహేంద్రికి వచ్చిన కొన్నాళ్ళకు ఇతరుల ద్వారా విన్నాను నా మనసు, అభిరుచి కూడా అలాంటివే కావడంవల్ల అప్పటినుంచే నేను వారి అభిమానినయ్యాను. తర్వాత చాలా సంవత్సరాలకు సాహిత్య సభల్లో వారిని ప్రత్యక్షంగా చూడటం సంభాషించడం జరిగింది. ఇలా వారితో భక్తి, సంగీతం, సాహిత్యం, వ్యక్తిత్వం పరంగా ఆత్మీయత, అనుబంధం ఏర్పడటం, సముద్రమంతటి మహోన్నతులైన వారి అభిమానానికి పాత్రు రాలు కావడం నిజంగా నా అదృష్టం. అది అన్నమయ్య శ్రీ వేంకటేశ్వ రుల కృపాకటాక్షం]

.........

ప్రఖ్యాత వైద్యనిపుణులు
## డా. తేతలి వెంకటేశ్వరరావు
గవర్నమెంట్ హాస్పిటల్ సూపరింటెండెంట్, రాజమండ్రి,

## ఆశీస్సులు

డా. లీలావతిగారు మా క్లినిక్‌కు పక్క ఇంట్లో ఉండేవారు. అప్పుడు ఆమె సర్టిఫికేట్స్ కోసం నాదగ్గరకు వస్తుండేవారు. నేను మెడిసన్ తిరుపతి లో చదువుకోవడంవల్ల మా మాటల్లో అక్కడి ప్రసక్తులు వస్తుండేవి డా. లీలావతిగారు తాము వ్రాసిన అన్నమాచార్య పుస్తకాలను నాకు అందించారు. ఈమెను చూస్తే ఒక విద్యార్థిగానే అనిపిస్తారు తప్ప ప్రొఫె సర్‌గా అనిపించరు. ఇంత చిన్న వయసులోనే ఇన్ని గ్రంథాలను ఎలా వ్రాశారా అని నాకు ఆశ్చర్యం, ఆనందం కలిగింది, ఆమెపై నాకు ఈ విధంగా ఆత్మీయత ఏర్పడింది. ఈరోజు సమాచారం పత్రికలో డా. లీలా వతిగారి అన్నమాచార్య ప్రసంగం ఉందని తెలిసి వినాలనే అభిలాషతో ఈ సభకు వచ్చాను. డా. లీలావతిగారి ప్రసంగం, శ్రావ్యమైన సంకీర్తనా గానం విని ఎంతో ఆనందించాను.

డా. లీలావతిగారు ఇలాగే సభల్లో ప్రసంగాలు, గానాలాపనచేసి శ్రోత లను రంజింపచేయాలని, ఇంకా అన్నమయ్య సంకీర్తనల్లోని కొత్త కొత్త

అంశాల్ని కనుగొని గ్రంథాలు వ్రాసి లోకానికి అందించాలని అందుకు శ్రీ అన్నమయ్య వేంకటేశ్వరులు అమెకు ఆయురారోగ్య సౌభాగ్యాలను ప్రసాదించాలని కోరుకుంటున్నాను.

డాక్టర్లకు ప్రతి సెకండూ ఎంతో ముఖ్యమయింది రోగుల సేవతో అనుక్షణం ఏమాత్రం తీరికలేకపోయినా డా. తేతలి వేంకటేశ్వరరావుగారు ఏలాగో సమయం కల్పించుకొని శ్రీ నిమ్మలపూడి వీర్రాజుగారు ఏర్పాటు చేసిన శ్రీరామనవమి సాహిత్యసభకు వచ్చారు. ప్రత్యేకంగా అన్నమయ్య పై నా ప్రసంగ విషయం పత్రికద్వారా తెలుసుకొని ఎంతో అభిలాషతో వచ్చి నా ప్రసంగాన్ని, గానాన్ని విని ముగ్ధులయ్యారు ఎంతో వాత్సల్యంతో వేదిక మీదికి వచ్చి ఇలా ఆశీర్వదించారు అందుకు "వైద్యో నారాయణో హరిః" అన్న సూక్తికి నిదర్శనమైన డా. తెతలి వెంకటేశ్వరరావుగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాంజలి. నిజమైన ఆత్మీయులు, ఆప్తబాంధవులు, సాహిత్య బాంధవులు అంటే ఇలాంటివారే ఎప్పుడూ డబ్బు, భౌతికవస్తువులే లోకంగా కలిగిన రక్తబంధువుల వల్ల, స్వార్థపరులవల్ల బాధ, నిరుత్సాహం తప్ప ఇంకేమి మిగలదు. నిర్మల హృదయం కలిగిన ఇలాంటి సజ్జనుల వాక్కులే మనసుకు వెన్నెల తేటలా ఆహ్లాదాన్ని కలిగిస్తాయి.]



1-3-2002

డా॥ కె. వి. వి. సత్యనారాయణ
ఆర్.ఎం.పి. వంశీ క్లినిక్, ఘంటసాలసింగర్
రాగమయి ఆర్కెస్ట్రా, ఘంటసాల భగవద్గీతాగానం
వివాహ సన్మాన, సభానిర్వహణ వ్యాఖ్యాత
వెలుగుబంద, తూ.గో.జిల్లా ఫోన్: 484135

## లీ లా కో కి ల

రాజమహేంద్రి సాహిత్య వినీలాకాశంలో ప్రకాశిస్తున్న ఓ సాహితీ సుమాలమాల సుస్వరాల కోకిల డా. పొన్నా లీలాగారు. లీలాగారి

జీవిత పుస్తకాలను చదివితే నా కనిపిస్తుంది– ఆ వేంకటేశ్వరుడు లేవ గానే ముందుగా లీలగారి దినచర్యను నిరాటంకంగా సాగిపోయేలా మలచి ఆ తర్వాత మిగిలిన పనులు చూసుకుంటాడేమో అనిపిస్తుంది'. లీలగారి కున్న శ్రీ వేంకటేశ్వరభక్తి, స్వామివారికి ఆమెపై ఉన్న వాత్సల్యం అంత టిది. శ్రీహరిభక్తి, జ్ఞానం, దయ, దానశీలం, సంగీతసాహిత్యాది కళలు మొదలైనవన్నీ లీలాగారికి వంశపారంపర్యంగా వచ్చిన దివ్యవరాలు.

అన్నమయ్య సంకీర్తనలపై పరిశోధనలు చేసి డాక్టరేట్ పట్టాలు పొంది, ఉద్యోగాలు సంపాదించుకొని తర్వాత అన్నమయ్యను వదిలేసిన వారెందరో ఉన్నారు కానీ లీలగారు అలాకాదు. అన్నమయ్య తనచేత పి.హెచ్‌డి. చేయించాడని, తనకు ఉద్యోగానికి బాసటగా నిలిచాడని, ఈ ఉద్యోగం ఆయనదే అని, అన్నమయ్యే తన జీవిత సర్వస్వమని చెప్పుతుం టారు. అందుకు కృతజ్ఞతగా ఈపాటి ప్రయత్నాలు చేస్తుటాను అని లీలగారు చెప్పుకోవడం వారి సౌజన్యహృదయానికి నిదర్శనం. అందువల్ల లీలగారు అన్నమయ్యను వదలకుండా ఎన్నో కోణాల్లనుంచి పరిశోధనలు చేస్తూనే ఉన్నారు, కొన్ని గ్రంథాలకు టి. టి. డి. వారి ఆర్థికసహాయాన్ని కోరకుండానే తమ సౌకర్యాల్ని, అవసరాల్ని, విహారాల్ని త్యజించి స్వం తంగా ఖర్చుపెట్టి గ్రంథాలను ముద్రిస్తున్నారు. ఇది ఆమెకున్న అంకిత భావాన్ని తెలియజేస్తుంది.

డా. లీలగారి సన్నిధి ఎంతోమందికి పెన్నిధిలా, కల్పతరువులా భాసి స్తుంది. ఆమె నీడలో పెరిగి, ఆమె బోధనలకు ప్రభావితం చెంది ప్రకా శించిన వారెందరోఉన్నారు. అయితే లీలగారు చేసిన ఉపకారాలు, త్యా గాలు ఆమెను కష్టాల కడలిలో ముంచాయి. లీలగారు జీవితంలో అనుభ వించినన్ని కష్టాలు ఈ ప్రపంచంలో ఎవ్వరూ అనుభవించి ఉండరేమో అనిపిస్తోంది. అయినా ఆమె ప్రియదైవాలు అన్నమయ్య శ్రీ వేంకటేశ్వ రులు ఆమెను అనుక్షణం అంటిపెట్టుకొని కాపాడుతుంటున్నారు. ఇలా లీలగారి శక్తిసామర్థ్యాల్ని లోకానికి నిరూపించడానికి, తన మహిమల్ని చాటు కోవడానికి భగవంతుడే ఆమెకు కష్టాల్ని కలిగిస్తున్నాడేమో అనిపిసుంది.

డా. లీలగారికి క్షణం తీరిక లేకపోయినా సంగీత సాహిత్యాభిమానుల ఆహ్వానం మేరకు ఎంతసుదూరమైన శ్రమపడి ఓర్పుతోవెళ్ళి తమ సాహిత్య జ్ఞానాన్ని, తమ మధురమైన మాటను, సుమధురమైన పాటను వినిపించి వస్తున్నారు. ఇలా సభను ఆనందడోలికల్లో ఉర్రూతలూగించి ప్రేక్షకులచే విశేషమైన, ఘనమైన ప్రశంసలందుకోవడం ఆమె పూర్వజన్మసుకృతం.

చాలా మందికి సాహిత్యం ఉంటే కమ్మని కంఠస్వరం ఉండదు. కమ్మని కంఠస్వరం ఉంటే సాహిత్యం ఉండదు కానీ డా లీలగారికి సాహిత్యం, తియ్యని కోకిల కంఠం రెండూ స్వంతం అయ్యాయి. వారి మాటలలో పాటలలో స్వచ్ఛత, స్పష్టత, సరళత, శ్రావ్యత సంపూర్ణంగా ఉన్నాయి. లీలగారు ఇలాగాన ప్రసంగాల ద్వారానే కాక రాత్రింబవళ్ళు శ్రమపడి ఆత్మీయతతో అన్నమయ్యపై పరిశోధనలు చేసి వాటికి ఎంతో ఆలోచించి [illegible] ర్థు పెట్టి గ్రంథాలు ముద్రిస్తున్నారు. వారి గ్రంథాలన్నీ పాఠకులచే, ప్రసిద్ధ సంగీత సాహిత్య విద్వాంసులచే ప్రస్తుతి గాంచాయి.

ప్రస్తుతం లీలగారు తమ సరస్వతీ కరకమలాలతో రచించిన "సంకీర్తనా సౌరభం" అనే గ్రంథాన్ని ముద్రిస్తూన్నారు. ఈ శుభసందర్భంగా నా మనసులోని భావాలను వ్రాసివ్వాలనిపించింది. దీన్ని తమ గ్రంథంలో ముద్రించడానికి పెద్దమనస్సుతో అంగీకరించి స్వీకరించడం నా భాగ్య విశేషంగా భావిస్తున్నాను. డా. లీలగారి సహృదయుతకు నా కృతజ్ఞతాంజలి

డా. లీలగారి "సంకీర్తనా సౌరభం" గ్రంథం సాహితీ ప్రపంచంలో అపూర్వంగా గుబాళించాలని, ఇంకా ఇలాంటి గ్రంథాలు రచించి లోకానికి అందించాలని అందుకు అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరులు వారికి ఆయురారోగ్య ఐశ్వర్యాలను ప్రసాదించాలని ప్రార్థిస్తూన్నాను.

కె.వి.వి. సత్యనారాయణ

లీలావతి గారూ! మీరు చివరిశ్వాసవరకు అన్నమయ్య కీర్తనలను ఇలాగే మధురంగా పాడుతూ శ్రోతలను మురిపిస్తుండాలి. సాహిత్యంలో వినూత్నాంశాలను కనుగొంటూ పాఠకులకు అందిస్తుండాలి. అందుకు మీ ప్రియదైవం శ్రీ వేంకటేశ్వరుడు ఆయురారోగ్య ఐశ్వర్యాలను ప్రసాదించాలి,

శ్రీమతి బి. ఉమాదేవి
ఆదోని, కర్నూల్ జిల్లా
27-3-2002

[విశాఖపట్టణం, ఆంధ్ర విశ్వవిద్యాలయం పునశ్చరణ తరగతుల్లో కలుసుకున్నప్పుడు పలికిన వాక్యాలు]

.........

## శ్రీమతే రామానుజాయనమః

గౌరవనీయులైన డా. పాన్నా లీలావతిగారికి హృదయాంజలితో వ్రాయునది.

మీరు వ్రాసిన 'పదకవితా వైజయంతి' గ్రంథాన్ని నేను చదివాను. మీరు అన్నమయ్యను గూర్చి బహుచక్కని విశ్లేషణతో, ఎన్నో విషయాలపై శోధించి, మీ ఆలోచనా సరళిని జతకలిపి పొందుపరచిన వ్యాసపరంపర చూసినప్పుడు నాకెంతో ఆశ్చర్యంతోపాటు మహదానందం కలిగింది.

అన్నమయ్య శిష్యురాలా? ఏమిటి? అన్నంతగా వచనంలో విశ్లేషణాత్మకంగా మీరు మలచిన తీరులు బాగున్నది. అన్నమయ్యపై మీకున్న గాఢానురాగం శ్రీ వేంకటేశ్వరుని అనుగ్రహమే. మీరు ఇలాగే ఉత్తమ వ్యాసవాహిని అందించి ప్రవహింపజేయాలని మా కులదైవం శ్రీరంగనాథుని ప్రార్థిస్తున్నాను.

అన్నమయ్య, త్యాగయ్య, పోతన మొ॥ భక్తకవివరేణ్యులు నాకు కూడా ఎంతోఇష్టం. మీరు కొత్తగా అన్నమయ్యపై మళ్ళీ ఏవో గ్రంథాలు వ్రాశారని తెలిసింది. దయతో మీరు తెలియజేస్తే సంతోషిస్తాను,

మీ నుండి లేఖను కోరుతూ

అడ్రసు :
తూర్మాచలం వెంకటేశ్వర్లు
7-2-681, మంకమ్మతోట
కరీంనగర్-505002

అన్నమయ్య కవితాప్రియులు
తూర్మాచలం వెంకటేశ్వర్లు
12-12-2001

... ... ...

ఇలా ఎందరెందరో సామాన్య, అసామాన్య పాఠకాభిమానంకన్నా; ప్రేక్షకుల ప్రోత్సాహంకన్నా, సారస్వత కళాహృదయ సరోవరంలో వాడని పద్మంలా అనునిత్యం పరిమళించడంకన్నా మించిన పురస్కారాలు, పరమానందం ఏముంటుంది! ఈ ఆనంద ప్రోత్సాహాలతో నా కర్తవ్యాన్ని ద్విగుణీకృతంగా చేయడానికి సదా ప్రయత్నిస్తాను.

—పొన్నా లీలావతి

— —

# అనుబంధం-3

## రచయిత్రి సంక్షిప్త జీవిత కిరణాలు

రాయలసీమలో ఒక చిన్న మారుమూల పల్లెలో రైతు కుటుంబంలో ఒక ఆడపిల్ల పుట్టింది. తన తండ్రి పొలాల్లో ఎండల్లో కష్టపడి పనిచేస్తుంటే వీపునుంచి కారే చెమటను చూసి బాధపడి రెండేళ్ళ బాల్యంలోనే "ఎండా పోయెండా మా నాయనకు యెండ" అని సూర్యునివైపు చూసి ప్రాధేయపడింది. చదువు, శుభ్రత, దయ, భక్తి, సంగీతం అనే స్నేహితులే ప్రాణంగా పెరిగింది. తల్లిదండ్రుల పోషణలో ఇరవైరెండేండ్లు ఎం.ఎ, వరకు జీవితం సాగించింది. ప్రతిక్షణం భయాందోళనలతో మౌనంగా కాలం గడిపింది. "హరేరామ హరేకృష్ణ" నామస్మరణ చేసుకుంటూ మనసుకు ధైర్యాన్ని అలవాటు చేసుకుంది.

తల్లిదండ్రులతో పాటు పిల్లల పెంపకం, ఇంటిపనులు, పొలాల్లో వ్యవసాయం పనులు చేసింది. శారీరకంగా, మానసికంగా అనేక కష్టాలు భరించింది ఇంటా, బయటా ఎన్నెన్నో దుష్టపోరాటాలు చేసింది. స్వయం కృషితో, గురువర్యుల ఆశీస్సులతో, అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుల అనుగ్రహంతో అనుకున్న విజయాలు సాధించింది. నేడు సాగరసీమలో గోదావరీ నదీసుందరి తీరంలో విరాజిల్లుతున్న రాజమహేంద్రిలో విదుషీమణిగా, రచయిత్రిగా జీవితం సాగిస్తోంది. ఆమె ప్రస్తుత గ్రంథరచయిత్రి. ఆమె జీవితాంశాలు పాఠకులకు చైతన్యకిరణాలు. అందుకే ఇక్కడ క్లుప్తంగా పొందుపరచడం జరిగింది.

జననం : శ్రీ వేంకటనాయకుడు అవతరించిన తిరుపతి సమీపంలోని "పొనకం" అనే గ్రామంలో 30-4-1957 తేదీన (రికార్డ్‌లో తేది, నెల, సంవత్సరం అన్నీ మార్పుజరిగింది)

జననీ జనకులు : శ్రీమతి కలువ అనసూయ, శ్రీ పొన్నా వేంకటరాయలు వీరు ఐదవ తరగతి వరకు చదువుకున్నారు. వీరిది బాల్యవివాహం.

వీరి పెంపుడు బిడ్డలు : సుబ్రహ్మణ్యం, సరస్వతి (వీరు అనసూయగారి అక్క కన్నబిడ్డలు. వీరిని పెంచి ప్రయోజకుల్ని చేసి వీరి కుటుంబ బాధ్యతలను నిర్వహించారు.)

వీరి కన్నబిడ్డలు : సుధాకర్ (బాల్యంలోనే గతించాడు.)
మన రచయిత్రి లీలావతి
భారతి (శిశుప్రాయంలోనే గతించింది)
వీరి తర్వాత పది సంవత్సరాలకు
కృష్ణమూర్తి, పార్వతి, భారతి
వీరిమధ్య మూడేసి సంవత్సరాలు వ్యవధి.
తర్వాత ఆరు సంవత్సరాలకు
వనజ (వాణి), కరుణ
వీరిమధ్య ఒక్క సంవత్సరం వ్యవధి.

ఇలా బ్రతికి వున్నవాళ్ళలో ఒక అబ్బాయితో తృప్తిపడక మరో అబ్బాయికోసం ఎదురుచూడటంతో మరో నలుగురు అమ్మాయిలకు జన్మనిచ్చి కుటుంబ జనాభాను, దేశ జనాభాను పెంచారు.

తాత : శ్రీ పొన్నా కోదండరామ. వీరు సహజ సంగీత సాహిత్య చిత్ర లేఖన, శిల్ప, హరికథా, నాటక కళాకారులు, మహాదాత, రామ భక్తులు, మరణకాలం తెలిసిన కాలజ్ఞాని. ఇతని తల్లికూడ మరణకాలం తెలిసిన మహిమాన్వితురాలు. రచయిత్రి 7వ తరగతి చదువుతున్నప్పుడే తాత శ్రీరామసాయుజ్యం చెందారు. లీలావతిని గొప్ప హరికథా కళాకారిణిగా రూపొందించాలని తాతగారి కాంక్ష. లీలావతిని ఐ. ఎ యస్ అధికారిగా చేయాలని తండ్రి అభిలాష. లీలావతి మనసు అన్నమయ్య మార్గం పట్టింది. అంతా విధి లీల.

వీరివృత్తి : ప్రారంభంలో కుండలతయారీ అయినా లీలావతి జననంతో వ్యవసాయ వృత్తిస్థాయికి ప్రగతి చెందారు. వీరు వరి, చెరకు, వేరుశనగ, పప్పుదినుసులు, కూరగాయలు మొదలైనవి పండిస్తారు.

వీరి ప్రవృత్తి : సంగీత సాహిత్యాలు, ఉన్నంతలో దానధర్మాలు, మానవ సేవ, బంధుమిత్రుల, పేదల, ఆర్తుల ఆదరణ, పరోప కార పరాయణత్వం, ఇతరులకు పెట్టి తినడం వీరి స్వభావం.

సద్గురువు : పానకం గ్రామం సమీపంలోని బ్రాహ్మణపట్టు (కాయంపేట) గ్రామంతో వెలసిన శ్రీరామభక్తుడు, అజన్మ బ్రహ్మచారి, పూర్ణాయుష్కులు, వేదవేదాంగ పురాణ, రామాయణాది కావ్య విజ్ఞానవేత్త, నియమనిష్ఠాగరిష్ఠులు, దయాహృదయులు అన్నదాత శ్రీశ్రీశ్రీ కుంజమూరు గోపాలాచార్యులవారు,

లీలావతి విద్యాభ్యాసం :

1. ప్రాథమిక విద్య, 1963-1967 (ఒకటి నుండి ఐదవ తరగతి వరకు) పానకం సమీపంలోని మిట్టమీదకండ్రిగ అనే గ్రామములో. గురువులు (అయ్యవార్లు అనడం అలవాటు) ఎర్రారెడ్డి (పెద్దయ్యవారు) రాజు (చిన్నయ్యవారు).

2. ఉన్నత విద్య, 1968-72 (ఆరు నుండి పదవ తరగతి వరకు) పానకం గ్రామానికి నాలుగు మైళ్ళ దూరంలోని తిరుచానూరు [శ్రీ పద్మావతీ అమ్మవారు వెలసినచోటు] టౌన్‌లో

రోజూ వెళ్ళడం, రావడం ఎనిమిదిమైళ్ళు పరుగులతో ఎండల్లో వానల్లో, వాగుల్లో, ముళ్ళల్లో, రాళ్ళల్లో కష్టాలు సహించారు. కిరోసిన్ పొగదీపం ముందు కూర్చొని చదువుకున్నారు దారి మధ్యలోనే ఎన్నో పాఠాలను కంఠగతం చేసుకునేవారు. క్రమం తప్పకుండా బడికి వెళ్ళేవారు.

3. కళాశాల విద్య : 1973–77 (ఇంటర్ మీడియట్ నుంచి బి.ఎ. H. T. P. గ్రూప్) తిరుపతి, శ్రీ పద్మావతీ స్త్రీల కళాశాలలో, హాస్టల్‌లో ఉండి చదువుకున్నారు.

4, విశ్వవిద్యాలయం విద్య : 1977-79 ఎం.ఎ. తెలుగు. తిరుపతి, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తెలుగు అధ్యయన శాఖలో హాస్టల్‌లో ఉండి చదువుకున్నారు. ఎం ఎ. లో ఐచ్ఛిక పాఠ్యాంశం-అన్నమాచార్య శృంగార సంకీర్తనలు, పన్నెండవ సంపుటం. అందులో సాహిత్యాంశంలో బోధించిన గురువర్యులు ఆచార్య కె సర్వోత్తమరావుగారు భాషాంశాలను బోధించిన గురువర్యులు ఆచార్య కేతు విశ్వనాథరెడ్డిగారు

5. లింగ్విస్టిక్స్-జూనియర్ డిప్లొమా-1981 శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో.

6. పి. హెచ్. డి. 1980-83.
తిరుపతి, శ్రీ వేంకటేశ్వరవిశ్వవిద్యాలయం తెలుగుశాఖలో ఆచార్య కె సర్వోత్తమరావుగారి పర్యవేక్షణలో.

పరిశోధనాంశం · అన్నమయ్య సంకీర్తనల్లో జానపదగేయ ఫణితులు ఆర్థిక సహాయం అందించినవారు : యు. జి సి. స్కాలర్‌షిప్‌తో సమానంగా అన్నమాచార్య పేరుతో మూడు సంవత్సరాలు ఇరవై రెండు వేలు కేటాయించి తోడ్పడినవారు టి. టి డి. కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె ప్రసాద్‌గారు, వారిబృందం, అన్నమాచార్య ప్రాజెక్టు డైరెక్టర్ శ్రీ కామిశెట్టి శ్రీనివాసులుగారు.

సహకారం : సహకార ప్రోత్సాహాలందించి, ధైర్యం చెప్పి ముందుకు నడిపించి తోడ్పడిన గురువర్యులు ఆచార్య జి యన్ రెడ్డిగారు, ఆచార్య కేతు విశ్వనాథరెడ్డిగారు.

[ఇరవై సంవత్సరాల విద్యాభ్యాస తపస్సులో బాల్యంనుంచీ చివరిదాకా ఎక్కడా ఉంటుపడకుండా చదువే ఊపిరిగా, నృత్యాలు, ఆటలు, పాటలు, పద్యాలు, శ్లోకాలు, దండకాలు నేర్చుకోవడం, పోటీల్లో గెలుపొందడం హాబీలుగా మానవసేవ, భక్తిపరమార్గంగా సాగించారు. ఎనిమిదవ తరగతి చదువుతున్న రోజుల్లో దారిమధ్యలో ఒక వివాహిత యువతి ఆర్తనాదాలతో ఒంటరిగా ఏడుస్తూ వెళ్ళు

తుంటే ఆమెను పలకరించి, ఓదార్చి "అక్కా మా ఇంటికిలా వెళ్ళ దాము. మా అమ్మా నాన్న వాళ్ళుకూడా ఏమీ అనరు, బాగా చూసు కుంటారు" అని ధైర్యంచెప్పి ఇంటికి పిలుచుకుళ్ళారు. అప్పుడు ఇంట్లో పెద్దలు, ఊర్లోవాళ్ళు అందరూ పన్నెండేండ్ల లీలావతి దయా హృదయానికి, బాల్యంలోనే ఆమె చేసిన ఈ ఘనకార్యానికి ఎంతో ఆనందించి ప్రశంసించారు.]

వివాహం : లీలావతి స్వరూప స్వభావాలకు, ప్రవర్తనకు, విద్యావికాసా లకు మెచ్చి వివిధ ప్రాంతాలనుంచి అన్నికులాలకు, అన్ని మతా లకు చెందిన వందలాది మంది వివాహసంబంధంకోసం వచ్చారు. ఎన్నో ప్రయత్నాలు చేశారు. తన అభిరుచులకు, జీవితాశయా లకు సరిపడక లీలావతి సమ్మతించలేదు. కానీ లీలావతి పి.హెచ్ డి. పూర్తి అయ్యాక ఆమెను కలుసుకోవడంకోసం స్వాతు లక్ష్ముడు ఎం.ఎస్సీ కెమిస్ట్రీ చదివిన కె యం. రావు అనే వ్యక్తి వెతుక్కుంటూ రావడం, ఆమె కట్టు, బొట్టు. మాట, మర్యాద, ఆప్యాయత, సున్నితత్వం, సంప్రదాయం విడువని ఆధునికశైలికి ఎంతో ముగ్ధుడు కావడం, ఆ పరిచయం ప్రేమగా, వివాహాభి లాషగా మారడం, లీలావతి తనకు వివాహకాంక్ష లేదని, తన జీవితగమ్యం వేరు అని ఎంతచెప్పినా వినకుండా పట్టుదలతో మనస్సును మెప్పించడం, శ్రీ రామునిముందు ప్రమాణాలు చేయడం, ఇంట్లో కొందరికి ఇష్టం లేక ఆటంకాలు కలిగించినా ఆమె అతన్ని మనసారానమ్మి, తన నిబంధనలను తెలియజేసి 2-2-1987 లో తిరుపతి సమీపంలో దేవాలయంలోను, ఆపైన చట్టరీత్యా కూడా రిజిస్టర్డ్ వివాహం చేసుకోవడం జరిగింది తనతో సమానంగా విద్యార్హతలుండాలని అతన్ని పిహెచ్ డి.లో చేరేలా చేసి అన్ని విధాలా వ్యక్తిత్వాన్ని సంస్కరించింది కూడా లీలవతి గారే.

వివాహం చట్టరీత్యా రద్దు కావడం :

లీలావతికి చిన్ననాటి నుంచి ప్రత్యేకమైన దృఢ వ్యక్తిత్వం ఉంది

ఎన్ని కష్టాలు, నష్టాలు వచ్చినా చెడుతో రాజీపడని సుకుమార మనస్తత్వం ఆమెది. నరుడు అశాశ్వతమని, నారాయణుడే శాశ్వతమని, అదే జీవిత పరమార్థమని చిన్ననాడే గ్రహించారు. అయితే అతను అంతగా నమ్మించడంవల్ల మంచిఅనుకొని మంచు ముక్కలా కరిగిపోయి వివాహం చేసుకోవడం జరిగింది.

ఇదంతా కేవలం ఒక బూటకంఅని ధనకాంక్ష తప్ప మానసత్వం లేదని తేలిపోయింది. అతను ఇంట బయటా అసూయాపరులతో స్వార్థపరులతో సాంగత్యాలు చేయడం, తన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు, బిడ్డలను మించిన తన తోబుట్టువుల పెంపకాలకు, చదువులకు, అనుబంధాలకు, అభివృద్ధికి, ఐక్యతను అవ్యక్తి అడ్డు రావడం, ఎన్నెన్నో అబద్ధాలు, నెరాలు కల్పించి వీధికెక్కించి మాన ప్రాణాలతో చెలగాట మాడటం జరిగింది. వీటిని భరించలేక లీలవతి అతనికి తన జీవితంనుంచి వీడ్కోలు చెప్పడానికి ప్రయత్నించారు. ఒంటరిగా ఎంతో పోరాటం చేశారు 2-7-1990 లో రాజమండ్రి కోర్టు చట్టరీత్యా వీరి వివాహాన్ని రద్దు చేసింది అది లీలావతికి వ్యక్తిగత స్వాతంత్ర దినోత్సవం. నాటినుంచి లీలావతి సరిక్రొత్త ఊపిరిపోసుకొని దైవాన్నే నమ్ముకొని కర్తవ్యంలో, సోదరసోదరీల పెంపకంలో, వారిని చదివిపచడంలో, తీర్చిదిద్దడంలో, నిమగ్నమయ్యారు.

దైవస్వప్నాలు :

మన పురాణాల్లో, తెలుగు సాహిత్యంలో దైవ స్వప్నాల సంఘటనలు చాలా కనిపిస్తాయి తిక్కన, పోతన, అప్పకవి, అన్నమయ్య, మొల్ల వంటి మహాకవులకు, కవయిత్రులకు, ఇంకా ఎందరో భక్తులకు స్వప్నాల్లో హరిహర నాథుడు, శ్రీరాముడు, శ్రీహరి, వేంకటేశ్వరుడు మొదలైన దేవతామూర్తులు దర్శనమిచ్చి కొన్ని ఆదేశాలు చేయడం లోకవిదితమే.

ఆకవులను హృదయ పూర్వకంగా ఇష్టపడి చదివే వారికి, భక్తి హృదయులకు కూడా ఇలాంటి స్వప్నాలు రావడం సహజం. లీలావతికి చిన్ననాటి నుంచి తాత, అమ్మానాన్నలు, సద్గురువులు దైవభక్తికి ప్రబోధించారు. ఆమెకు కూడా దైవభక్తి అంటే చాలా ఇష్టం. తనకు ఏకారణంగానైనా భయాందోళనలు కలిగితే 'హరేరామ హరే కృష్ణ' స్మరణ చేసుకోమని, ఆంజనేయ దండకం చెప్పుకోమని అమ్మానాన్నలు, తాత, సద్గురువు శ్రీ కుంజమూరు గోపాలాచార్యులవారు చిన్నప్పటినుంచీ బోధించడంవల్ల ఆమెకు అవి అలవాటైపోయాయి. అలా హరినామస్మరణ ఆమె రక్తంలో ప్రవహిస్తోంది కలలోను, మెలకువలోను గోవింద నామస్మరణను వదలరు. స్వప్నాల్లో దేవతామూర్తులను సందర్శించి పరమానందం చెందుతుంటారు.

1. లీలావతి పల్లెటూళ్ళో తమ పొలాల్లో ఇరవైరెండేండ్లు ఎండల్లో, వానల్లో తల్లిదండ్రులతోపాటు మగవాణ్ణి మించినట్లుగా వ్యవసాయం చేశారు. ఆ పొలాలలో ఆమెకు ఆవ్యాజానుబంధం ఏర్పడింది. ఇప్పటికీ ఆమె జీవాత్మ స్వప్నాల్లో అక్కడి పొలాలకు వెళ్ళి తిరుగులాడి సంతృప్తిచెంది వచ్చి శరీరపంజరంలోకి చేరుకుంటూ ఉంటుంది.

ఒకసారి తెల్లతాటికాయలచెట్టు ప్రక్కగా ఉన్న పొలంలో శేషశయనంపై పడుకొనిఉన్న శ్రీరంగనాథుని సజీవరూపంగా సందర్శించి ప్రదక్షిణ చేశారు. లీలావతికి ఆళ్వారుల చరిత్ర చదివింది మొదలు శ్రీరంగపట్టణంలోని శ్రీరంగనాథుని దర్శించి అనుభూతి చెందాలనే కోరిక ఉంది. అది స్వప్నంలో ఇలా ఫలించినట్లుంది.

2. ఒకనాటి సాహితీ సభలో వీణాపాణి, శ్వేతవస్త్రధారిణీ అయిన సరస్వతీదేవిని సజీవంగా సందర్శించారు. అప్పుడు దేవిముందు పూలవాన కురిసింది. దేవి ఒక తెల్లని సంపెంగపువ్వును తీసి

లీలావతి కిచ్చింది. అప్పుడు లీలావతి ఆనందబాష్పాలతో పుల కించిపోయి "మాణిక్యవీణాముపలాలయంతీం" అనే శ్లోకాన్ని పఠించి 'జయజననీసుధా సముద్రాంత హృద్యన్మద్వీప" అనే దండకం చెప్పడానికి సిద్ధమయ్యారు. మళ్ళీ పూర్తిగా గుర్తు వస్తుందో లేదోనని సందేహించి ఆపేశారు, అంతలో మెలకువ వచ్చేసింది. ఈ దండకం నేర్చుకోవలసిందని, నేర్చుకుంటే సరస్వతీదేవి అనుగ్రహించి కవిత్వ రచనాశక్తి నిస్తుందని తండ్రి మొదటినుంచి చెబుతుండటం వల్ల లీలావతి కంఠస్థం చేసింది. అది ఇలా స్వప్నరూపంలో ప్రతిబింబించింది.

3. లీలావతికి మొదటి నుంచీ అధిక సంతానం పట్ల నిరసన, విముఖత్వం ఉంది. అధిక సంతానం వల్ల సమస్యలు, కలతలు రోగాలు, దరిద్రం పెరిగిపోతుందని లాలన, పాలన కష్టమైపోతు ందని, భవిష్యత్తును, ఆదాయాన్ని ఆలోచించకుండా పిల్లల్ని కన డం నేరమని, పాపమని, కుటుంబ దేశద్రోహమని పెద్దల్ని హెచ్చరించేవారు. పెద్దలు తిట్టి కొట్టి నోరుమూయించేవారు. అయినా లీలావతి మనసు ఆవేదనా పడుతూనే ఉండేది. అదే స్వప్నంలో ఈవిధంగా వచ్చింది.

తన తల్లికి చివరి ఆడ బిడ్డ తర్వాత మరో సంవత్సరానికి తొమ్మిదవ కాన్పులో మగ బిడ్డ పుట్టినట్లు ఒకనాటి స్వప్నంలో లీలావతి దర్శించారు, లీలావతి దుఃఖానికి, కోపానికి అంతు లేక పోయిం ది. 'ఇప్పుడే ఇల్లు పట్టనంత మంది పిల్లలు, భూమి పట్టనంత బంధుజనులు ఉండగా మళ్ళీ ఏలా పోషించాలని ఈబిడ్డను కన్నావు'? అని తల్లిని ప్రశ్నించింది. తల్లి ఏమి మాట్లాడక చూస్తోంది,

అప్పుడు ఉగ్రనరసింహస్వామి లీలావతికి దర్శనమిచ్చాడు. స్వభావరీత్యా అతి భయస్థురాలైన లీలావతి ఆ ఉగ్ర నరసింహ స్వామి రూపాన్ని చూచి భయాందోళనలు చెందారు. తల్లి పడు

కొని ఉన్న మంచం చుట్టూ తిరుగుతూ 'హరేరామ హరేకృష్ణ' నామం చెప్పుతున్నారు. అప్పుడు ఆస్వామి తన ఉగ్రత్వాన్ని వదలుకొని చేయెత్తి దీవించారు. ఈ స్వప్న వృత్తాంతాన్ని బట్టి 'జరిగితీరవలసిన వాటిని ఎవరూ ఆపలేరని, భగవంతునిపై భారం వేసి ధైర్యంగా జీవించాలని' లీలావతి గ్రహించారు. అశాశ్వతమైన లౌకిక మాయా జాలాన్ని కాక శాశ్వతమైన దైవాన్ని స్వప్నంలో దర్శించి ఆనందించడం ఆమె జ్ఞానానికి నిదర్శనం.

లీలావతి తండ్రి గారికి కూడా ఎప్పుడైనా శత్రుభీతి కలిగితే శ్రీ వేంకటేశ్వరుడు స్వప్నంలో ప్రత్యక్షం అవుతాడని, తర్వాత కష్టాలు తొలగిపోతాయని, ఒకనాటి స్వప్నంల్లో 'నమస్తేస్తు మహామాయే శ్రీ పీఠే సురపూజితే' అనే మహాలక్ష్మి శ్లోకాన్ని తన తండ్రి పఠిస్తుండగా తన తల్లి ఏదో అవసరమై నిద్రలేపేసిందని తన తండ్రి లీలావతికి చెప్పడం జరిగింది.

పొన్నావంశలో పూర్వ నుంచి కూడా దైవమహిమలు, అద్భుత ఘట్టాలు జరగడం విశేషం

లీలావతి చిన్ననాటి నుంచి చదువుల మీద ఎంతో ప్రేమతో, చిత్తశుద్ధితో, పట్టుదలతో పరిశ్రమించి చదువుకున్నారు. ఎంతో పరిజ్ఞానం సంపాదించారు. బాల్యం నుంచీ ఆమెకు పాఠాలు చెప్పిన గురువులందరూ ఉత్తములు కావడం, వారందరి ఆశీస్సులు ఆమెకు లభించడం విశేషం. అన్నింటికీ మించి ఆమెకు దైవానుగ్రహబలం అధికంగా ఉండటం వల్ల రెండు ప్రభుత్వోద్యోగాలు వెతుక్కుంటూ వచ్చాయి.

1983లో ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ నిర్వహించిన వ్రాత పరీక్షలోను, 1984లో మౌఖిక పరీక్షలోను ఉత్తీర్ణురాలై జూనియర్ లెక్చరర్‌గా ఎంపికయ్యారు. కాని ఉద్యోగనియామకం ఉత్తర్వులు రావడం ఐదు సంవత్సరాలు ఆలస్యమయింది.

1986, జనవరి నుంచి మార్చివరకు తిరుపతి సమీపంలోని పుత్తూరు ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో పార్ట్‌టైం తెలుగు లెక్చరర్‌గా పనిచేశారు. పూర్తి కాలిక తెలుగు లెక్చరర్ చేరడం వల్ల లీలావతి అక్కడ ఉద్యోగం విర మించవలసి వచ్చింది.

సెలెక్ట్ అయిన జూనియర్ లెక్చరర్ ఉద్యోగం ఆలస్యంకావడం, పార్ట్ టైం ఉద్యోగం తొలగిపోవడం, పొలాల్లో పంటలు లేకపోవడం, ఇంటినిండా జనాభా ఉండటం ఏవిధమైన ఆదాయం లేకపోవడంతో లీలావతి నిరాధార మయ్యారు. ఎంతోమందికి ఆశ్రయమిచ్చి ఆదరించిన కుటుంబంలో పుట్టి పెరిగిన లీలావతి నాలుగు సంవత్సరాలు అప్పులతో జీవితం సాగిస్తూ తన తోబుట్టువుల అవసరాలను, చదువులను చూసుకోవలసివచ్చింది.

1987లో ఒకనాడు లీలావతికి ఒకమంచి ఆలోచన మెరుపులా మెరి సింది. అది హైదరాబాద్ సార్వత్రిక విశ్వవిద్యాలయంలో శిష్యవాత్సల్య మూర్తులు ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి (ఎస్ వి యూనివర్సిటీలో లీలావతికి గురువర్యులు) గారిని కలుసుకునేలా చేసింది. లీలావతి బాధలను గుర్తించిన గురువర్యులు ఆమెను ఎంతో ఓదార్చి ధైర్యం చెప్పి ఎ. రవీంద్ర భారతి దగ్గర కళాభవన్‌లో తెలుగు విశ్వవిద్యాలయం కార్యాలయం ఉందని అక్కడ వైస్‌చాన్స్‌లర్‌గా ఆచార్య తూమాటి దోణప్పగారున్నారని, వారిని కలుసుకొని పి.హెచ్ డి. పుస్తకం ఇచ్చి పరిస్థితి చెప్పమని ఆశీర్వదించి పంపారు. లీలావతికి ఆ ప్రకారంగానే చేశారు.

ఇలా గురువర్యులు ఆచార్యకేతు విశ్వనాథరెడ్డిగారు తెలుగు విశ్వ విద్యాలయానికి మార్గం చూపించారు. అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరులు ఆశీస్సు చేసారు. ఆచార్య తూమాటి దోణప్ప వైసచాన్స్‌లర్‌గారు, శ్రీ టి. ప్రసాదరావు రిజిస్ట్రార్, వారి కమిటీ లీలావతి విద్యార్హతలను, యోగ్యతను గుర్తించారు. లీలావతి విశ్వవిద్యాలయ స్థాయిని చేరుకున్నారు.

10-6-1987 నుంచి ఆగస్టు 31వ తేదీ వరకు హైదరాబాద్, తెలుగు విశ్వవిద్యాలయంలో ఉన్నారు.

1-9-1987 లో రాజమండ్రి ప్రాంగణం తెలుగు విశ్వవిద్యాలయం, భక్తిపదకవితా శాఖలో లెక్చరర్‌గా చేరారు.

1992 నుంచి సీనియర్ లెక్చరర్‌గా.

1998 నుంచి అసోసియేట్ ప్రొఫెసర్ (రీడర్)గా.

29-1-1998 నుంచి దేశిసాహిత్యశాఖ, ఇన్‌చార్జ్-హెడ్‌గా.

29-1-1999 నుంచి దేశిసాహిత్యశాఖ హెడ్‌గా.

28-8-1999 బోర్డ్ ఆఫ్ స్టడీస్ మెంబర్‌గా.

నిర్వహించిన జాతీయ సదస్సులు :

1. 1998, మార్చి 25, 24 తేదీల్లో-
దేశిసాహిత్యం-చర్చా సదస్సు
2. 1998, నవంబర్ 27, 28 తేదీల్లో
స్వర్ణాంధ్ర భారతి-దేశిసాహిత్యం-చర్చాసదస్సు
3 2000, డిసెంబర్ 11, 13 తేదీలలో
దేశిసాహిత్యం-శతవాఙ్మయం-చర్చాసదస్సు

పాల్గొన్న పునశ్చరణ తరగతులు :

రెండుసార్లు రాజమండ్రి ప్రాంగణం
పొ. శ్రీ. తె. వి. వి. సాహిత్యపీఠంలోను,
ఒకసారి హైదరాబాద్ ఉస్మానియా విశ్వవిద్యాలయం
తెలుగుశాఖలోను పాల్గొన్నారు.

ఉద్యోగానుభవం : 15 సం॥లు

పర్యవేక్షణ : వీరి పర్యవేక్షణలో 40 ఎం. ఫిల్. డిగ్రీలు,
12 పి. హెచ్. డి. డిగ్రీలు వెలువడ్డాయి.
వీటిలో కొన్నింటికి బంగారు పతకాలు వచ్చాయి.

రాష్ట్రరాష్ట్రేతర ప్రాంతాల్లో పాల్గొన్న సదస్సులు : 30 పైగా
పాల్గొన్న కవిసమ్మేళనాలు : 40 పైగా

ఉద్యోగసంబంధమైన ఇతర బాధ్యతలు : 1990-91లో తెలుగు విశ్వవిద్యాలయం ఉద్యోగుల సంక్షేమసంఘం (సాహిత్యపీఠం నుంచి) కార్యదర్శిగా

ప్రస్తుతం 2002 మార్చి నుంచి (2 సం॥ లు) పొ. శ్రీ తె. వి. వి. అకడమిక్ స్టాఫ్ అసోసియేషన్ (సాహిత్య పీఠంనుంచి) వైస్‌ప్రెసిడెంట్‌గా.
నిర్వహించిన కుటుంబ బాధ్యతలు :

రెండేండ్ల బాల్యంలోనే పొలాల్లో ఎండల్లో వ్యవసాయం పనులు చేసే తండ్రి కష్టాన్ని గుర్తించిన లీలావతి తన కుటుంబ శ్రేయస్సే తన శ్రేయస్సుగా భావించారు. కుటుంబంలో చిన్న, పెద్ద బాధపడుతుంటే తానొక్కటే సుఖపడటం నీచమని తలచారు.

బావిలో నీళ్ళు నానాటికి తగ్గిపోవడం, వర్షాలు లేకపోవడం, పంటలు ఎండిపోవడం, భూములు బీడుపడిపోవడంతో కుటుంబ ఆర్థిక పరిస్థితి క్షీణించింది. అధిక సంతానంవల్ల, శక్తికి మించి ఇంటిపనులు, వంట పనులు, పొలంపనులు, బంధుజనుల పనులు చేయడంవల్ల తల్లిఆరోగ్యం దెబ్బతిన్నది. ఫిట్స్ వ్యాధిగా పరిణమించింది. ఇంటిపెద్దలు, ఆమె చేతుల్లో పెరిగి ప్రయోజకులైనవారు ఎవ్వరూ పట్టించుకోలేదు పైగా ఊర్లోవాళ్ళతో సహా అందరూ ఆదేదో భూతం ఆవహించిందని మూర్ఖంగా భావించారు. మాంత్రికుల చేత చింతబెత్తాలతో, జిల్లేడు బెత్తాలతో కొట్టి హింసించారు. అప్పుడు లీలావతి మనస్సు విలవిలలాడింది. కళ్ళముందే అమ్మ ఇలా చిత్రవధకు గురికావడం సహించలేకపోయింది. తనకు వచ్చే అన్నమాచార్య స్కాలర్‌షిప్ డబ్బును కూడబెట్టి మద్రాసుకు రెండుసార్లు తీసుకెళ్ళి ప్రఖ్యాత న్యూరోసర్జన్ డా బి రామమూర్తిగారి దగ్గర వైద్యం చేయించారు. ఆరోగ్యం చక్కబెట్టారు. ఇంత మంచిపని చెయ్యడానికి కూడా ఇంటా, బయటా వ్యతిరేక శక్తులతో ఎంతో పోరాటం చేయవలసి వచ్చింది.

ఇలా 1980లో అన్నమాచార్య స్కాలర్‌షిప్ తీసుకున్ననాటినుంచి ఖర్చులన్నీ తగ్గించుకొని కుటుంబ యోగక్షేమాలకోసం, అభివృద్ధికోసం ..వం కృషి చేశారు. మూఢాచారాలను వ్యతిరేకించారు. తల్లిదండ్రులు

బాధ్యతల్లో భాగస్వామ్యం వహించారు. ఆర్థికంగా అండదండగా నిలి వారు. తాను పడిన కష్టాలు, హింసలు తన తోడపుట్టువులు పడకూడదని తనకు లేని సౌకర్యాలు, నదవకాశాలు వారికి కల్గించాలని కృషి చేశారు

కృష్ణమూర్తి (రవి) అనే తమ్ముడు, పార్వతి, భారతి, వనజ (వాణి) కరుణ అనే చెల్లెళ్ళు లీలావతికన్నా పది, పన్నెండు, పదిహేను, ఇరవై ఒక్కటి, ఇరవై రెండు సంవత్సరాలు చిన్నవాళ్ళు. ఇంత వైపరీత్యం ఎక్కడైనా ఉంటుందా అనే ఆశ్చర్యం కలుగుతుంది. ఒక్కచేతిమీదుగా వీరందరిని పెంచి చదివించే బాధ్యతను ఎంతమంది అక్కలు భరిస్తారు? అనే ఆలోచన కలుగుతుంది.

అందరూ వివిధ రంగాల్లో తనంతటి వాళ్ళు కావాలని, వీరి చతుష్ష సంస్కారాలకోసం కష్టపడ్డారు. ఎన్నెన్ని సబ్జెక్టుల్లో ఎన్నెన్నిసార్లు ఫెయిల్ అయినా ఎంతో ఓర్పుతో, బహువిధ ఉపాయాలతో శిక్షణ ఇచ్చి, ఇప్పించి చదువుల మార్గంలో నడిపించారు. తనవిహార విలాసాలను, కనీస సౌకర్యా లను కూడా త్యజించి వీరికోసం ఖర్చులు పెట్టి అత్యంత దీక్షతో విద్యావం తుల్ని చేయడం జరిగింది. ఒక్క చదువులేకకాక టైప్, టైలరింగ్, పండి ట్ ట్రైనింగ్, గాత్ర సంగీతం. వీణ, వయొలిన్ సంగీతం, నృత్యం వంటి విద్యల్ని, కళల్ని కూడా ప్రోత్సాహించి శిక్షణ ఇప్పించారు.

వీరిలో భారతి అనే రెండోచెల్లాయికి ప్రతి కోర్సులోను ప్రత్యేకమైన శిక్షణ ఇవ్వడం జరిగింది 1996లో విశాఖపట్టణం, ఆంధ్ర విశ్వవిద్యా లయంలో ఎం. ఎ. తెలుగు ఫస్ట్‌క్లాస్, ఫస్ట్‌ర్యాంక్, నేషనల్ ఎలిజిబిలిటీ టెస్ట్ (నెట్‌లో) ఉత్తీర్ణత పొందడానికి సమున్నతమైన శిక్షణ ఇవ్వడం జరి గింది. బాల్యం నుంచీ కూడా వీరందరికి మాట, పాట, దేశిర్వాత, ఉచ్చా రణ, పద్యం, శ్లోకం, దండకం, ఆధ్యాత్మిక విషయాలు, దాతృత్వం, ఇంటి పని, వంటపని, శుచిత్వం, బయటకార్యాలు, ప్రవర్తన, వినయవిధేయతలు క్రమశిక్షణ ఇలా ఒక్కటేమిటి? సర్వసద్గుణాలు అలవడాలని లీలావతి ఎంతో ప్రబోధించడం, తీర్చిదిద్దడం జరిగింది.

అందరూ రచయిత్రి అడుగుజాడల్లో నడుస్తున్నట్లే కనిపించి కాల ప్రభావమో, లోకప్రభావమో, 'బుద్ధికర్మానుసారి' అన్నట్లుగానో ఏమో ఒక్కొక్కరు ఒక్కో దశలో తిరోగతి చెందారు. లీలావతి స్వయంకృషితో వేసిన బంగారుబాటలో నడిచి ప్రతి ఒక్కరు పి. జి. డిగ్రీలు, పి హెచ్ డి డిగ్రీలు, తత్తుల్యమైన డిగ్రీలు పొందవలసిన కాలాల్లో వీరు బ్యాచిలర్ డిగ్రీలు పూర్తిచేసుకోవడం శోచనీయం. రచయిత్రి ఎంత ప్రయత్నించినా వీరెవ్వరూ ఆమెలాగా విద్యలో, ఉద్యోగంలో శిఖరాగ్రాలు చేరుకోలేకపోవడం, కుటుంబ అభివృద్ధిని, కుటుంబ సమైక్యతను చూసి ఓర్వలేని సునుషుల, స్వార్థపరుల మాయమాటల ప్రభావంతో ఎవరికివారు స్వార్థమార్గాల్లో పయనించడం రచయిత్రికి ఆరని శోకజ్వాల అయింది. నీరు పల్లమెరుగు నిజము దేవుడెరుగు" అన్నట్లు రచయిత్రి తన మనస్సును దృఢపరచుకొని సమస్తం దైవానికి విన్నవించుకొని తన విధినిర్వహణలో నిమగ్నమయ్యారు.

నిర్వహిస్తున్న సమాజబాధ్యతలు :

కుటుంబానికి సమాజానికి గోడ మాత్రమే అడ్డు అని, సమాజంలేనిదే కుటుంబం లేదని, కుటుంబం లేనిదే సమాజం లేదని ఆలోచిస్తే అంతా ఒకటేనని లీలావతి సుదీర్ఘంగా ఆలోచించారు. అందుకే ప్రతి మనిషి కూడా కుటుంబంతో పాటు సమాజానికి కూడా బాధ్యత వహించాలని లీలావతి అభిప్రాయం. ఆమె ఆచరణశీలి. ప్రభుత్వం చేపట్టిన అక్షరదీక్ష, మద్యపాన నిషేధం, వృక్షపోషణ, కుటుంబనియంత్రణ, పరిశుభ్రత వంటి కార్యక్రమాల్లో పాల్గొన్నారు. అనేక కవితలు, ప్రబోధగీతాలు వ్రాసి ప్రజలకు స్ఫూర్తికలిగించారు.

స్వంత ఖర్చులను తగ్గించుకొని, కొన్ని అవసరాలను వదులుకొని మానవసేవా సంస్థలకు, దేవాలయాలకు, అన్నదాన కార్యక్రమాలకు విరాళాలు అందించి ప్రోత్సహించడం, వివిధ సాహిత్య, సాంస్కృతిక పత్రికలను చందాలివ్వడం, జీవిత సభ్యత్వాలు స్వీకరించడం, కవిపండిత గాయక కళాకారులను సత్కరించడం, అర్హులకు, పేదలకు, పేదశిష్యులకు ధన, వస్తు, వస్త్ర, పుస్తకరూపాల్లో దానధర్మాలు చేసి సహాయపడటం

మానసిక దుర్బలులకు, బాధాతప్తులకు ధైర్యం చెప్పడం, దైవభక్తి ప్రబోధంచేసి ఓదార్చడం ఆమె ఔదార్యానికి, సాటి మానవ ప్రేమకు, దయా హృదయానికి నిదర్శనం. ఇలా రచయిత్రి నీడలో సరికొత్త ఊపిరులు పోసుకుని నిలదొక్కుకున్నవారు, విద్యావంతులై ప్రయోజకులైనవారు, నాగరికులుగా, నిష్కల హృదయులుగా మారినవారు కోకొల్లలు.

అభిరుచులు :

లీలావతికి బాల్యంనుంచీ కూడా పద్మశ్రీ ఘంటసాల, డా. బాలమురళి, శ్రీ పి. బి, శ్రీనివాస్ శ్రీమతి సుశీల, లీల, జానకి మొదలైన మధుర గాయక గాయనీ మణులు పాడిన గీతాలంటే చాలా ఇష్టం. బాల్యం నుంచీ కూడా అన్నిరకాల పాటల పోటీల్లో ఎప్పుడూ బహుమతులు గెలుచుకునేవారు, అలాగే అన్నమయ్య సంకీర్తనల్ని వినడం, పాడటం నిత్యకృత్యాల్లో ఒక భాగం

వేదాలు, పురాణ, రామాయణ, భారత, భగవద్గీతాది మహాగ్రంథాలు, భక్తికావ్యాలు చదవడం అత్యంత ప్రీతికరం.

అధ్యాపకురాలుగా అన్నిరకాల సాహిత్య ప్రక్రియల్ని చదవడం, రచనలు చేయడం తప్పనిసరి.

సక్కుబాయి, మీరా, మొల్ల, తరిగొండ వెంకమాంబ వంటి భక్తురాండ్ర చరిత్రలను, రుద్రమదేవి, ఝాన్సీలక్ష్మిబాయి వంటి వీరనారీమణులను, భగత్‌సింగ్, ఆజాద్, అల్లూరి సీతారామరాజు వంటి వీరపురుషులను గాంధీ, మదర్‌థెరిసా, దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ వంటి మానవసేవా తత్పరులను, కందుకూరి వీరేశలింగం దంపతులవంటి సమాజ సంస్కర్తలను, స్మరించుకొని స్ఫూర్తి చెందడం, నిరంతర సాధన, ఆత్మప్రబోధం, తెలిసిన విషయాల్ని ఇతరులకు చెప్పి సన్మార్గంవైపు నడిపించడం. సజ్జనసాంగత్యం.

సందేశం :

ప్రతి మనిషి కుటుంబానికి, చుట్టూవున్న సమాజానికి, దేశానికి బాధ్యత వహించాలని ఇతరుల త్యాగాలను, అనుభవించడమే కాదు తాము

కూడా అవసరం ఉన్నచోట త్యాగం చేయాలని ప్రబోధించడం, సమైక్య తకు కృషిచేయాలని, సద్భావంతో, మెలగాలని, స్త్రీకి వివాహంకన్నా విద్యా భ్యాసం, స్వతంత్ర జీవితం ముఖ్యమని, మానవజీవితాన్ని స్వార్థత్యాగంలో, మానవసేవలో, కర్తవ్యదీక్షలో, దైవారాధనలో సార్థకం చేసుకోవాలని, సత్ సాంగత్యం చేయాలని, సాధనచేసి దుర్గుణాలను, మానసిక చపలత్వాన్ని వదలుకోవాలని, ఓర్వలేని మనుషుల మాయమాటలకు లొంగకూడదని, జీవిత లక్ష్యాన్ని సాధించాలని, అన్నింటికన్నా ముఖ్యంగా వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దుకొని ఆదర్శంగా జీవించాలని రచయిత్రి సందేశం.

పొందిన పురస్కారాలు :

1. పి. హెచ్. డి. చేస్తున్నప్పుడు దేశవ్యాప్తంగా టి,టి.డి. వారి అన్న మాచార్య స్కాలర్‌షిప్ పొందిన ఐదుగురు పరిశోధకుల్లో లీలావతి ఒకరు కావడం విశేషం. దీన్ని ఆమె దైవమిచ్చిన పురస్కారంగా భావించారు. ఇది ఇరవైరెండు వేల రూ॥ పురస్కారం. (1980-83)

2. సాహిత్యకృషికి మెచ్చి రోటరీక్లబ్ రాజమండ్రివారు రజతపతక బహూకరణ–1996.

3. రాష్ట్ర మనోరంజని హైదరాబాదువారిచే ఉత్తమ ఉపాధ్యాయినీ పురస్కారం–1996. సంగీత సాహిత్యాలలో ప్రతిభను గమనించి సాహితీ సవ్యసాచి బిరుదు.

4. "కరుణ కమలం" వచన కవితా సంపుటికి సృజన ఆర్ట్స్ క్రియేషన్ హైదరాబాద్‌వారి విశిష్ట పురస్కారం–1996.

ఇంకా రాష్ట్ర రాష్ట్రేతర ప్రాంతాల్లో వివిధ సాహిత్య సంగీత సభ ల్లో, రేడియో కేంద్రాల్లో ఉపన్యాస గానాలుచేసి అనేక విధాల సన్మా నాలు, ప్రశంసా పత్రాలు పొందుతున్నారు. వినయశీలం, వివేకం, కృత జ్ఞత, దైవభక్తి, నిరంతర కృషి ఏ వ్యక్తినయినా సమున్నతస్థాయికి చేర్చుతా యని లీలావతి విశ్వాసం.

రచయిత్రి ముద్రిత గ్రంథాలు :

1. అన్నమయ్య సంకీర్తనల్లో జానపదగేయ ఫణితులు-1986 (పి హెచ్ డి. సిద్ధాంత గ్రంథం)

2 పదకవితా వైజయంతి-1993 (పదసాహిత్యాంశాలు)

3 అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో స్త్రీ ధర్మాలు 1994 (ప్రాజెక్ట్ వర్క్)

4 సంకీర్తనా జ్యోతి-1996 (తాళ్ళపాక కవుల సంకీర్తనల్లో విశేషాలు)

5 కీర్తనా కౌముది-1999 (పదసాహిత్యాంశాలు)

6 ప్రకీర్ణభారతి-1999 (వివిధ సాహితీ ప్రక్రియల పై పరిశోధనా వ్యాసాలు)

7 అన్నమయ్య అమృతవాణి 1999 (అన్నమయ్య సుభాషితాలు)

8. సంకీర్తనా సౌరభం-2002 (తాళ్ళపాక కవుల సంకీర్తనాంశాలు)

రచయిత్రి సృజనాత్మక కావ్యాలు

1. కరుణకమలం (వచన కవితాసంపుటి)-1996 దీనికి హైదరాబాద్ సృజన ఆర్ట్స్ అకాడమీ వారి ఉత్తమ వచన కవితా సంపుటి బహుమతి లభించింది)

2. ప్రేమదీపం (వచన కవితా సంపుటి)-1999

3. లీలా గీతమాల (గేయకవితా సంపుటి)-1998

4. లీలా కథామాలిక (కథల సంపుటి)-1999

5. తాళ్ళపాక తన్మయత్వం (సంగీత రూపకం)-2000

అముద్రిత పరిశోధనా గ్రంథాలు

1. పదకవిత్వం-సాంఘిక సాంస్కృతిక అధ్యయనం (ప్రాజెక్ట్‌వర్క్, పూర్తిచేసిన సంవత్సరం-1999)
2. తాళ్ళపాక కవుల సంకీర్తనల్లో పుష్పాభివర్ణన (యు.జి.సి. మైనర్ రీసెర్చ్ వర్క్, పూర్తిచేసిన సంవత్సరం-2001)

అముద్రిత సృజన కావ్యాలు

1. లీలారాగమాల (గేయాలు)
2. చైతన్య కిరణం (వచన కవిత్వం)

లీలగారి అనుబంధాలకు, అనుభవాలకు, ఆదర్శాలకు, ఆచరణకు, సమస్యల పోరాటాలకు, దుఃఖాలకు, సందేశాలకు నిలువుటద్దాలు వారి సృజనాత్మక కావ్యాలు.

వారి ఆలోచనలకు, విశ్లేషణాశక్తికి, రచనాదీక్షకు, అంకితభావానికి నిరూపణలు వారి పరిశోధన గ్రంథాలు,

ఇలా డా పొన్నా లీలావతి అధ్యాపకురాలుగా, పర్యవేక్షకురాలుగా, దేశిసాహిత్య శాఖాధిపతిగా, రచయిత్రిగా, కవయిత్రిగా, వక్తగా, గాయనీ మణిగా, కుటుంబంలో పెద్దకూతురుగా, సమాజంలో బాధ్యతాయుతమైన వ్యక్తిగా తమశక్తికిమించి బాధ్యతలు వహించి ఆర్తులకు, సాటిమానవులకు తోడ్పడుతూ తమ పాత్రను సమర్థవంతంగా నిర్వహిస్తున్నారు.




ది. 11-4-2001 తేదీన రాజమండ్రి రోటరీ కైలాస భూమి
కార్యక్రమాలకోసం తమ తాత సహజ సంగీత, సాహిత్య, చిత్ర లేఖన, శిల్ప,
నాటక కళా కోవిదులు, మహాదాత, రామభక్తులు, మహిమాన్వితులు
పొన్నా కోదండరామ గారి
జ్ఞాపకార్థం ఐదువేల రూపాయలు విరాళమిస్తున్న
డా॥ పొన్నాలీలావతి.
వేదికపై రోటరీ అధ్యక్షులు శ్రీ పట్టపగలు వెంకట్రావుగారు,
శ్రీమతి పట్టపగలు అనంతలక్ష్మిగారు,
పొ.శ్రీ.తెలుగు విశ్వవిద్యాలయం సాహిత్యపీఠం
డీన్ ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు
ప్రఖ్యాత వస్త్రవ్యాపారవేత్త శ్రీ బొమ్మన రాజకుమార్‌గారు మొదలైనవారు.



గురువుపై, అన్నమయ్య శ్రీవేంకటేశ్వరులపై
అపారమైన భక్తి శ్రద్ధలతో ఈ గ్రంథముద్రణకు
వెయ్యిరూపాయలు విరాళం అందించిన
పశ్చిమ గోదావరి జిల్లా జానపద
సాహిత్య పరిశోధన విద్యార్థి
డా॥ వెలుగట్ల శ్రీనివాసరావు.

శ్రీరస్తు

**సౌజన్య సింధువు**

డా॥ పొన్నా లీలావతి గారికి

**ప్రశంసాపద్య ప్రసూన మాలిక**

వేంకటేశ్వర పాదార విందసేవ
నా సురధునీ లహరిలో ననారతంబు
నోలలాడెడు సద్భక్తురాలవీవు
స్తవము గాదీ పలుకు యధార్థమ్ము సుమ్ము

అన్నమాచార్య కీర్తనలన్న నీకు
హృదయముప్పొంగు సంద్రంబు రీతి నీదు
మధుర గానామృత ఝరి,యస్మాదృశులకు
ప్రమదమును గూర్చు గాంధర్వ పరభృతంబ

స్వార్థ చింతన వీడి యశ్రాంత మీవు
పరహితార్థమై జీవితపథమునెల్ల
సుగమ మొనరించినట్టి నిస్తులయశోవి
రాజమానవు వినయాంబు రాశివిలను


శ్రీ మండపాటి సీతారామయ్య
రిటైర్ ఆంధ్రోపన్యాసకులు
ఫోన్ నెం: 417044, ధవళేశ్వరం

తేది 18-12-2001.

**అక్షరలీల**

తే.గీ. తెలుగుశాఖకు యధిపతి తెలుగు మహి
అన్నమాచార్యసేవకై యంగలార్చు
గాన వాహిని యీ లీల గాత్ర శోభ
వర్ణనాతీత శారద వరమె సుమ్ము

**కవిమిత్ర**


శృంగారకవి రాధాకృష్ణ
కవి నికేతన్ స్థాపకులు
ఫోన్ నెం: 08814 - 740151
నర్సాపురం - 534275
పశ్చిమ గోదావరి జిల్లా.